# ఔను.. మళ్లీ... శాంతాకే DSIR అవార్డు!

2003 సంవత్సరానికి బయోటెక్నాలజీ రంగంలో ప్రతిష్ఠాత్మకమైన **డి.ఎస్.ఐ.ఆర్. అవార్డు** గెలుచుకోవడంతో, ఈ అవార్డును రెండుసార్లు పొందిన ఘనత శాంతా బయోటెక్నిక్స్‌కు దక్కింది!

1999లో తమ ప్రథమ ఉత్పాదన శాన్‌వాక్-బి (హెపటైటిస్-బి వ్యాక్సిన్)తో తొలి నేషనల్ టెక్నాలజీ అవార్డును, DSIR అవార్డును గెలుచుకుని స్తబ్దంగా ఉన్న బయోటెక్ సరోవరంలో శాంతా సృష్టించిన తరంగాలు ప్రాణరక్షక ఔషధాలను సామాన్యుడి ముంగిటికి చేర్చాయి.



నవంబరు 10, 2003న ఢిల్లీలో కేంద్ర ప్రభుత్వ శాస్త్ర సాంకేతిక శాఖ సహాయమంత్రి శ్రీ బి.ఎస్.రావత్ నుంచి **DSIR** అవార్డు-2003 అందుకుంటున్న శాంతా బయోటెక్నిక్స్ మేనేజింగ్ డైరెక్టర్ శ్రీ వరప్రసాద్ రెడ్డి.

**బ్లడ్ కాన్సర్ (సి.ఎమ్.ఎల్), కిడ్నీ కాన్సర్ (ఆర్.సి.సి.) క్రానిక్ వైరల్ హెపటైటిస్ ఇత్యాది రోగాల చికిత్సలో రోగనిరోధకశక్తిని పెంపొందించే ఇంటర్‌ఫెరాన్ ఆల్ఫా-2బి ను తొలిసారిగా దేశీయ వైజ్ఞానిక పరిజ్ఞానంతో రూపొందించి, తయారుచేసి "శాన్‌ఫెరాన్" పేరుతో ప్రవేశించిన ఏడాదిలో మార్కెట్‌లో 20 శాతం కైవసం చేసుకున్న విజయం శాంతాదే!**

శాస్త్ర పరిశోధనా ఫలితాలను పారిశ్రామిక రంగానికి అందించగలిగే ప్రతిభకు గుర్తింపుగా డిపార్టుమెంట్ ఆఫ్ సైంటిఫిక్ & ఇండస్ట్రియల్ రిసెర్చ్ (DSIR) ఏటా యిచ్చే అవార్డుకుశాంతా బయోటెక్‌ను ఎంపిక చేసిన కారణమూ అదే!

## శాన్‌ఫెరాన్ ప్రత్యేకతలు

- ✦ మానవశరీర నిర్మాణానికి సన్నిహితంగా ఉండే ఈస్టు ప్రక్రియ నుపయోగించి నాణ్యతను గణనీయంగా పెంచడం
- ✦ దిగుమతి చేసుకున్న ఇంటర్‌ఫెరాన్ల కంటె మూడవ వంతు ధరకే అందించి కాన్సర్ చికిత్సపై లక్షలాది ఖర్చు తగ్గించడం

**సాంకేతికంగా తలమానికం - సామాన్య కుటుంబాలకు ఉపశమనం**

**పరిశోధనే ఆలంబనగా సాగే శాంతా ఉత్పాదనలకే ఇది సాధ్యం!**




**శాంతా**
**బయో టెక్నిక్స్ (ప్రై)లి.**
www.shanthabiotech.com

హాసం
హాస్య-సంగీత పత్రిక

# ఇవీ సంగతులు

53

**Also available on net:**
**www.haasam.com**

**ముఖచిత్రం**
'ఆంధ్రావాలా' లో
ఎన్టీఆర్



## హాస్యం — సంగీతం

















'సెంటర్ స్ప్రెడ్' లో



సినిమా పాటల పుస్తకం

పాటల ప్రత్యేకం

69,70,71,
72,73,74
పేజీల్లో








మన 'హాసం' 16-30 నవంబరు 2003 సంచికలో 'ఓంకార పంజర' ఇత్యాది - ప్రార్థన శ్లోకాలను సంచిక 70 వ పుటలో ప్రచురించారు.

అది "ఓంకార పంజర శుకీం". కాని మీరు ముద్రించినట్లు ఓంకార పంజర సుఖీం కాదు.

ఈ మొదటి శ్లోకంలో మూడు పక్షులున్నాయి. అది - 'ఓంకారం' గానం చేసే పంజరశుకి అనగా పంజరంలోని చిలుక. తరువాత ఉపనిషదుద్యానకేళి కలకంఠీం! ఆగమ విసిన మయూరి కూదాలు అదే అడవిలో ఉండే నెమలి.

తెలిసిన నాబోటివాడు చెప్పకపోతే ఈ శ్లోకం 'ఓంకార పంజర సుఖీం' అని శ్రోతలు తప్పు పాఠం అలవాటు చేసేసుకుంటారని వ్రాస్తున్నాను.

- డా॥ బాలాంత్రపు రజనీకాంతరావు, విజయవాడ.

శ్రీ మహావిష్ణువును సేవించుకునే భాగ్యాన్ని తిరిగి త్వరగా పొందడం కోసం - ఏడు జన్మల మిత్రత్వం కన్నా - మూడు జన్మల శత్రుత్వాన్నే కోరుకున్నారట జయ విజయులు. అలా ఒక తప్పు ద్వారానైనా మీ అక్షర సాక్షాత్కారం మాకు, మా పాఠకులకు జరిగిందని సంతోషిస్తున్నాం. తెలుగు సినిమా గీతం, సంగీతం పుట్టుకనుంచి ఎరిగిన పెద్దలు మీరు. అపారమైన మీ విజ్ఞానం, తెలిసిన విషయాన్ని సహృదయంతో, సంస్కారంతో అందించే మీ ప్రతిభాపాటవాలు ఈ తరం పాఠకులకు కూడా అందాలని వినమ్రంగా కోరుకుంటున్న మీ అభిమానులం మేము. మరోసారి మీకు కృతజ్ఞతలనర్పిస్తూ -

'హాసం' యాజమాన్య సంపాదకవర్గం.

16-30 నవంబరు 2003 సంచికలో వచ్చిన 'ఎల్బీశ్రీరాం సిన్మా తీస్తే' కథకు ముందు జరిగిందేంటంటే... ఉన్నట్టుండి ఓరోజు 'హాసం' నుంచి ఫోనొచ్చింది - 'చాలాబావుంది' సినిమాలో స్టిల్ కావాలంటూ.. ఎందుకన్నాను. 'చెబితే గాని ఇవ్వరా!?' అన్నారు రాజాగారు సరదాగా... "ఏవిటో తెలిస్తే బావుంటుందిగా" అన్నాను. 'ఇష్యూ వచ్చాక చూస్తే ఇంకా బావుంటుంది' అన్నారాయన. ఆయనతో వాదించటం కన్నా ఆయన చేసే పనులని ఆస్వాదించటంలోనే ఆనందం నాకు. సరేనని పంపించాను. నిజంగానే ఇష్యూలో చూస్తే అద్భుతంగా వుంది. 4 ఏళ్ళ క్రితం 'చాలాబావుంది' లో ఆ టింగరిబుచ్చి వేషం వేషం ద్వారా జనాల్ని నవ్వించి బ్రేకు తెచ్చుకున్న



నేను కడుపుబ్బ నవ్వుకున్నాను - 'ఎల్బీశ్రీరాం సినిమా తీస్తే' కథ చదివి ! సాటి హాస్య నటుల్ని కూడా ఇన్వాల్వ్ చేస్తూ ప్రెజెంట్ చేసిన 'బొమ్మల కొలువు' పేజీకి ఎంతో నిండు దనాన్ని తెచ్చింది. రచయిత కర్లపాలెం హనుమంతరావుగారికి మంచి భవిష్యత్తు ఉంటుందని నా నమ్మకం. ఆయనకి, బొమ్మ వేసిన గోపాలకృష్ణగారికి, ప్రచురించిన 'హాసం' కి మరీ మరీ కృతజ్ఞతలు.

-ఎల్బీ శ్రీరాం, హైదరాబాద్.

అన్ని రచనలతో పాటు 'సరిగపదమని' అద్భుతంగా అలరిస్తోంది. విశేషమేమిటంటే ఈ ఫజిల్‌లో ఆల్ కరెక్టు అయిన వాళ్లకే ప్రైజు విషయంలో ఎక్కువ పోటీ ఉంటోంది. ఒక తప్పు, రెండు తప్పులు, మూడు తప్పులు లిస్టులో ఉంటే ప్రైజు లక్కీడిప్‌లో ఈజీగా తగులుతుందనే ఆలోచన వున్నా, ఆల్ కరెక్టుగానే వుండడానికి ప్రయత్నం జరుగుతోంది గోపాలకృష్ణగారి కార్టూన్లు, కథలకు, జోక్‌లకు వారు వేసే ఇలస్ట్రేషన్స్ చాలా బాగుంటున్నాయి. మీనుండి హాస్య కథలు & హాస్య కవితల పోటీలను ఆశిస్తున్నాం.

- యన్.కె.నాగేశ్వరరావు, పెనుగొండ, ప.గో.జిల్లా.

ప్రవాసాంధ్రులమైన మాకు తిరిగి మా బాల్య,విద్యార్థి దశలను గుర్తుకు తెస్తున్నది 'హాసం'. హాయి, సంతోషం కరువైన ఈ రోజులలో ఈ రెంటిని కలుగజేస్తూ మమ్మల్ని ఆనందంలో ముంచి చదువుతున్నంతసేపూ నేను, మా కుటుంబం స్వరాష్ట్రంలో మనవారి మధ్య ఉన్న అనుభూతిని కలుగజేస్తున్నది. 1-15 నవంబరు సంచికలో ఆడియో రివ్యూలో 'గిరిజా కళ్యాణం' ఘంటసాల గారు ఒక్కరే పాడినది ఉన్నాదని రాసారు. అది ఎక్కడ లభ్యమవుతుందో తెలుపగలరు. లభ్యమయితే కొని దాచుకుందామని నా ఆశ. ఇది నా 25 సంవత్సరాల నుంచి ఉన్న ప్రగాఢమైన కోరిక. పెండ్యాలగారు స్వరపరచిన దేశభక్తి గేయాలు పి.సుశీల, ఎస్.పి. బాలసుబ్రహ్మణ్యం గారు పాడిన 'మా తెలుగు తల్లికి మల్లె పూదండ' మరికొన్ని గేయాల క్యాసెట్టు ఎక్కవ లభ్యమవుతుందో వీలయితే తెలుపగలరు. మేము ప్రవాసాంధ్రులం. 'హాసం' వస్తే మా కుటుంబంలో 'హాసం' వెల్లివిరుస్తుంది.

- కనకదండి జగన్నాథరావు, టాటానగర్, జార్ఖండ్.

16-30 నవంబరు 'హాసం' సంచిక చూశాను. ఒక హాస్య రచన చదువుతుండగా పాఠకునికి నవ్వు రావాలంటే, శరీరంలో చాలా ప్రక్రియ జరగాలి మెదడుకు సంకేతాలు వెళ్ళాలి. శరీరంలో అన్ని భాగాలు సంకేతాన్ని అందుకోవాలి. అలా పాఠకుని కదిలింప చేయగలిగేదే హాస్యరచన.

ఈ కోవకు చెందింది. 'ఎల్బీశ్రీరాం సినిమా తీస్తే' నిజంగా సినిమా చూస్తూ నవ్వినట్లు, చాలా కాలానికి మనసారా నవ్వుకున్నాం. రచయితకు, ఇంతటి మంచి హాస్య రచన అందించిన మీకు నా హృదయపూర్వక అభినందనలు.

-కె.బి.కృష్ణ, కథా, నవలా రచయిత, కాకినాడ.

కొత్తగా వచ్చిన 'హాసం' పత్రికలో సింగీతం శ్రీనివాసరావు గారి 'క' రాజు కథలు చదివాను. ఆయన మంచి డైరక్టరే కాక, మంచి కథకుడు కూడా అనిపించింది. 'ఆరోహణక్రమం' అనే ఆ కథ - ఈ రోజు సొసైటీలో మనకు కనిపిస్తున్న 'నిజానికి' మంచి కథారూపం అనిపించింది. చాలా మందికి ప్రతిభ ఉంటుంది. కానీ ఆ ప్రతిభను ప్రదర్శించటం, వాళ్లకున్న టాలెంట్‌ను ప్రజెంట్ చేయడం తెలియక పోవడంతో ఏ గుర్తింపూ లేకుండా ఉండిపోతున్నారు. అదే మరి కొందరు - ఉన్న ప్రతిభ తక్కువ అయినా దానిని ప్రదర్శించే



టాలెంట్ ఉండటంతో అది నలుగురికి కనిపించేటట్లు చేసి చాలా గొప్పవాళ్లుగా చెలామణీ అయిపోతూ ఉంటారు. నిచ్చెన ఎక్కడం అనే చిన్నమాటలో ఉన్న టాలెంట్‌ను - వాళ్లను పట్టుకునో, వీళ్లను పట్టుకునో పైకి ఎగబాకేసి చాలా గొప్ప ప్రతిభావంతుడులా అందరూ అనుకునేటట్లు కొందరు చేస్తూ ఉంటారని చాలా సింపుల్‌గా చెప్పారు. ఇది సరదా కథే కాకుండా కాస్త ఆలోచింపజేసే కథ కూడా అనిపించింది.

నెక్స్ట్ కథ కోసం వెయిట్ చేస్తూ...

-సత్యానంద్, సినీ రచయిత, హైదరాబాద్.

The one and only Magazine devoted to Humour & Music

# హాసం

హాస్య - సంగీత పత్రిక



53

గతపక్షం హైదరాబాదులో జరిగిన బాలల చలనచిత్రోత్సవ ప్రారంభోత్సవ సందర్భంగా జరిగిన ఓ బాలల నృత్య ప్రదర్శన అందరినీ నివ్వెర పరచింది. చిన్న పిల్లలు అధునాతన దుస్తులు ధరించి, సినిమా పాటలకు అభినయం చేస్తూంటే వేడుకలో పాల్గొన్న దేశ, విదేశ ప్రముఖులు ముక్కున వేలుసుకున్నారు. భారతీయ సంస్కృతిని ఈ రోజు ప్రతిబింబించేవి ఇవేనా? అని ఆశ్చర్యపడ్డారు. అదే వేదికపై పిల్లల చిత్రాలు చక్కని అభిరుచిని పెంపొందించాలని అభిభాషించిన పెద్దలందరూ తమ మాటలకూ, చేతలకూ పొంతన లేకుండా పోయినందుకు ఖేదించారు.

ఈ విపరీతంపై - వ్యాఖ్యలు, విమర్శలు, పత్రికలలో వార్తలూ రావడంతో నిర్వాహకులు ముగింపు కార్యక్రమానికి జాగ్రత్త పడ్డారు. జానపద నృత్యాలు, సంప్రదాయ నృత్యాలు ప్రదర్శింపజేసి పొరబాటు దిద్దుకున్నారు. కానీ ఈ క్రమంలో ఈ తరం పిల్లలు వేదిక మీద ఇస్తున్న ప్రదర్శనల గురించి మనలో ఆలోచనలను రేకెత్తించారు.

ఇలా, విదేశీయుల చేత కూడా వేలెత్తి చూపించుకునేలా జరగడానికి కారణం ఏమిటయివుంటుంది? నర్తించడానికి పిల్లలు ఎన్నుకొన్నవాటిని అనుమతించిన తల్లిదండ్రులకు కాని, ఆధ్వర్యం వహించిన అధికారులకు గాని దీనిలో ఔచిత్య లోపం కనబకపోవడమే అన్నిటికన్నా దురదృష్టకరమైన సంగతి.

ఒకప్పుడు పిల్లలు ఏకపాత్రాభినయాలు, హాస్యనాటికలు, స్కిట్‌లు, మూకాభినయాలు ప్రదర్శించేవారు. టీచర్లు వారికి శిక్షణనిచ్చేవారు. తలిదండ్రులు, సభికులు హర్షించేవారు. ఈనాడు అవేమీ కనబడటం లేదు. ఏ ప్రోగ్రామైనా సరే స్టేజెక్కి సినిమా పాటలు పాడేస్తే, ఆడేస్తే సరిపోతోంది. వీటిలో ఉపాధ్యాయులు నేర్పవల సినదేమీ లేదు. ఆ పనిని సినిమాలు, టీవీలు, అద్దెకు తెచ్చిన వీసీడీలు ఎలాగూ చేస్తున్నాయి. కనుక తలిదండ్రులు కూడా మురిసిపోతూ పిల్లలకు సినిమాల్లో చూపించే దుస్తులు కుట్టించేస్తున్నారు. ఒకప్పుడు రికార్డింగు డాన్సర్లని ఈసడించినవారే ఈనాడు తమ పిల్లలను అలా తయారు చేయడానికి వెనుకాడటం లేదు.

సినిమా పాటలకు అభియనం పట్టడం తప్పా? అంటే అది పాటల ఎంపికపై ఉంటుంది. సదరు పాటల్లోని మాటలకు అర్థాలు, అనర్థాలు, అపార్థాలు వీరికి తెలియవు. ఆ కదలికల ద్వారా అభినయించినవారికి - తాము స్ఫురింపచేస్తున్నదేమిటో తెలియదు. గుడ్డిగా అనుకరించడమే వీరు చేస్తున్నది. ఆ పాటల్లోని అభినయంలో ఉన్న శృంగారపు స్థాయిని తెలుసుకోగల వయసు కాదు వారిది.

ఇదివరకు మాత్రం 'మొక్కజొన్న తోటలో', 'గుత్తి వంకాయ్ కూరోయ్ బావా', 'మధురా నగరిలో ' వంటి పాటలు పిల్లలు అభినయించేవారు కాదా? వాటిలో మటుకు శృంగారం లేదా? అని అడిగేవారుంటే వారికో నమస్కారం. కానీ వాటినీ, ఇప్పటి కొన్ని సినీ గీతాలలో కనిపిస్తున్న అభినయాలనీ ఒకే గాటికి కట్టచూడడం తగదు. ఆ ముద్రలెక్కడ? ఈ 'జెర్క్'లెక్కడ?

ఈ తేడాలను గుర్తించి మంచేదో, చెడేదో తేల్చుకునే భారం పిల్లలది కాదు, పెద్దలది. ఏ మేరకు సభ్యమో, ఏ గీత దాటితే అసభ్యమో తెలిసినవారు కూడా 'చిన్నపిల్లలు కదా, ఒళ్ళు ఎలా వూపినా, ఎబ్బెట్టుగా తోచదు' అని అనుకోవడం తప్పు. తమ పిల్లలు ఏదో విధంగా వేదిక ఎక్కారని సంతోషించడం కంటె వేదిక మీద ఏది ప్రదర్శిస్తున్నారనేదే ముఖ్యమని తెలుసుకోవాలి.

పాఠశాలలో ఉపాధ్యాయవర్గం కూడా ఈ విషయంలో బాధ్యత వహించాలి. ఇదివరకు రోజుల్లో ఏకపాత్రాభినయాలలో త్రాగుబోతు, పిచ్చివాడు, అవిటివాడు వంటి పాత్రలు ధరిస్తామంటే ఒప్పుకునేవారు కారు. స్కూలు వార్షికోత్సవాలలో ముందుగా రిహార్సిల్సు దగ్గరుండి నిర్వహించి తప్పులు దిద్దేవారు. ఈనాడు తలిదండ్రులు పట్టుబట్టారనో లేక అందరూ అదే చేస్తున్నారనో చెప్పి తప్పించుకుంటే పొరబాటు. అంతకంటే ముందు ఏదో విధంగా వీరు టీవీలో కనిపించారు కదాని సంబరపడిపోతూ ప్రత్యేకమైన మర్యాదలు చూపించడం తగదు. తాము నడుపుతున్నవి విద్యాలయాలనీ తలిదండ్రులకు నచ్చచెప్పాలి.

ఈ క్షాళన స్కూళ్లనుండే ప్రారంభమయితే పిల్లలు కూడా వీటిపై సరైన అవగాహన పెంపొందించుకుంటారు. ఒకవేళ పెద్దలు ఆలోచనారహితంగా ప్రతిపాదించినా, 'బాగుండదేమో' అని చెప్పే స్థాయికి చేరుకుంటారు. ఆ విచక్షణ మళ్ళీ మొదలు కావలసింది ఈ అంకుర దశనుండే! అప్పుడు కలుపు మొక్కలు మొలకెత్తవు. సంస్కృతిని , సంప్రదాయాన్ని ప్రతిఫలింపజేసే పుష్ప ఫలవృక్షాలే ఉంటాయి.



సంపుటి: 3 సంచిక: 5

1-15 డిసెంబరు 2003

పేజీలు: 76

విడి ప్రతి : రూ. 10-00

సంవత్సర చందా : రూ. 200

విదేశాలలో (ఎయిర్‌మెయిల్): $ 50

జీవిత చందా : రూ. 2000

విదేశాలలో (ఎయిర్‌మెయిల్) : $ 400

మేనేజింగ్ ఎడిటర్
ఎమ్బీయస్ ప్రసాద్

ఎడిటర్
రాజా

రిఫరెన్స్ కర్టెసీ
డా॥ కె.వి.రావు
జె.మధుసూదన శర్మ

HAASAM HAASYA SANGEETHA PATHRIKA
Flat No. 502, Sri Balaji Nilayam
13-1-212, Motinagar,
Hyderabad-500 018
Ph: 2383 1388 / 5557 0215
*email:* haasammag@hotmail.com

Printed and Published by:
**K.I.Varaprasad Reddy**
On behalf of Hummus Infoway (P) Ltd.,
502, Sri Balaji Nilayam,
13-1-212, B.S.P. Colony, Motinagar,
HYDERABAD - 500 018
Fax: 040-23541713

**Printed at:** Kalajyothi Process Ltd.,
1-1-60/5, RTC X Roads,
Musheerabad, Hyderabad-20,

**Published at:** 502, Sri Balaji Nilayam,
13-1-212, B.S.P. Colony, Motinagar,
HYDERABAD-500 018

**Editor: RAJA**

Marketed by:
Margadarsi Marketing Pvt Ltd.,
6-3-570, Eeenadu Compound
Somajiguda, Hyderabad-82




ఊరందరిది ఒకదారి అయితే ఉలిపికట్టె దారి మరొకటని... ఆహారావు రూటే వేరు...సెపరేట్ టైప్....

అందరూ 'అమ్మ'... అని మాటలు మొదలెడితే అతడు 'మాతే' అని సంస్కృతంలో మొదలెట్టాడు. ఎబిసీడీలు నేర్చుకోమని చెబితే జడ్ వై ఎక్స్ అంటూ రివర్స్‌లో మొదలుపెట్టాడు. అందరూ పాకడం మొదలెట్టి నడిస్తే ఆహారావు నడిచాక, పాకడం స్టార్ట్ చేసాడు - వెరైటీగా!

ఇది ఆహారావు ఒకప్పటి ఫ్లాష్‌బాక్...

ప్రస్తుతం అతగాడికి పెళ్ళిచూపులు.

అమ్మాయి కుందనపు బొమ్మ అని చెప్పాడు మ్యారేజ్ బ్రోకర్. 'ఛస్... నాకు కుందనపు బొమ్మలు, సిల్వర్ అమ్మలూ వద్దు. ఆడపిల్లే కావాలీ అన్నాడు. మ్యారేజ్ బ్రోకర్ మాడు పగిలిన ఎఫెక్టిచ్చి ఓ వెర్రి నవ్వు నవ్వాడు.

పెళ్ళిచూపుల్లో అమ్మాయిని చూసి తెగ థ్రిల్లయిపోయాడు ఆహారావు. అమ్మాయి సిమ్రాన్‌లా వుండదు కుష్బూలా వుంటుందని భయపడుతూనే చెప్పారు పిల్ల తల్లిదండ్రులు... నాక్కావల్సింది కుష్బూ టైప్ అమ్మాయే అని చెప్పాడు ఆహారావు.

నీకేవంటలంటే యిష్టమని అడిగాడు -పెళ్లిచూపుల్లో.

'చెప్పనా... వద్దా... 'అన్నట్టు ఓ సారి కళ్ళు టపటపలాడించేసి "జిలేబీ వేపుడు... ఆవకాయ సాంబారు" అంది మంజరి.

ఎగిరి గంతేసాడు ఆహారావు.

"మరే కలరంటే లైకూ?" అని అడిగాడు.



"సినిమాలో ముక్కు మీద కొడితే నోట్లోంచి భళ్ళుమని తుళ్లే బ్లడ్డు కలరంటే యమా లైకింగ్" అంది మంజరి.

"వాహ్... క్యా యిష్టం హై" అన్నాడు ఆహారావు.

"బట్టలు తెల్లగా వుండాలంటే దేన్తో వుతకాలి" అని అడిగాడు ఆ తర్వాత.

"సున్నిపిండితో" అంది మంజరి తడుముకోకుండా.

"అమ్మా... నాకీ పిల్ల పిచ్చపిచ్చగా నచ్చేసిందే" అంటూ ఓ ఎగురు ఎగిరి చెప్పాడు. ఆ అరుపుకి పెళ్ళికూతురు తల్లికి హార్ట్ ఎటాక్ ఎటాకవబోయి కొద్దిలో సేవ్ అయింది.

ఈ పెళ్ళిచూపుల తతంగాన్ని గమనిస్తున్న బంధుమిత్రులు మెంటలెక్కిన పిచ్చిచూపులు చూస్తూ.

'మ్యాడ్ ఫర్ ఈచ్ అదర్' అనుకున్నారు.

కాబోయే మొగుడి సంగతులు తెలిసే ఆ అమ్మాయి అలా అందని తెలియదు వాళ్లకి.

* * *

అత్తారింట్లోకి అడుగుపెట్టింది మంజరి. "మావాడు అదోటైపు అని నీ పెళ్ళికి ముందే డైలీ టీవీ సీరియల్‌లా చెప్పేసాం... ఇక వాడ్ని చూసుకోవాల్సింది నువ్వే... మేము కాశీకి వెళ్తున్నాం... జాగ్రత్త" అన్నారు అత్తమామలు ఓవైపు భయపడుతూనే.

పెళ్ళయితే పిచ్చి కుదురుతుందన్న సామెత మీద నమ్మకం ఎక్కువ ఆమెకు.... అందుకే 'మీరు నిశ్చింతగా వెళ్ళండత్తయ్యా అన్నట్టు అక్కడ ఈ మధ్య మన తెలుగు సినిమాలు చాలా తీస్తున్నార్ట... యాక్టర్లెవరైనా కనిపిస్తే నేను అడిగానని చెప్పండేం" అంటూ ఎంతో ఆనందంతో అత్తా మామలను కాశీకి పంపించింది .

* * *

శోభనం గది...

మొగుడి కోసం ఎదుర్చూస్తోంది మంజరి. సరిగ్గా పది నిమిషాల తర్వాత టీ కప్పుతో వచ్చాడు ఆహారావు.

"అయ్యయ్యో... అదేమిటండీ... నేను కదా పాల గ్లాసుతో రావలసింది" అందామె నొచ్చుకుంటూ.

"ఎప్పుడూ పాల గ్లాసేనా? వెరైటీ కోసమని టీ కప్పుతో వచ్చాను... అదీ నేనే.... నువ్వుకాకుండా..." అన్నాడు ఆహారావు.

"ఆహా... ఆహారావు అంటే మీరేనండి"... అంది మంజరి మురిసిపోతూ.

మర్నాడు... పొద్దున్నే.... తలంటుకొని మొగుడ్ని లేపింది మంజరి. "అబ్బ... ఇంకాసేపు పడుకోనివ్వు" అన్నాడు ఆహారావు వెరైటీ కోసం కళ్ళు పూర్తిగా తెరిచి.

"ఆఫీసుకు టైం అవుతోందండీ"

సరేనని బద్ధకంగా తూలుకుంటూ కాకుండా కప్పలాగ ఎగురుకుంటూ బాత్రూంలోకి వెళ్ళాడు. అక్కడున్న గోడకు బ్రష్ ఫిక్స్ చేయబడి వుంది. దాని మీద పేస్ట్ వేసి, పెదవులు విప్పదీసి పళ్ళు బ్రష్‌కు సెట్టయ్యేలా చేసి తలను అటుయిటూ తిప్పసాగాడు.

"అదేం బ్రష్షండీ" అడిగింది మంజరి.

'చేత్తో బ్రష్ చేసుకోవడం కామన్... ఇలా బ్రష్‌ను గోడకు ఫిక్స్ చేసుకొని నా తలకాయను అటు, ఇటు తిప్పుతూ పళ్ళు తోముకోవడం నా స్పెషాల్టీ అండ్ వెరైటీ" అని చెప్పాడు ఆహారావు.

ఇది పెళ్ళికి ముందున్న పిచ్చి కదా... స్లొగా ఈ తిక్క తగ్గుతుందిలే అనుకుంటూ అప్పటికి ఎడ్జస్టయిపోయింది మంజరి.

స్నానం చేసొచ్చాడు ఆహారావు. డైనింగ్ టేబుల్ మీద టిఫిన్ రెడీగా వుంది.

"టిఫినేంటి?"

"ఉప్మా... పెసరట్టు".

ప్లేటులో పెట్టిన ఉప్మా పెసరట్టును చూసాడు...

పక్కనే చట్నీ సాంబారు.

"వెళ్ళి మిక్సీ పట్టుకురా" అన్నాడు ఆహారావు.

"ఏం... అల్లం చట్నీ కావాలా?" అడిగింది మంజరి.

"కాదు... నువ్వు పట్రా చెబుతా" అన్నాడతను.

మంజరి బుద్ధిగా మిక్సీ తెచ్చి డైనింగ్ టేబుల్ మీద పెట్టి ప్లగ్ బిగించింది.

ఆహారావు ఉప్మా పెసరట్టును మిక్సీలో వేసాడు. తర్వాత చట్నీని, సాంబారును వేసాడు. మిక్సీ ఆన్ చేసాడు.

ఈసారి పాకవటం విషయంలో ఎడ్జస్ట్ కాదలచుకోలేదు మంజరి.

వెంటనే హడలిపోయింది... "ఏం చేస్తున్నారండీ" అంది.

"మిక్సింగ్... అండ్... రీ.. రికార్డింగ్... అంటూ జోకాడు ఆహారావు.

"అంటే.."

"నువ్విప్పుడిచ్చిన ఉప్మా, పెసరట్టు నేను తినాలి... ఎలా...!? చట్నీతో నంచుకొని, సాంబారులో ముంచుకుని... అవునా..."

"అవును.... అయితే"

"అదంతా ఓల్డ్ ప్రాసెస్... డైరెక్ట్‌గా మిక్సీలో ఈ ఉప్మా, పెసరట్టు, చట్నీ, సాంబారు... మిక్స్ చేసి గ్లాసులో పోసుకొని తాగేసామనుకో... తినే బాధ తప్పుతుంది... అన్నట్టు మధ్యాహ్నం లంచ్‌కూడా మిక్స్ చేసి ఫ్లాస్కులో పంపించడం మరచిపోకు" చెప్పాడు భార్యతో.

మొగుడి దగ్గర ఇన్ని విద్యలు ఉన్నాయని అప్పుడే తెలిసిందామెకు.

"ఇదిగోండి కాఫీ" అంది మంజరి టిఫిన్ తాగేసిన మొగుడి వంక విచిత్రంగా చూస్తూ.

"పొద్దున్నే నాకు కాఫీ పడదు... కూల్‌డ్రింక్ తీసుకురా" అన్నాడు.

"ఇతగాడి కథేంటో నాకేం అర్థం కావడం లేదురో దేవుడో" అని గొణుక్కుంటూ ఫ్రిజ్‌లో నుంచి కూల్‌డ్రింక్ తీస్తుంటే అరిచాడు ఆహారావు.

"వేడి బాగా వుండాలి... చల్లారిన కూల్‌డ్రింక్ యిష్టం వుండదు నాకు" అంటూ.

ఓసారి వెనక్కి వచ్చి మొగుడి కళ్ళలో కళ్ళు పెట్టి చూసి అడిగింది "ఎలా వుండాలి?" అని.

"వేడిగా... పొగలు కక్కేలా" అంటూ తాపీగా వివరించాడతను.

"అంటే నేనిప్పుడేం చేయాలి?"

"వెరీ సింపుల్... కూల్‌డ్రింక్ తీసుకెళ్ళి టీ గిన్నెలోకి ఒంపేసి వేడి చెయ్... కొద్దిగా షుగర్ వేయ్... మళ్ళీ బాగా వేడి చెయ్... సల సల మరిగే కూల్‌డ్రింక్ కాఫీ కప్పులో పోసి తీసుకురా... అప్పుడు వేడివేడిగా ఘుమఘుమలాడే కూల్‌డ్రింక్ రెడీ" వంటల ప్రోగ్రామ్‌లో యాంకర్‌లా పళ్ళికిలించి తెలుగింగ్లీష్ మిక్స్ చేసి మరీ చెప్పాడు.

"నువ్వు నాకర్థం కావురో మొగుడో..." అనుకుంది మంజరి. అయినా ఎందుకైనా మంచిదని ఓసారి ట్రై చేద్దామని....

"సాయంత్రం పువ్వులు తీసుకురావటం మర్చిపోరు కదూ!?" అంది - కనీసం శృంగారాస్త్రానికైనా ఇతగాడి తిక్క కుదురుతుందేమోనని...

"తామరపూలు నీకిష్టమేనా? వెరైటీగా రేపట్నుంచి అవి తీసుకువద్దామని అనుకుంటున్నా" అన్నాడు ఆహారావు.



మంజరి ఓ వెర్రి నవ్వు నవ్వింది. పాకులు తినే ఓపిక పోయిందామెకు.

* * *

అర్ధరాత్రి తలుపు తెరిచి ధడాలున మూసిన చప్పుడైతే తుళ్ళిపడి లేచాడు ఆహారావు.

బెడ్‌మీద మంజరి లేదు. ఓ కాగితం వుంది.

"ఒంటికి మంచిది కదాని మార్నింగ్ వాక్, ఈవినింగ్ వాక్ బదులు నైట్ వాక్‌కి వెళ్తున్నాను. లేచి ఈ పేపరు గనక చూస్తే మీరు కూడా జాయినవ్వచ్చు. పిచ్చ వెరైటీగా వుంటుంది" అని వుంది అందులో.

"ఓసి నీ వెరైటీ మండా... నైట్ వాకింగేంటే...కొంపముంచావు కదే" అనుకుంటూ రోడ్డు మీదికి పరుగెత్తాడు ఆహారావు.

మంజరి నడుస్తోంది....

ముందుకి కాదు...

వెనక్కి అడుగులు వేస్తూ....

మెడ అటూ ఇటూ తిప్పుతూ కాదు...

పైకి కిందకీ ఆడిస్తూ...

చేతులు ఊపుతూ కాదు...

సగానికి మడిచి, పిడికిలి మూసి, తెరుస్తూ....

'రా రమ్మని రారా రమ్మని రామ చిలుక పిలిచెను ఈ వేళా' అనే పాట గనక బ్యాగ్రౌండ్‌లో వస్తే ఎవరైనా సరే పూర్తిగా అపార్థం చేసుకునే అవకాశం ఎంతైనా ఉంది.

అప్పటికే కొంతమంది మందుబాబులు ఆమె వైపు వింతగా చూస్తూ- 'ఆహా... మనదేశానికి స్వతంత్ర్యం పూర్తిగా వచ్చేసిందిరా' అంటూ లొట్టలు వేసుకుంటూ మరీ డిక్లేర్ చేసేశారు.

ఆ వైపు వెళ్తున్న బీట్ కానిస్టేబుల్ డ్యూటీ చెయ్యటం మానేసి రోడ్డు మీద పడి గిలగిల కొట్టుకోవడం మొదలెట్టాడు.

"ఇదేం పొయ్యే కాలమే నీకు..." అంటూ ఆహారావు పరుగుపరుగున చేరుకున్నాడు ఆమెను.

"మీరు కూడా ఇలా చెయ్యండి.... భలేగా ఉంటుంది. ఈ వెరైటీ ఇన్నాళ్ళూ మీకు తట్టలేదు కదూ...!? అంది మంజరి - ఆపకుండా తన విన్యాసాల్ని కంటిన్యూ చేస్తూ....

అంతే... ఓ క్షణం తిరిగేలోగా

**రపరప**

మంటూ శబ్దం

దానికర్థం ఆహారావు నెత్తికొట్టుకున్నాడని

మరో పదినిముషాల తర్వాత - మళ్ళీ

**రపరప**

మంటూ శబ్దం

దాని తాత్పర్యం - ఇంట్లో మంజరి ముందు -ఆహారావు లెంపలేసుకుంటున్నాడని...

ఆ తర్వాత

వాళ్ళిద్దరి మధ్యా

వెరైటీగా

ఇంకేం జరగలేదు...

ఎవ్విరిథింగ్ రొటీన్!!!

◆



# సామాన్యుడి కోసం పుట్టిన అసామాన్య కవి
# శైలేంద్ర

శైలేంద్ర పేరు తలచుకోగానే కమ్యూనిస్టు భావాలకీ, పెట్టుబడిదారీ జీవనానికీ, కళాత్మక విలువలకూ, వ్యాపార విలువలకూ మధ్య నలిగిపోయిన గొప్ప సంస్కార హృదయుడూ, సున్నిత మనస్కుడూ, కళ్ళెదుట నిలుస్తాడు. గీత రచయితలే మెచ్చుకునే గీత రచయిత అతను. 1960 దశకంలో ఎవరైనా పాట రాయడానికి పూనుకుంటూంటే 'నువ్వేం శైలేంద్ర వనుకుంటున్నావా' అని మిత్రులు వెక్కిరించేలా, ఒక జాతీయంగా, తెలుగు కళాశాల విద్యార్థుల్లో కూడా ఆత్మీయత సంపాదించుకున్న అసాధారణ 'భావ' కవి శైలేంద్ర. రాజ్‌కపూర్, శంకర్ -జైకిషన్, ముఖేష్‌ల తాజ్‌మహల్లో (హస్రత్ జైపురీతో పాటు) నాల్గో స్తంభంగా అతను గుర్తొస్తాడు. సినిమా నిర్మాణానికి పూనుకున్న పాపానికి జీవితంపై మమకారాన్ని, గీత రచనలో ఉత్సాహాన్ని కోల్పోయిన ఒక మృదు హృదయుడు శైలేంద్ర. హృదయం అంత నవనీతం కాబట్టె, అతని పాటలు ఏకాంత జీవితంలో వెన్నెల రాత్రిలా మధురమైన విషాదాన్ని శ్రోతలలో నింపుతాయి.

"రుక్ జా రాత్ ఠహర్ జారే చందా - బీత్‌న మిలన్‌కా " (లతా - దిల్ ఏక్ మందిర్ -1963- శంకర్ - జైకిషన్)

"జీనా యహా - మర్‌నా యహా - ఇస్ కే సివా జానా కహా" (ముఖేష్ - మేరా నామ్ జోకర్ -1970-శంకర్ -జైకిషన్)

'టూటే హువే ఖ్వాబోనే - హమ్ కో యే సిఖాయా హై' (రఫీ - మధుమతి- 1958- సలీల్ చౌధురి)

ఇలాంటి విషాద గీతాలు అనేకం. ఆపాత మధురం. మనందరం జీవితంలో ఏదో ఒక సందర్భంలో పాడుకునే అవసరం వచ్చే సాహిత్యమే.

1949లో 'బర్సాత్' చిత్రంతో సినీ రంగ ప్రవేశం చేసిన శైలేంద్ర, చాలా ఎక్కువ పాటలు రాశారనడం కంటే, రాసినవన్నీ గొప్పవే ననడం స్వభావోక్తి అవుతుంది. గాయకులు ఎవరైనా, సంగీతం ఎవరిదైనా, శైలేంద్ర పలుకులు మాత్రం నేరుగా మనసును తాకి, కళవళ పరుస్తాయి. ఒక్కోసారి గిలిగింతలు పెడతాయి. కన్నీళ్ళు తెప్పిస్తాయి. ఆనంద పారవశ్యంతో నింపేస్తాయి.

శైలేంద్ర పాటల్లోని విషాద గీతాలను పరామర్శించే ముందుర, అతి గొప్ప సందేశాన్ని, భావాన్ని ఎంత తేలిక మాటలతో, అలవోకగా అందిస్తాడో చూడాలి.

**"మేరా జూతా హై జపానీ - యే పత్లూన్ ఇంగ్లిస్తానీ**

**సర్ పే లాల్ టోపీ రూసీ - ఫిర్ భీ దిల్ హై హిందుస్తానీ"**

(శ్రీ420-1955, శంకర్ జైకిషన్, ముకేష్) - హిందీ రాని వారిక్కూడా అర్థమయ్యే ఈ పాటలో దేశభక్తి భావాన్నీ 'చల్ నా జీవన్ కీ కహానీ - రుక్ నా మౌత్ కీ నిషానీ' అన్నప్పుడు మనిషిలో



ఉండవలసిన నిత్య చైతన్యాన్ని ఎంత సరళంగా చెప్పేసాడో అనిపిస్తుంది.

అలాగే **'సజన్ రే ఝూట్ మత్ బోలో - ఖుదా కే పాస్ జానా హై**

**న హాథీ హై న ఘోడా హై - వహా పైదల్ హీ జానా హై'**

'తీస్రీ కసమ్-1966- ముకేష్ - శంకర్ జైకిషన్) అంత విప్లవ భావాలు కలిగిన రచయిత, ఇంత గొప్ప ఆధ్యాత్మికతను అతి సునాయాసంగా పలికించడం అద్భుతం. దేవుడి దగ్గరికి మనిషిని చేర్చేది అతని నిర్మలమైన అంతఃకరణ, స్వయం కృషే తప్ప, బాహ్యాడంబరాలు, ఇతర సాధనాలు కాదన్న సత్యాన్ని ఎంత ప్రతీకాత్మకంగా, హాస్యస్ఫోరకంగా చెప్పాడో. అందుకే అతను సామాన్యుడి కోసం పుట్టిన అసామాన్య కవి అయ్యాడు.

'కిసీకీ ముస్కరాహటోంపే హో నిసార్' (అనాడి-1959) పాటలో ఎలాంటి జీవితం ధన్యమైనదో అతి చక్కగా, చిన్న చిన్న భావాలలోనే సూచిస్తాడు. పదాడంబరం కంటే, అంతరార్థం ప్రాముఖ్యం వహించే రచన శైలేంద్రది. హస్రత్ జయ్‌పురీ తర్వాత శంకర్ జైకిషన్‌ల సంగీతానికి అత్యధికంగా గీతాలు సమకూర్చింది ఇతనే. బర్సాత్, ఆవారా, ఆహ్, ఆశిక్, అనాడి, శ్రీ 420, జిస్ దేశ్ మే గంగా బహతీ హై, చోరి చోరి, పతిత, యహూదీ, రంగోలీ, రూప్ కీ రానీ చోరోంకా రాజా, దాగ్, ఉజాలా, దిల్ ఏక్ మందిర్, సంగమ్, తీస్రీ కసమ్, మేరానామ్ జోకర్, కల్ ఆజ్ ఔర్ కల్, ఈవినింగ్ ఇన్ పారిస్.... ఇలా ఎన్నో సినిమాల పేర్లు వింటేనే, అనేకానేక హిట్ గీతాలు గుర్తొస్తాయి. ముకేష్, రఫీ, కిశోర్, మన్నాదే, తలత్, లతా, ఆశా, సుమన్.... ఇలా మేటి గాయకుల గొంతుల్లో శైలేంద్ర గీతాలు అమరత్వాన్ని పొందాయి.

ప్రధానంగా శంకర్ జైకిషన్ బృందానికే చెందినప్పటికీ, ఇతర సంగీత దర్శకులతో శైలేంద్ర ఎన్నో గొప్ప గీతాలు అందించాడు. వీరిలో మొదట చెప్పుకోవలసిన వారు సచిన్ దేవ్ బర్మన్. 'మియా బీబీ రాజీ'(1960) వంటి ఫ్లాప్ సినిమాలో కూడా సచిన్ దా సంగీత దర్శకత్వంలో సుమన్ పాట ఆదరణ పొందింది. అయితే, శైలేంద్రకు, సచిన్ దా కు, రఫీకి, దేవానంద్‌కూ, వహీదాకు - వెరసి అందరికీ అజరామర కీర్తి తెచ్చిపెట్టిన సినిమా 'గైడ్'(1965). ఒక సినిమా కథ, దాని మూడ్‌లకు అనుగుణంగా ఆసాంతం గీత రచన సాగితే ఎలా ఉంటుందో తెలుసుకోవాలంటే గైడ్ పాటలను దానికి ఒక పాఠ్య పుస్తకంగా స్వీకరించవచ్చు. అనుకోని, ఆశించని, అపూర్వమైన స్వేచ్ఛ లభించినపుడు, నర్తకి అయిన ఒక స్త్రీ మనసులో పొందే ఉద్వేగానికి శైలేంద్ర ఉపయోగించిన మాటలు చూడండి.

**'ఆజ్ ఫిర్ జీనేకి తమన్నా హై - ఆజ్ ఫిర్ మర్‌నేకా ఇరాదా హై**

**కాంటోంసే ఖీంచ్ కే యే ఆంచల్ - తోడ్ కే బంధన్, బాంధీ పాయల్**

**కోయి న రోకే దిల్ కీ ఉడాన్ కో - దిల్ వో చలా...'** (లతా)

అలాగే - ప్రియురాలు దగ్గరే ఉన్నా తరగని దూరం మనసుని దహించి వేస్తున్నప్పుడు నాయకుడు పాడే పాట.

**దిల్ కి మేరే పాస్ హో ఇత్ ని - ఫిర్ భీ హో కిత్‌నీ దూర్**

**తుమ్ ముఝ్ సే మై, జగ్ సే పరేశా - దోనో హై మజ్ బూర్**

**ఐసే మే కిస్ కో - కౌన్ మనాయ్.... దిన్ ఢల్ జాయే హాయే రాత్ నజాయే'**

ఈ చిత్రంలో నాయికా నాయకులిద్దరూ పరస్పరం వంచకులని దూషించుకునే సందర్భం ఉంది. నాయికలో అతని వంచన కోపాన్ని రేకెత్తిస్తే, నాయకుడిలో అది వేదనను కలిగిస్తుంది. అందుకే ఆమె 'మోసే చల్ కీ యె జాయే - సయ్యా బేయిమాన్' అని పాడుతుంది. అతను 'క్యా సె క్యా హోగయా - బేవఫా తేరే ప్యార్ మే' అంటాడు. సరిగ్గా ఆ ఇద్దరు వ్యక్తుల వ్యక్తిత్వాన్ని, మనస్తత్వాన్ని ప్రతిధ్వనించే సాహిత్యం ఆ పాటల్లో వినిపిస్తుంది. ఇలా 'గైడ్' లోని పాటలను సాహిత్య పరంగా విశ్లేషిస్తే, గీత రచయితగా, కేవలం పాటలకే పరిమితం కాకుండా, కథ మొత్తాన్ని తన మాటల్లో పలికించగలిగిన శైలేంద్ర ప్రతిభ మనకు స్పష్టంగా కనిపిస్తుంది. 'తీస్రీ కసమ్' పాటల్లో కూడా ఇదే ప్రతిభ దర్శనమిస్తుంది. సలీల్ చౌధురికి 'మధుమతి'లో

శైలేంద్ర రాసిన గీతాలు ఇక చెప్పనే అక్కర్లేదు. ఎక్కువగా స్లో పాటలకు పనికివచ్చే, తక్కువ పదాల పాటలు రాసే శైలేంద్ర ఇందులో 'దిల్ తడప్ తడప్ కే కెహ రహా హై ఆభిజా', 'జుల్మీ సంగ్ ఆంఖ్ లడీ రే', 'జంగల్ మే మోర్ నాచా కిసీనే నదేఖా' లో ఎన్నో పదాలు గుప్పిస్తూ మధురంగా రాసారు.

విఫల ప్రేమికుడి మనఃస్థితిని వర్ణిస్తూ, శైలేంద్ర రాసిన 'యహూదీ' లోని పాట ఆయన భావుకతకు మచ్చుతునక.

**యే మేరా దీవానా పన్ హై - యా మొహబ్బత్ కా సురూర్**

**తూన పెహచానే తో హై యే, తేరీ నజరోంకా కుసూర్**

అనే పల్లవితో ప్రారంభమయ్యే ఈ పాటలో మొదటి చరణంలో ప్రేమికుడి 'నువ్వు వచ్చినా రాకున్నా నీ కోసం నిరీక్షిస్తూనే ఉంటాను' అని బేలగా అంటాడు. మూడో చరణం వచ్చేసరికి ఇక బెదిరింపుకు దిగుతాడు.

'ఐసే వీరానే మె ఎక్ దిన్ - ఘుట్ కే మర్‌జాయేంగే హమ్

**జిత్‌నా జీ చాహే పుకారో - ఫిర్ నహీ ఆయెంగే హమ్'**

అంటే, నువ్వు ఎంత పిలిచినా రాను పో అని ఉడుకు మోత్తనం చూపి, చచ్చిపోతానని బెదిరిస్తాడు. ప్రేమికుడిలోని చిన్న పిల్లాడి మనస్తత్వాన్ని ఇంత అందంగా ఆవిష్కరించిన కవులు అరుదు.

ఎన్ని తరాలు గడిచినా, అందరికీ లతా పాటల్లో ఆల్ టైం ఫేవరెట్... అయిన పాట 'అజీబ్ దాస్తా హై' (దిల్ అప్‌నా ఔర్ ప్రీత్ పరాయే).

**'కిసీకీ ప్యార్ లేకే తుమ్ - నయా జహా బసావొగే**

**యే శామ్ జబ్ భీ ఆయేగా - తుమ్ హమ్‌కో యాద్ ఆవోగే'**

ఈ చరణంలో ఎంత మామూలుగా వాడే మాటల్లో ఎంత విషాదం. 'అండర్ స్టేట్‌మెంట్' ద్వారా దుఃఖాన్ని కప్పి చెప్పే శైలి శైలేంద్రది. 'దిల్ ఏక్ మందిర్'లో రఫీ పాడిన 'యాద్‌న జాయే' పాటలో కూడా 'మన్‌మే బసీ యే మూరత్ లేకిన్ మిటీన మిటాయే - అన్న తర్వాత, 'కెహనేకో హై వో పరాయే' అనే చివరి వాక్యంతో కథా వస్తువును, పాత్ర మనస్తత్వాన్ని కళ్ళెదుట నిలబెడతాడు. అదే శైలేంద్ర ట్రేడ్ మార్కు.

చేసిన ఏ పనయినా, రాసిన ఏ పాటయినా (సినిమాల్లోనూ, ఇతరత్రా) నిమగ్నత, నిబద్ధత శైలేంద్ర సహజ గుణాలు. తనలో సరిసమానమైన నిమగ్నతను ఇతరుల్లో ఆశించి విఫలం చెందడం అతను చేసుకున్న దురదృష్టం. ఆ అలసటతో, విసుగుతో, నిస్పృహతో తనే 'దాగ్'కి రాసిన పాటలలో

**'ఐ మేరే దిల్ కహీ ఔర్ చల్**

**గమ్ కీ దునియాసే దిల్ చల్ గయా**

**ఢూంఢ్‌లే అబ్ కోయీ ఘర్ నయా'**

అనుకుంటూ 1966 డిసెంబర్ 14న (రాజ్‌కపూర్ జన్మదినాన) మరణించాడు శైలేంద్ర. ఆయనకు కొత్త లోకం దొరికిందో లేదో కానీ, హిందీ పాటల శ్రోతలు మాత్రం మరో శైలేంద్ర కోసం ఇంకా నిరీక్షిస్తూనే ఉన్నారు.

**- మృణాళిని**

## 1960 హిందీ సినీ సంగీతంలో మలుపులు-మజిలీలు


ఓ.పి.నయ్యర్

శాస్త్రీయ సంగీతాన్ని అభ్యసించక పోయినప్పటికీ 'కల్పనా' చిత్రం కోసం ఓ.పి.నయ్యర్ అందించిన సంగీతం శాస్త్రీయ సంగీత విద్వాంసులను సైతం మైమరిపించే రీతిలో రూపుదిద్దుకుని అతనికి చక్కటి పేరు తీసుకు వచ్చింది. మహమ్మద్ రఫీ, మన్నాదేల కాంబినేషన్‌లో వచ్చిన 'తూ హై మేరా ప్రేమ్ దేవతా' పాట, ఆశా గానం చేసిన 'బేకసి హద్ సే జబ్ గుజర్ జాయే' అద్భుతమైన హిట్స్ . నయ్యర్ సంగీతంలోనే 'జాలీ నోట్ ' చిత్రంకై ఆశా, రఫీ పాడిన'రాత్ సర్ద్ సర్ద్ హై', రఫీ సోలో 'ఛురీ బన్ కాటా బన్ ఓ మై సోన్' గీతాలను ఎవరు మరచిపోగలరు.

లతా గానం చేసిన 'జా రే బద్‌రా జా' (బెహనా) పాట తప్ప మదన్ మోహన్‌కు చెప్పుకోతగ్గ హిట్ ఈ సంవత్సరంలో లేదు.

బహుదూర్ షా జఫర్ రచించిన రెండు పద్యాలను'లాల్ ఖిలా' చిత్రంకై స్వరపరిచి ఎస్.ఎన్.త్రిపాఠి హిట్ కొట్టారు. 'లగ్‌తా నహీఁ హై దిల్ మేరా', 'న కిసికీ ఆంఖ్ క నూర్ హూ' అనే ఈ గీతాలను మహమ్మద్ రఫీ పాడారు.


చిత్రగుప్త

'పతంగ్' చిత్ర హిట్‌తో చిత్రగుప్తకు చక్కటి పేరు వచ్చింది. 'రంగ్ దిల్ కే ధడ్కన్ భీ లాతీ తో హోగీ',' యే దునియా పతంగ్ నిత్ బదలే యే రంగ్', ' తేరీ శోఖ్ నజర్ కా ఇషారా' గీతాలు ఈ చిత్రంలోనివే.

హృషికేశ్ ముఖర్జీ చిత్రం 'అనురాధా' కోసం సితార్ విద్వాంసుడు పండిట్ రవిశంకర్ సంగీతాన్నందించారు. ఈ చిత్రంలో లతా గానం చేసిన 'జానే కైసే సప్నో మైఁ', 'కైసే దిన్ బీతే' పాటలు మంచి హిట్ అయ్యాయి.


రవిశంకర్

'నానీ తేరీ మోర్నీ' పాడి విశేషంగా ఖ్యాతి నార్జించిన బాలగాయని రానూ ముఖర్జీ హేమంత్ చిన్నారి కూతురే!


హేమంత్ కుమార్

'మాసూమ్' చిత్రానికి సంగీత దర్శకుడు హేమంత్ కుమారే అయినప్పటికీ విదేశాలకు వెళ్లే అవకాశం రావటంతో ఆయన సూచన మేరకు సంగీత దర్శకునిగా రాబిన్ బెనర్జీ రంగ ప్రవేశం చేయటం జరిగింది. అయితే అప్పటికే హేమంత్ 'నానీ తేరీ మోర్నీ' పాటను స్వర పరచటం జరిగింది. హమేఁ ఉన్ రాహోం పర్ చల్‌నా హై పాటను సుబీర్ సేన్, ఆరతీ ముఖర్జీ గానం చేయటం విశేషం.

కళ్యాణ్‌జీ-ఆనంద్‌జీలు తొలిసారిగా భారీ బడ్జెట్ చిత్రానికి పని చేశారు. 'ఛలియా' చిత్రం కోసం వీరు వెలువరించిన స్వర రచనలన్నీ శంకర్-జైకిషన్‌ల బాణీలను తలపింప చేసినా వారికంటూ ఓ ప్రత్యేకబాణీను ఏర్పరచుకోవటానికి మార్గం చేసిందీ చిత్రం. 'దమ్ దమ్ డిగా డిగా, మౌసమ్ భిగా భిగా', ' మేరే టూటే హుయే దిల్ సే', 'ఛలియా మేరా నామ్', 'బాజే పాయల్ ఛున్ ఛున్', 'తేరీ రాహోఁ మేఁ ఖడేఁ హై' పాటలు ఇప్పటికీ సూపర్ హిట్సే ! ఈ చిత్ర విజయంతో రచయితగా కమర్ జలాలాబాదీ తన పూర్వస్థాయిని నిలబెట్టుకున్నారు.


కళ్యాణ్‌జీ-ఆనంద్‌జీ

(వచ్చే సంచికలో మరికొంత)

# అర్థం చేసుకుందాం ఆస్వాదిద్దాం

చిత్రం : దిల్ అప్నా ఔర్ ప్రీత్ పరాయీ
రచన : శైలేంద్ర
సంగీతం : శంకర్ - జైకిషన్
గానం : లతామంగేష్కర్
అభినయం : మీనాకుమారి, రాజ్‌కుమార్, నాదిరా, షమ్మీ తదితరులు









## 'అజీబ్ దాస్తాఁ హై యే'

అజీబ్ దాస్తాఁ హై యే
కహాఁ షురూ కహాఁ ఖతమ్
యే మంజిలేఁ హైఁ కౌన్ సీ
న వో సమఝ్ సకే న హమ్ ॥అజీబ్॥

యే రోష్‌నీ కే సాథ్ క్యూఁ
ధువాఁ ఉఠా చిరాగ్ సే ॥యే రోష్‌నీ॥
యే ఖ్వాబ్ దేఖ్‌తీ హూఁ మైఁ
కి జబ్ పడీ హూఁ ఖ్వాబ్ సే ॥అజీబ్॥

ముబారకేఁ తుమ్హే కి తుమ్
కిసీకే నూర్ హో గయే ॥ముబారకేఁ॥
కిసీకే ఇత్‌నే పాస్ హో
కి సబ్‌సే దూర్ హోగయే ॥అజీబ్॥

కిసీ కా ప్యార్ లేకే తుమ్
నయా జహాఁ బసావోగే ॥కిసీ కా॥
యే షామ్ జబ్ భీ ఆయేగీ
తుమ్ హమ్‌కో యాద్ ఆవోగే ॥అజీబ్॥

శైలేంద్ర పాట ఏది విన్నా 'ఈ సందర్భంలో నేను ఉంటే ఈ భావాలు నాకూ వస్తాయి, ఈ భావాలే వస్తాయి' అనిపిస్తుంది. 'కీపిట్ సింపుల్' అనే సూత్రాన్ని ఎల్లప్పుడూ పాటించటం వల్లనే ఆయన సామాన్య ప్రజలకు అంత చేరువ కాగలిగారు. కానీ సరళత్వం సాధించటం ఎంత కష్టమో అందరికీ తెలిసినదే. శైలేంద్ర గొప్పతనం అందులోనే ఉంది. సందర్భానికి తగినట్టు పాటలు రాయటమే కాకుండా చిత్రకథను తెలిపే గీతాలు, జానపదగీతాలు, వేదాంతపరమైన గీతాలు కూడా అద్భుతంగా రాశారాయన. 'మధుమతి'లోని 'ఆజారే పర్‌దేసీ' పాటలో ఓ అమ్మాయి తనకు కాబోయేవాడి కోసం ఎదురు చూస్తూ పిలిచినట్టూ ఉంటుంది; వారి జన్మజన్మల బంధాన్ని, తీరని ఆశలను సూచించినట్టూ ఉంటుంది. 'గైడ్' లో 'సైయ్యా బేయిమాన్' నృత్యగీతంలో కూడా కథ నడిపించారు శైలేంద్ర. అదే చిత్రంలో 'వహాఁ కౌన్ హై తేరా' పాటలో అశాశ్వతమైన భవబంధాల గురించి వేదాంత ధోరణిలో చెప్పారు. 'తీస్రీ కసమ్'లో జానపద గీతాలు, వేదాంత గీతాలు అందరికీ తెలిసినవే.

'దిల్ అప్నా ఔర్ ప్రీత్ పరాయీ' లోని 'అజీబ్ దాస్తాఁ హై యే' పాట వేదాంత గీతం కాకపోయినా ఆ ఛాయలు కనిపిస్తాయి. జీవితం మీద అవగాహన, ఆధ్యాత్మికత ఉన్న గీత







రచయితగా ఎన్నో పాటల్లో ఆణిముత్యాల్లాంటి లైన్లు రాశారు శైలేంద్ర. ఈ పాటలో పల్లవి జీవితానికి నిర్వచనంలా ఉంటుంది.

మీనాకుమారి, రాజ్‌కుమార్, నాదిరా ముఖ్యపాత్రధారులుగా కిశోర్ సాహూ దర్శకత్వంలో వచ్చిన చిత్రం 'దిల్ అప్నా ఔర్ ప్రీత్ పరాయీ'. సుశీల్ వర్మ (రాజ్‌కుమార్) అనే డాక్టర్ పనిచేసే ఆసుపత్రిలో నర్సుగా చేరుతుంది కరుణ (మీనాకుమారి). ఆమెకు అతనిపై ఇష్టం కలుగుతుంది. కానీ అతను వృత్తికి అంకితమైన డాక్టరు. ఆమె భావాలను గ్రహించడు. తల్లి బలవంతంతో అతను కుసుమ్ (నాదిరా)ను పెళ్ళి చేసుకుంటాడు. ఆమె తన భర్త ఎప్పుడూ తనతోనే ఉండాలని కోరుకుంటుంది. అతను అహోరాత్రులు ఆసుపత్రిలో ఉండటం ఆమెకు నచ్చదు. అతనితో గొడవ పడుతూ ఉంటుంది. అత్తను, ఆడపడుచులను కించపరుస్తూవుంటుంది. ఆమె ప్రవర్తనకు అతను కలత పడతాడు. కరుణ తనను ప్రేమించిందనే సంగతి క్రమేపీ తెలుసుకుంటాడు. వారిద్దరి మీదా కుసుమ్‌కు అనుమానం వస్తుంది. ఒకసారి ఒక పేషెంటుకు సీరియస్‌గా ఉందని ఫోన్ వస్తే భర్తకు చెప్పకుండా అతన్ని క్లబ్‌కి తీసుకువెళ్తుంది. ఆ పేషెంటు మరణిస్తాడు. తనకు ఫోన్ వచ్చిన విషయం చెప్పలేదని తెలిసి కుసుమ్‌పై మండిపడతాడు సుశీల్. ఆమెను హంతకురాలు అంటాడు. తన సంతోషం కోసం హత్య అయినా చేస్తానని అంటుందామె. చివరికి కరుణపై అనుమానం పెరిగి ఆవేశంలో ఆమెను తీసుకుని కారులో వేగంగా వెళుతూండగా అదుపుతప్పి కారు నీళ్లలో పడిపోతుంది. ఆ ప్రమాదంలో కుసుమ్ మరణిస్తుంది. సుశీల్ కరుణను కాపాడుతాడు.

సుశీల్ పెళ్ళి అయిన తర్వాత జరిగే పార్టీలో అందరి బలవంతం మీద కరుణ పాడే పాట 'అజీబ్ దాస్తాఁ హై యే'. అసుపత్రి స్టాఫ్ అంతా బోటు షికారు చేస్తూ పాడే ఈ పాటకు పాశ్చాత్య సంగీత ఛాయలతో, కోరస్‌తో సహజత్వానికి దగ్గరగా, వైవిధ్యంగా ట్యూన్ అందించారు శంకర్-జైకిషన్. వేదాంత భావాలతో విలక్షణంగా ఉంటుందీ పాట.

'అజీబ్' అంటే వింతైనది. దాస్తాన్ అంటే కథ, గాథ. షురూ అంటే మొదలు. ఖతమ్ అంటే ఆఖరు. మంజిల్ అంటే గమ్యం. మజిలీ అనే అర్థంలో కూడా వాడతారు.

**'వింతైన గాథయే ఇది**
**మొదలెక్కడో, తుదెక్కడో**









మీనాకుమారి గురించి చాలామందికి తెలియని విషయం ఒకటుంది. ఆమె ఎడమచేతి చిటికెన వేలు చాలా పొట్టిగా వుంటుంది. చిటికెన వేలు తొలి కణువు దగ్గర మడిచి, ముంచేతిని చూసుకుంటే ఎలావుంటుందో ఆ సైజులో ఉంటుందామె చిటికెన వేలు. తను నటించిన ప్రతి సినిమాలోనూ ఆ లోపం ప్రేక్షకుల కంట బడకుండా చాలా జాగ్రత్త పడేది. చీర కట్టుకుంటే ఆ వేలికి చెంగును చుట్టుకునేది. సల్వార్ కమీజ్ వేసుకుంటే కూడా అంతే... కాకపోతే చేతుల్ని కవర్ చేసుకోడానికి కుదరని నర్స్ డ్రస్ లాంటివి వేసుకునేటప్పుడు కెమెరా తన కుడివైపున ఉండేలా చేసుకునేది. ఎడం వైపు నుంచి చిత్రీకరణ జరపాల్సి వస్తే లాంగ్‌షాట్‌లు.. లేదా క్లోజప్‌లు... అంతే...! ప్రతిభ గల నటి గనుక నిర్మాణ బృందం నుండి కూడ ఈ విషయంలో సహాయ సహకారాలు అందేవి. అయితే 'దిల్ అప్నా ఔర్ ప్రీత్ పరాయి' లోని ఈ 'అజీబ్ దాస్తాఁ హై యే' పాటని థియేటర్‌లో చూస్తూన్నప్పుడు - ఒక షాట్‌లో - మీనాకుమారి తన ఎడం చేతిని పైకి తీసుకుంటుండగా రెప్పపాటు కాలంలో ఆమె ఎడం చేతి చిటికెన వేలు బైట పడుతుంది. ఈ సంగతి తెలిసి ఆ పాట అవుతుండగా నేల టిక్కెట్ క్లాస్‌లో తెరకు దగ్గరగా కూర్చొని గమనించి 'తెలియని ఆనందాన్ని' పొందిన ఆమె అభిమానులెందరో వుండేవారు ఆ రోజుల్లో. తెరపై ఒక లిప్తలో కనుమరుగయ్యే ఆ దృశ్యాన్ని - సాంకేతికంగా ప్రచురణారంగం సాధించిన ప్రగతి వల్ల - ప్రక్కనున్న ఫ్రేమ్‌లలో చూడవచ్చు.









ఈ మజిలీలు ఏమిటో
తానెరుగడు, నేనెరుగను'

తను ప్రేమించిన వ్యక్తి వేరొకరిని పెళ్ళి చేసుకుంటే ఆ పార్టీలో తాను పాడాల్సి రావటం ఆమెకు వింతగా తోచింది. ఇంకా ఈ కథ ఎన్ని మలుపులు తిరుగుతుందో అని అనుకుంటోంది. చివరికి ఏమౌతుందో ఆమెకు తెలియదు. ఇంకా ఎన్ని వింతలు జరుగుతాయో! అతనికైతే ఆమె ప్రేమ సంగతే తెలియదు. ఈ పల్లవిని జీవితానికి అన్వయించుకుంటే 'నానాటి బ్రతుకు నాటకము' అనే అన్నమాచార్య కీర్తన గుర్తొస్తుంది. జీవితం ఎక్కడ మొదలౌతుందో, ఎన్ని మలుపులు తిరుగుతుందో, ఎక్కడ ముగుస్తుందో ఎవరికీ తెలియదు.

రోష్‌నీ అంటే కాంతి, వెలుగు. ధువా( అంటే పొగ. చిరాగ్ అంటే దీపం. ఖాబ్ అంటే కల. 'ఖాబ్ సే పరీ' అంటే కలలకు అతీతం. పరీ అంటే దేవకన్య అనే అర్థం కూడా ఉంది. అది ఇక్కడ సరిపోదు. ఇది పరాయ అన్న మాటలోంచి వచ్చింది. కలలకు పరాయిదాన్ని కావాలని ఆమె కోరిక.

'ఈ వెలుగుతో పాటుగా
పొగేల చిమ్మింది దీపము
కలగంటున్నాను నే
కలలు కనని రోజు కోసము'

ఆమె ప్రేమ ఆనందాన్ని కలిగిస్తూనే విషాదాన్ని మిగిల్చింది. ప్రేమించటంలో ఉన్న ఆనందం వెలుగైతే, ప్రేమించినవాణ్ని పొందలేకపోవటం పొగలాంటి విషాదం. ప్రేమ అనే దీపం వెలుగునూ, పొగనూ చిమ్మింది. తాను కన్న కలలు ఫలించలేదు. ఇప్పుడు ఆమె కనే కల ఒకటే - కలలు కనకుండా ఉండాలని. కలలు కనకూడదని కలగంటున్నానని చెప్పటంలోనే మనసును అదుపులో పెట్టుకోవడం సాధ్యం కాదనే భావాన్ని పొదిగారు శైలేంద్ర.

ముబారక్ అంటే అభినందన. నూర్ అంటే కాంతి, వెలుగు. పాస్ అంటే దగ్గర.

'అభినందనం నీకు,
నువ్వు-వెలుగయ్యావు ఒకరికి
ఇంత చేరువయ్యావు ఒకరికి
దూరమయ్యావు అందరికీ'

అతనికి అభినందనలు తెలుపుతూ 'నువ్వు ఒకరి జీవితంలో వెలుగయ్యావు. వారికి దగ్గరై అందరినీ మరిచావు' అనటంలో అతిశయోక్తి ఉంది. ఆ అతిశయోక్తి కథాపరంగా ఉండాల్సినదే. అతనికి ఆ మాటలోని అసలు భావం అప్పుడు అర్థమవుతుంది. 'నా ప్రేమను గుర్తించలేక పోయావు' అనే భావంతో ఆమె అంటోందని అతనికి అర్థమైంది.

'నయా జహా(' అంటే కొత్త లోకం. బసానా అంటే అమర్చుకోవటం. షామ్ అంటే సాయంత్రం. 'యాద్ ఆనా' అంటే గుర్తు రావటం.

'ఒకరి ప్రేమతో నీవు
కొత్త లోకం కూర్చేవు
ఈ రోజు మళ్ళీ ఎప్పుడొచ్చినా
నీవు నాకు గుర్తుకొస్తావు'

'నువు కొత్తలోకం అమర్చుకుంటావు. కానీ ఈ రోజుని నేనెప్పటికీ మరచిపోలేను. ఈ రోజు వచ్చినప్పుడల్లా నువ్వు నాకు గుర్తొస్తావు' అంటోంది ఆమె. అతను తన దారిన వెళ్ళిపోయినా తను మాత్రం అతన్ని మరచిపోనంటూంది.

లతా, శైలేంద్ర, శంకర్ - జైకిషన్‌ల సినీ జీవితాలలోని ప్రత్యేకమైన పాటల్లో ఇది ఒకటి. దానికి ముఖ్యకారణం శంకర్ - జైకిషన్ సంగీతమే.

**- పి.వి.సత్యనారాయణ రాజు**



# బాపు విశ్వరూపం

25

(గత సంచిక తరువాయి)

బాపుగారి 'సీతాకళ్యాణం' సినిమాలో 'గంగావతరణం' పాట మీకు గుర్తుండే ఉంటుంది. అది రికార్డ్ చేస్తుండగా ఆయన అడిగిన ఎక్స్‌ప్రెషన్స్ నా దగ్గర్నుంచి రావటం లేదు - ఆయన శివుడు ఎలా నిల్చుంటాడో ఒక బొమ్మ పేపర్ మీద రెండు నిముషాల్లో గీసి వాయిస్ రూమ్‌లోకొచ్చి 'బాలుగారు ఇది శివుడుండే పద్ధతి. పాటకు సంబంధించిన ఎక్స్‌ప్రెషన్ నాకు ఇలా కావాలి' అన్నారాయన. పాడడానికి అది నాకు ఎంత హెల్ప్ చేసిందో చెప్పడానికి వీల్లేదు. అలాగే 'శ్రీనాథ కవిసార్వభౌమ' చేస్తున్నప్పుడు అందులో అన్ని పద్యాలు, పాటలు పాడే అవకాశం నాకిచ్చారు.

ఇక్కడో విషయం చెప్పి నా గుండె బరువు దించుకోవాలి. మా చెల్లెలు శైలజ పెళ్లి పత్రిక ఇవ్వడానికి రామారావుగారి స్టూడియోకి హైదరాబాద్‌కు వెళ్ళాను. 'శ్రీనాథ కవి సార్వభౌముడు' డబ్బింగో, ఎడిటింగో అక్కడ చూసి బయటకు వస్తున్నారు బాపుగారు. నన్ను చూడగానే 'ఏమిటి ఇలా వచ్చారు' అన్నారు - 'ఇలా ఇన్విటేషన్ ఇవ్వడానికి వచ్చానండి' అనగానే... 'ఒక్క నిముషం నిల్చోండి' అని చేతిలో ఉన్న ఫైల్స్ అవి పక్కనెవరికో ఇచ్చి వచ్చి నా కాళ్లకు దణ్ణం పెట్టారు. నా ప్రాణం ఉసూరు మనిపించింది. నాకర్థం కాలేదు అసలు. ఏమిటిది... ఇది... శాపమా? వరమా? అర్థం కాలేదు. నా కళ్ళనిండా నీళ్ళు వచ్చాయి. ఏంట్సార్ ఇది అంటే - 'మీ గాత్రంతోటి, మీ పాటలతోటి పద్యాలతోటి ఈ సినిమాకి ఎంత ప్రాణం పోశారు. సరస్వతి పుత్రులు మీ కాళ్ళకి దణ్ణం పెడితే తప్పేంటండి' అని అన్నారు. వారి హృదయ వైశాల్యానికి ఇంతకన్నా తార్కాణం ఏముంటుంది చెప్పండి.

నా దృష్టిలో బాపుగారి తీసినవన్నీ చాలా అందమైన సినిమాలు. చాలా గొప్ప సినిమాలు. కొన్ని డబ్బులు సంపాదించి ఉండవచ్చు, కొన్ని ఎకౌంట్‌లోకి కూడా రాకుండా ఫ్లాప్ అయి ఉండవచ్చు. కానీ అన్నీ అద్భుతమైన సినిమాలు. ఆయన తీసిన వాటిలో నాకు చాలా ఇష్టమైన సినిమా 'స్నేహం'. అందులో ఆరుద్ర గారిచేత రాయించుకున్న పాటలు, మామచేత చేయించుకున్న సంగీతం, నాచేత పాడించుకున్న తీరు... ఆ సినిమా నేను ఎన్నిసార్లు చూశానో లెక్కలేదు. ఆ సినిమా నిర్మాత ఒకసారి కాకినాడలో కనపడితే చుట్టుప్రక్కల ఎవరున్నారని చూడకుండా మా మిత్రులందరూ ఆయన కాళ్లమీద సాష్టాంగ పడిపోవడం నాకింకా గుర్తుంది. ఆ సినిమా వాళ్ళమీద అంత ప్రభావం చూపించింది. అందులో పాటలు ఈనాటికీ కూడా ఆణిముత్యాల్లాంటి పాటలు. నేను పాడిన చాలా మంచి పాటల్లో ప్రథమశ్రేణి స్థాయికి చెంది నటువంటి పాటలు. ఆ సినిమా ఎంత అందంగా తీసారో చెప్పడానికి వీల్లేదు.




ఓసారి.... బాపుగారు చాలా ఎక్స్‌పెక్ట్ చేసి తీసిన సినిమా ఏమాత్రం ఆడకపోగా మరో దర్శకుడు తీసినటువంటి చెత్త సినిమా చాలా అద్భుతంగా రన్ అవుతోంది. మిత్రులెవరో నేనున్నప్పుడే వారి సమక్షంలో బాధపడిపోతూ 'ఇంతకంటే అన్యాయం ఏముంటుందండి ప్రపంచంలో. ఇంత అందమైన సినిమా తీశారు కానీ ఓ చెత్త సినిమా

## బాపురమణల రూపకల్పనలో తయారైన 'శ్రీనాథ కవిసార్వభౌముడు' చిత్రంలో ఎందరో అభిమానులచే కంట తడిపెట్టించిన సన్నివేశం, బాలూకి ఇష్టమైన సన్నివేశం... ఇదే...

మహారాజ వైభోగాలను అనుభవించిన శ్రీనాథ కవిసార్వభౌముడు కాలక్రమేణా తనకు ఆశ్రయం కల్పించిన రాజులను కోల్పోయాడు. పన్ను కట్టలేదన్న నెపంతో రాజోద్యోగులు అతణ్ణి హింసించారు. సంకెళ్ళతో బంధించి మెడపై వెదురు గడియ నుంచారు. వీపున ముళ్ళగుండును వ్రేలాడదీసి కొరడాలతో కొట్టారు.



ఈ అవమానాలకు శ్రీనాథుని హృదయం తట్టుకోలేక పోయింది.

"ఇక ఇంటికి రాను నన్ను అమరేశ్వరుని కోవెలకు చేర్చండి. ఒక్కమారు ఆయనను కలుసుకుని అటునుండి అలాగే వెళ్లిపోతాను" అంటూ ప్రాయోపవేశానికి ఏర్పాట్లు చెయ్యమన్నాడు.

"తనలోని ప్రాణదీపాన్ని ఆత్మహత్యా మార్గంలో కాకుండా యోగశక్తితో ఆర్పేసి ఈ శరీరాన్ని వదిలి వెళ్లిపోవడం మహాయోగులకే సాధ్యం కాలేదు...మరి తమరు...నిన్నటి వరకు మహాభోగులు" అంటూ అనుమానాన్ని వెలిబుచ్చారు పండితులు.

"అవును... వాసన కొట్టే ఈ మాసిన బట్టల్ని మహాభోగిని కాబట్టే భరించలేక వదిలివేస్తున్నాను. ఎంత భోగినో అంత యోగినీ కాగలను" అన్నాడు శ్రీనాథుడు నిశ్చల మనస్కుడై, నిర్వికారంగా.

"తమకు ఇహలోక బంధాలు ఇంకా కొన్ని వున్నాయి. సజీవులైయున్న తమ అర్థాంగి అనుమతి తీసుకోవాలి కదా" అన్నారా పండితులు.

"ఆవిడ నాలో సగం...నా మాటకు అర్థం....నా భావానికి భాష....మాకు తేడాలేదు.....రాదు.. " అన్నాడు శ్రీనాథుడు

అంతలో శ్రీనాథుని భార్య వచ్చింది. అతడి నిండైన సుఖజీవితానికి సాక్ష్యంగా నిలిచిన ఆమెకు - శ్రీనాథుని ఆ స్థితిలో చూడగానే కన్నీరాగలేదు. ఏడవ్వొద్దన్నట్టు - అనునయదృక్కులతో ఆమెను వారించాడు శ్రీనాథుడు. దుఃఖాన్ని దిగుమింగుకోవడానికి ప్రయత్నిస్తున్న ఆమెను ఆప్యాయత తొణికిసలాడే చూపులతో రమ్మని ఆహ్వానించాడు. ఆమె వచ్చి పాదాలకి నమస్కరించబోతుంటే లేవనెత్తి, పక్కన కూర్చో బెట్టుకొని ప్రేమగా తల నిమిరాడు.

అతడి శరీరంపై తట్టు తేలిన కొరడా దెబ్బలను చూడగానే మళ్ళీ దుఃఖం పొంగు కొచ్చిందామెకు. దెబ్బ ఉన్నచోట స్పృశించి సేద తీర్చాలని ప్రయత్నించింది. స్పర్శ తగలగానే గాయం జివ్వుమంది. శారీరక ధర్మం ప్రకారం అతడి మేను ప్రకంపించింది. దాంతో మళ్ళీ దుఃఖం కట్టలు తెచ్చుకుందామెకు.

వలదన్నట్టు వారిస్తూ "దెబ్బలు చిలక్కి కాదు.... పంజరానికి" అన్నాడు. ఈ దేహపంజరాన్ని వదిలిన ఆత్మ కొత్త జన్మను ధరిస్తుంది. అందుకే "హేమంత శిశిర ఋతువులకి మళ్లీ వసంతం వస్తుంది...ఆకులు రాలిపోయాయని ఏడవరాదు... కొత్త చిగురు తొడిగి కొత్త పూలు పూస్తాయని నవ్వుకునే వేళ.... కదా..." అంటూ తన ఆత్మను ఆమె ముందు ఆవిష్కరించాడు.

అద్భుతంగా పోతోంది' అన్నారు - మామూలు మనిషి ఎవరైనా రియాక్టయి 'కదండి మరి చూశారా ఎంత బాధగా ఉంటుందో' అంటారు. నాకు బాగా గుర్తు... ఆరోజున బాపుగారు 'ఏమిటోసార్ మనం తీసిన సినిమా జనానికి నచ్చలేదు. వారికి కావాల్సింది ఏదో ఇవ్వడం ఆయనకు చాతనైనట్టుంది. అందుకే ఆ సినిమా సక్సెస్ అయ్యింది. మనం ఆ సినిమా చూసి నేర్చుకోవాల్సింది ఎంతో వుంది'అన్నారు. ఇది వ్యంగ్యంగా అన్న మాట కాదండి చిత్తశుద్ధితో అన్నమాట.

ఆయన తన మీద తాను వేసుకున్న కార్టూన్లు ఎన్నున్నాయో లెక్కకు తెలియదు. చెప్పడానికి వీల్లేదు. నేను ఎంతసేపు సినిమాల గురించే మాట్లాడుతున్నాను. బాపు గీత గురించి బాపు అక్షరం గురించి ఏం చెప్పగలను . ఇక రమణగారి పదాల పడికట్టు అంటే నాకు చాలా చాలా ఇష్టం. త్రివిటితో ఆ పద్ధతిలో డైలాగులు రాసేవాళ్ళు చాలా అరుదు. ఆరోజుల్లో ఒక్క ఆత్రేయను చూశాను ఆ తర్వాత గణేష్‌పాత్రో ఇప్పుడొస్తున్న వాళ్ళలో త్రివిక్రమ్ శ్రీనివాస్. చాలా అరుదైనటువంటి పద్ధతి రమణగారి పద్ధతి. లోతయిన భావాన్ని ఎంత అందంగా మామూలు వాడుక పదాలతోటి చెప్పిస్తారో అంత ముక్తసరిగా మాట్లాడుతారాయన. ముఖ్యంగా 'శ్రీనాథ కవిసార్వభౌమ'లో ఆఖర్న నిర్యాణం చెందబోయేముందు భార్య విలపిస్తూంటే - అనునయిస్తూ శ్రీనాథుడు చెప్పేటటువంటి సంభాషణ నాకు ఎంతో ఇష్టం. ఆ సినిమా కోసం ఆయన రాసుకున్న స్క్రీన్‌ప్లే పుస్తకం చూసి నాకు నచ్చిన సన్నివేశాలన్నీ ఆయన పర్మిషనుతో చించి తీసి జాగ్రత్తగా దాచుకున్నాను. అవి నాకు దొరికిన వరాలు. మొన్న 'ఘంటసాలగారి బయోగ్రఫీ' - మన ఘంటసాల ప్రింట్ చేసిన తర్వాత ఇంటికి పంపిస్తే బాపుగారు ఊర్లో లేరు. రమణగారు ఒక అందమైన ఉత్తరం రాసి పంపించారు నాకు. దాన్ని అతి జాగ్రత్తగా దాచుకున్నాను. ఇప్పట్లో వీటి విలువలు తెలియవు ఆ తర్వాత నా మనుమలు, మనుమరాళ్లకు కూడా ఇవి ఫలానా వాళ్ళు రాశారని నేను చూపించాలని నా కోరిక. నేను లేకపోయినా వాళ్ళు చూసి చదివి సంతోషించాలన్నది నా ఆకాంక్ష.

చాలామంది నిరాడంబరంగా ఉంటున్నట్టు నటిస్తారు. కానీ బాపురమణగారి నిరాడంబరత నిజంగానే... వాళ్ళ రక్తంలో ఉన్నటువంటి లక్షణమే. ఆడంబరంగా డ్రస్సు చేసుకోవడం ఎప్పుడూ చూడలేదు నేను. ఒక్కోసారి చినిగిన చొక్కాలు వేసుకోవడం కూడా గుర్తుంది. 'ముత్యాలముగ్గు' సినిమాకి అవార్డు వచ్చిన తర్వాత దూరదర్శన్‌లో బాపుగారిని రమణగారిని ఓ ఇంటర్వ్యూ నన్ను చేయమన్నారు. వాళ్లిద్దర్నీ పట్టుకొని దూరదర్శన్‌కు తీసుకొచ్చేసరికి తలప్రాణం తోకకొచ్చింది. మొదట బాపుగారిని తీసుకొచ్చాం. రమణగారు ఎంతకూ రారు. వస్తారో రారో తెలియదు. వెయిట్ చేస్తూ కూర్చున్నాం. బాపుగారు కూడా ఫోన్ చేస్తున్నారు 'ఏమిటి వెంకటరావు ఎక్కడున్నావ్' అని. 'ఇంట్లోనే ఉన్నాను.' 'మరి రావేమిటి?' 'చొక్కా చాకలికి వేసాను ఇంకా రాలేదు మంచి చొక్కా లేదయ్యా ఎలా రాను' అంటున్నారు రమణగారు. 'నా చొక్కా ఉంటుంది వేసుకొని రావయ్యా' అని బాపుగారు అనడం ఇవన్నీ బాగా గుర్తు నాకు. తీరా వచ్చిన తర్వాత ప్రశ్నలు అడిగినవాణ్ణి నేనే సమాధానం చెప్పినవాణ్ణి నేనే. అన్నింటికి ముక్తసరిగా తలకదిలిస్తూనో... లేక 'ఊహు.. ఆహా..' అంటూనో ఉన్నారే తప్ప నోరు విప్పి ఒక్క మాట మాట్లాడలేదు.

అలాగే దర్శకుడు వంశీ బాపుగారి ఒక డాక్యుమెంటరీ మీద తీశారు. సూత్రధారిగా నన్ను నిర్వహించమన్నారు. ఆరోజున కూడా అదే తంతు... ప్రశ్నలు మేమే రాసుకుని సమాధానాలు కూడా వారి దగ్గర్నుంచి ముందుగా రాయించిపెట్టుకుని 'ఇలా అంటారా? అలా అంటారా?? 'ఓహో... అదన్నమాట' అని అనవలసి వచ్చిందే తప్ప బాపుగారు గాని రమణగారు గాని ప్రసంగించడం నేను వినలేదు. ఇక సభలు, ఫంక్షన్స్ అయితే చెప్పాల్సిన అవసరమే లేదు. ఏనాడు వేదిక మీద కూర్చోవడం అనేది నేను చూడలేదు.

వాళ్ళ సినిమా 'ముత్యాలముగ్గు' సిల్వర్‌జూబ్లి విజయవాడలో జరుగుతోంది. అందరూ వెళ్ళిపోయారు. చివరి కారులో నేను, గంటి లక్ష్మణ బాబాయి, రమణగారు వెళ్తున్నాం. అప్పటికే జనం ఎక్కువైపోయి గేట్లు వేసేశారు. ముందు సీట్లో రమణగారు ఉన్నారు. గేట్లు తీయనంటున్నారు. లోపల రగడ, పోలీసులు. 'మనం హాయిగా హోటల్ వెళ్ళిపోదామండి.

అతడి భావాలకు ఆమె భాష.. కానీ ఆమె భావాలకు భాష ఆమె చూపులే... ఇద్దరం ఒకటనుకున్న తర్వాత గమనం, పయనం వేరుగా ఎలా సాగించగలం? శ్రవణం, దర్శనం, స్పర్శ ద్వారా ఒక మనసులోని మాట ఇంకో మనసుకి అర్థం అవుతుంది. వీటికి ఆశ్రయం కల్పించిన ఈ శరీరాన్ని త్యజించాలనుకుంటే - ఆత్మల ద్వారా ఈ అనుభూతుల్ని పొందగలమా? మరు జన్మలో ఒకరికొకరు ఏమౌతాం... ఏడేడు జన్మల అనుబంధానికి ప్రతీకగా నిలిచిపోయే వైవాహిక బంధంతో పెనవేసుకుపోయిన మన జీవితాలకిది ఎన్నో జన్మ? అంతర్మథనానికి గురవుతున్న గుండెను కళ్ళలో పొదిగి అతని వైపు చూసిందామె...

కానీ శ్రీనాథుడీ జీర్ణవస్త్రంలో ఇమడలేకపోతున్నాడు. జీవితం గురించి ఎంతో ఊహించుకుంటాం.... ఏవేవో చేయాలని అనుకుంటాం. కాని ఆ కోర్కెల పరిమితి ఎంత... జీవితం పరిధి ఎంత...?

- అందుకే "కోరికలబ్బాయ్ కథ గుర్తుందా.... వాడికి బాగా దాహం వేసింది" అంటూ తమిద్దరికీ తెలిసిన కథను గుర్తు చేశాడు

"ఆ బాధ కొద్దీ దేవుణ్ణి బిందెడు నీళ్లు కావాలని కోరుకున్నాడు" అందామె.

"కానీ వాడి చిన్ని చేతుల్లో ఇమిడేది..."

"చెంబుడు నీళ్లు"

"కానీ వాడి దాహానికి కావలసినది "

"గుక్కెడు".

ఇద్దరూ నవ్వుకున్నారు... మనసారా, తనివారా....

ఇద్దరికీ తెలుసు... ఒకటయిపోయిన తమ మనసులకి చోటిచ్చిన ఈ తనువులను విడిచివెళ్ళాల్సిన సమయం దగ్గర పడుతోందని. అయినా ఒకరంటే ఇంకొకరి కున్న ప్రేమ. ఒకరికి భాషై అనునయ వచనాల రూపంలో వేదాంతాన్ని జీర్ణించుకుని ప్రవహిస్తూ వుంటే - ఇంకొకరికి మౌన భాష్యంగా తడియారని కళ్ళతో ప్రసరిస్తోంది...

"అంచేత ఈశ్వరుడు మనం అడిగినప్పుడు అడిగినంతా ఇవ్వడు.... మన అమ్మలాగే! మనకి ఎప్పుడు ఎంత యిస్తే మంచిదో అంతే ఇస్తాడు... కదా..." అన్నాడు శ్రీనాథుడు.

ఆమె అతని వైపు చూసింది. ఆ చూపుల గాంభీర్యంలో అతడిలో సగంగా జీవించి- అతడి నిశ్చయాన్ని పూర్తిగా స్వీకరించిన సంపూర్ణత్వంతో నిండిన నిర్ణయం ఉంది.

"మనం బయల్దేరినా ఆయన ఆగరా అంటే ఆగిపోవాలి...కదా.." అన్నాడు శ్రీనాథుడు -

ఆమెకు అర్థమైపోయింది. తనిప్పుడు చేయగలిగేది అతని పయనానికి తోడు కాగలగట మొక్కటే! సమాయత్తమయింది. కళ్ళు మూసుకుని తన స్వామిని తలుచుకుంటూ అతని గుండెపై తన చేతినుంచి నెమ్మదిగా తలవాల్చింది. మనసుతో మనసుని ముడివేసిన ఈ వైవాహిక బంధం - అతని ఆత్మతో తన ఆత్మను జోడిస్తే - పంచుకున్న ఋణం తీరుతుంది! తన స్వామి బంధవిముక్తుడవుతాడు

"ఆయన ఇంతటి ఉపకారం చేసి నా యింటికి రారా అంటే వెళ్లి తీరాలి...కదా...ఆవిడ తర్వాత వస్తుందిలే అంటే కాదనలేము...కదా..." అంటున్నాడు శ్రీనాథుడు....

'ఆవిడ తర్వాత వస్తుందిలే' అని ఆ ఈశ్వరుడు అంటే కాదనలేని ఇబ్బంది తన స్వామికి కలిగితే విలవిల్లాడిపోయే ఆ ఇల్లాలి ప్రాణం అనంత విశ్వంలో కెగసిపోయింది. శరీరం అచేతనమై పోయింది. అతని చేతిని పట్టుకుని నడిచిన ఆమె చేయి, జారిపోయింది... ఆమె చేజారి పోయింది. యోగి కానున్న అతని మనసు ఈ వియోగానికి 'భవ బంధ గౌరవం' తో చివరిసారిగా కట్టలు తెంచుకుంది.

"చెప్పాను కదా. నా మాటకు అర్థం...నా మనసుకి భాష... మాటల్లోనే మనసు తెలిసి...ముందే వెళ్లి పోయింది. వాసాంసి జీర్ణాని యథా విహాయా

మనం ఇక్కడుండి చేసేది లేదు లోపల ఉండాల్సినవాళ్ళు ఉన్నారు సినిమా ఫంక్షన్ అయిపోతుంది. మనం అనవసరం కదా' అని అన్నారు రమణగారు. నాకు నవ్వాలో ఏడవాలో తెలియలేదు. అతి బలవంతంగా లోపలికి తీసుకెళ్తే వేదికమీద అసలు కూర్చోలేదు. ఓ మూల నిల్చున్నారు అంతే! ఒక పూలమాల కూడా వేయించుకోలేదు. అది వాళ్ళ వినయ సంపద.

అలాగే 'త్యాగయ్య' చేస్తున్నప్పుడు కూడా ! 'శంకరాభరణం'లో వాగ్గేయకారుల పాటలు ఒకటో రెండో తప్ప మిగతావన్నీ మామ కంపోజ్ చేసినవే. ఇందులో త్యాగయ్య స్వరపరిచిన కీర్తనలు పాడాలి. కాళ్ళలో వణుకు గుండెలో చలి ఏమి చేయాలో తెలియదు... నామీద ఎంతో నమ్మకంతో పుహళేందిగారిచేత పాడించి, రిహార్సల్స్ చేయించి... 'మాకు కావాల్సింది ఆ గమకాలు స్వరాలు కాదండి. ... ఆ ఆర్తి కావాలి... అది మీరే పలికించాలి' అని వాళ్ళు నాచేత పాడించుకున్నతీరు జీవితంలో మరిచిపోలేను. పండితుల దృష్టిలో నేను పాడింది శుద్ధ కర్ణాటకం కాకపోవచ్చేమో కాని కొంతమంది గొప్ప విద్వాంసులు కూడా ఈ భావం మేం పలికితే ఎంత బావుండేది అని అనిపించేలా నాచేత పాడించుకున్నట్టు బాపురమణలకి - ఎన్ని వేలసార్లు వాళ్ళ పాదాలు కడిగి నా నెత్తి మీద నీళ్ళు పోసుకున్నా కూడా ఆ ఋణం తీర్చుకోలేను.

ఇలా చెపుతూ పోతే ఎన్నెన్నో చెప్పవచ్చు.



చాలాచాలా సంఘటనలు ఉన్నాయి నేను చెప్పవలసినవి.

సభామర్యాదపూర్వకంగా ప్రింట్‌లోకి రాలేనటువంటి విషయాలు చాలా ఉన్నాయి వాటిలో కూడా వాళ్ళ సహృదయం, మాతో కలిసి పోయినటువంటి పద్ధతి, వాళ్ళు చూపించిన ఆదరణ జన్మలో మరిచిపోలేను. గొప్ప అదృష్టం ఇంకొకటి ఏమిటంటే - నేను గాయకుడిగా పుట్టినరోజు... అంటే మొట్టమొదటి నా పాట రికార్డ్ చేసిన రోజు డిసెంబరు 15, 1966. బాపుగారి పుట్టినరోజు కూడా డిసెంబరు 15. ప్రతిసంవత్సరం ఆయనకు ఫోన్‌చేసి 'ఇవాళ నా పుట్టినరోజండి' అంటా, 'అదేంటి జూన్ కదా' అంటారాయన. 'గాయకుడిగా పుట్టింది నేను ఈరోజునే' అంటే... 'హా లక్కీ అయామ్' అంటారాయన.

ఇలాంటి మహామనీషుల్ని... అంతర్జాతీయ ప్రఖ్యాతి గాంచినటువంటి ఈ మహానుభావుల్ని.... వాళ్ళని గౌరవించవలసిన బాధ్యత ప్రభుత్వానికి చాలా ఉన్నది. నా మనసులో ఉన్న మాట చెప్తున్నాను తెలుగునాట ఇవాళ ఎవరో కొద్దిమంది తప్ప వాళ్ల గురించి అనుకునేవాళ్ళే లేరు. ముఖ్యంగా సినిమా పరిశ్రమ. ఇలాంటి మహానుభావులకు దక్కవలసినటువంటి గౌరవం దక్కలేదని నా బాధ. ఏమాత్రం అవకాశం ఉన్నా వాళ్ళకు కట్టబెట్టవలసిందంతా కట్టబెట్టాలి అన్నదే నా తాపత్రయం. కాని వాళ్ళను ఒప్పించడం కూడా చాలా కష్టమైన విషయమే ఎందుకంటే అలాంటి వాటికి చాలా దూరంలో ఉండేటువంటి వ్యక్తులు వాళ్ళు. ఇలాంటి మహానుభావుల గురించి... కొన్ని నేరుగా వారితో చెప్పుకోలేనటు వంటివి 'హాసం' మూలంగా నాకు చెప్పుకునే అవకాశాన్ని నాకు ఇచ్చారు. ఇది కూడా సంపూర్ణంగా నా మనసులో ఉన్నదంతా చెపుతున్నానన్న తృప్తి నాకులేదు. చెప్పదలచుకుంటే ఓ గ్రంథమే వ్రాసేయవచ్చు. ఇప్పుడు 'హాసం'లో వారిగురించి వస్తున్న ఈ వ్యాసాల్లో నాది కూడా ఒకటి అవుతున్నందుకు నాకు చాలా సంతోషంగా ఉంది. అందుకు సోదరుడు రాజాకి చిర ఋణగ్రస్తుణ్ణి.

బాపు రమణ అంటే - తెలుగు మాటా, పాటా - కలం, సిరా - శృతి, లయ - స్వరం, భావం - దీపం, కాంతి - భాష, భావం - వేదం, నాదం - అక్షరం, పదం... వీరిద్దరికి భగవంతుడు చిరాయువుని ఇవ్వాలి. తెలుగునాట వీరు తయారుచేసిన కదిలే కదలని బొమ్మల కొలువులు చిరకాలం ఉండాలి. వీళ్ళ బొమ్మల కొలువుతో ప్రతిరోజు దసరా కావాలి. భగవంతుడు వీళ్ళకి ఆరోగ్యాన్ని ఇవ్వాలి. వీళ్ళకు రావలసిన గుర్తింపు రావాలి. ఇవీ నా కోరికలు... నేను కవిని కాను తెలుగు మీద నాకు మక్కువ ఎక్కువ ఉన్నందువల్ల అందరూ నాకు తెలుగులో ప్రవేశం ఉందని అనుకుంటారు కాని రాయదలచుకుంటే ఎంతెంతో రాయాలని పిస్తుంది. కాని నాకు చేతకాదు... నా గుండెను పేపరు మీద పరిచాను... ఇంతకంటే నేను ఏం చెప్పలేను... వాళ్ళకు సాష్టాంగ దండ ప్రమాణాలు సమర్పించుకుంటున్న...

ఓ భక్తుడు
బాలసుబ్రహ్మణ్యం

---

ఈ మాసిన బట్టలు విడిచిపెట్టి కొత్త చీర సింగారించి స్వర్గంలో నాకోసం కర్పూర తాంబూలాలు కట్టిస్తూ ఉంటుంది. నేను రానిదే లేనిదే మీకెలా జరుగుతుందండీ అని సాధించేది....సగం వెళ్లి పోయింది. మిగిలిన సగానికి ఉండటమే సమస్య వెళ్లడం కానే కాదు.....ప్రాయోపవేశానికి దయతో సంకల్పించ వలసిందిగా వేడుకుంటున్నాను" అన్నాడు.

పండితోత్తములు, సద్బ్రాహ్మణుల సాక్షిగా వేదోక్తమంత్ర సహితంగా శ్రీనాథుడు ప్రాయోపవేశం చేసి ఈ తనువును చాలించాడు.

కాశికావిశ్వేశు కలిసెవీరారెడ్డి
రత్నాంబరంబులే రాయడిచ్చు
రంభకూడె తెలుంగు రాయరాహుత్తుండు
స్వర్గస్థుడయ్యె విస్సన మంత్రి
మరి హేమపాత్రాన్నమెవ్వరీ పంక్తి గలదు?
కైలాసగిరి పండె మైలారు విభుడేగి
దినవెచ్చమే రాజు తీర్పగలడు
భాస్కరుడు మున్నె దేవుని పాలికరిగె
కలియుగంబున ఇక నుండు కష్టమనుచు
దివిజ కవివరు గుండియల్ దిగ్గురనగ
నరుగుచున్నాడు శ్రీనాథుడమరపురికి

కస్తూరి కే రాజు ప్రస్తుతించు




# మిస్టర్ పెళ్ళాం



దర్శకత్వం బాపు

కథ-స్క్రీన్‌ప్లే-సంభాషణలు ముళ్ళపూడి వెంకటరమణ

వెండితెర నవల

నవలీకరణ ఇలపావులూరి మురళీమోహనరావు

**9**

**జరిగిన కథ**

బాలాజీ, ఝాన్సీ భార్యాభర్తలు. బాలాజీకి ఆడవారంటే చులకన భావం. బ్యాంకులో క్యాషియర్‌గా ప్రమోషన్ పొందిన రోజే మేనేజర్ చేసిన మోసం వల్ల క్యాష్‌లో లక్ష రూపాయలు తేడా వస్తుంది. సస్పెండ్ అవుతాడు. ఈ విషయం బయటకు పొక్కి, వేరే ఏ ఉద్యోగమూ దొరకదు. ఝాన్సీ తన కాలేజ్‌మేట్, గోపాల్ కంపెనీలో రికమెండ్ చేస్తానంటుంది. తన కథ తెలిసాక వాళ్లూ పొమ్మంటారంటాడు బాలాజీ. అయితే తనే ఉద్యోగానికి వెళతానంటుంది ఝాన్సీ. అలా అయితే తను ఇంటిపని చూసుకుంటానంటాడు బాలాజీ. నష్టాల్లో నడుస్తున్న గోపాల్ కంపెనీ లాభాల బాటలో ప్రయాణించే సూచనలివ్వటంతో ఝాన్సీని తమ కంపెనీలో కీలకమైన స్థానానికి ఎంపికచేసుకుంటారు. ఝాన్సీ ఉద్యోగంలో చేరుతుంది.

-(ఇక చదవండి)

రాత్రి దాదాపు తొమ్మిది గంటలైంది. ఇంటిముందు కారు ఆగింది. కార్లోంచి దిగింది ఝాన్సీ. కారును పంపించి తలుపుకొట్టింది.

గభాల్న పేపరందుకుని చదువుతున్నట్లు నటిస్తున్న బాలాజీ. 'తీసేవుంది' అన్నాడు ముక్తసరిగా. లోపలికొచ్చింది ఝాన్సీ.



భార్యను చూడనట్లే నటిస్తూ 'ఎలా ఉంది తొలిరోజు ఉద్యోగం? తీసేశారా? మానేశావా?'' అడిగాడు వ్యంగ్యంగా.

సమాధానం లేదు. ఝాన్సీ నేరుగా బెడ్‌రూమ్‌లోకి వెళ్ళింది. పిల్లలు నిద్రపోతున్నారు. వారిని ప్రేమగా నిమిరింది.

తన వ్యంగ్య బాణానికి సమాధానం రాకపోవడంతో వెనక్కు తిరిగి చూశాడు బాలాజీ. ఝాన్సీ కనిపించలేదు. పిల్లల దగ్గరకెళ్ళిందని గ్రహించాడు. 'తల్లి ప్రేమ!' అనుకున్నాడు ఈ లోకంలోకొచ్చి. అప్పుడర్థమైంది తను పేపర్ చదువుతున్నట్లు నటించడం భార్యకు తెలిసిపోయిందని.

"ఆఫీసులో మగాడిదలు,తోడేళ్ళు, గోపాళ్ళు, జోకాళ్ళు ఏవేం చేశారు ఏంయేం కూశారు?'' అన్నాడు దర్పం తగ్గకుండా.

భర్త దగ్గరకు వచ్చింది ఝాన్సీ. "సరిగ్గా అన్నాలు తిన్నారా పిల్లలు? పెందలాడే వచ్చి వంట చేద్దామన్నా మీటింగులో లేటయిపోయింది" చెప్పింది.



"బ్రహ్మాండంగా తిన్నారు. లొట్టలేస్తూ తిన్నారు. ఏం... నాకామాత్రం వంట చెయ్యటం చేతకాదనా?'' అన్నాడు భార్యను ఓరకంట చూస్తూ.

రెండు కుర్చీలను కలిపి చిన్న టేబుల్‌లా అమర్చాడు. టిఫిన్ క్యారియర్, రెండు కంచాలు మంచి నీళ్ళు రెడీగా ఉంచాడు.

క్యారియర్ తెరిచి "వడ్డించా... భోజనానికి రావచ్చు" కేకవేశాడు. నూలు చీర కట్టుకుని ఫ్రెష్‌గా వచ్చింది ఝాన్సీ. టేబుల్ అరేంజ్‌మెంట్ చూసి "భలే బాగా అరేంజ్ చేశారండీ డైనింగ్ టేబులూ" అన్నది నవ్వుతూ.

తల్లీ తండ్రీ మెచ్చుకున్నా ఆనందం కలగదు కానీ పెళ్ళాం మెచ్చుకుంటే మాత్రం ఏ మగాడికైనా ఆనందం ఆంజనేయుడి వాలంలా పెరిగిపోతుంది కదా!



బాలాజీ కూడా భార్య కాంప్లిమెంటుకు ఉబ్బితబ్బిబ్బయ్యాడు. "అదే బుర్రలో రొమాన్సుండాలి. డ్యూటీలా పెట్టుకోవడం, తినడం, తొంగోడం అయితే ఎలా, మడిసికీ గొడ్డుకూ తేడా ఏటుంటది?" కంచంలో వడ్డిస్తూ అన్నాడు.

భర్త మాటలకు నవ్వి కంచాలవైపు చూసింది. రకరకాల వంట పదార్థాలను చూసి ఆశ్చర్యపోయింది. "అరె! బిర్యానీ! అన్నమే వండగలరా అనుకుంటే బార్యానీయే చేసేశారే" అని స్పూన్‌తో కొంచెం తీసుకుని రుచి

చూసి "చాలా బాగుందండీ" అన్నది సంతోషంగా.

నవ్వాడు బాలు. 'హె! భర్తల్ సేయగలేని వంట గలదె భార్యల్ సవాల్ చేసినన్ ఆఁ..." అన్నాడు గర్వం నటిస్తూ.

కిలకిల నవ్వింది ఝాన్సీ.

మరో బాక్స్ మూత తీసింది. దాన్లో చిన్న కాగితం తగిలింది. తీసి చూసింది. అది హోటల్ బిల్లు. బిర్యానీ ఎలా వచ్చిందో అర్థమైంది.

బిల్లును మెల్లిగా తీసి దాచిపెట్టి "బిర్యానీ తయారీలో కిటుకులు చెప్పరూ?" అన్నది గోముగా.

పాపం! బాలాజీ ఆ విషయం గమనించలేదు.

"చాలా ఉన్నాయి. నలభీమపాకాలు ఆడవాళ్ళకు చెప్పినా అర్థంకావు" అన్నాడు వడ్డిస్తూ.

"ఒక కిటుకు అర్థమైంది హోటల్ బిల్లు నలభై ఎనిమిది రూపాయలు" బాంబు పేల్చింది ఝాన్సీ.

ఖంగుతిన్నాడు బాలాజీ. లేని నవ్వు తెచ్చుకుంటూ 'అదా...ఏదో... పిల్లలు సరదాపడితే..." ముద్దనోట్లోపెట్టుకుని అన్నాడు.

"ఏమిటండీ ఇది? ఇలా రోజూ హోటల్ నుండి కొంటే జీతం డబ్బులు ఏ మూలకొస్తాయండీ" అన్నది మామూలుగా.



ఆ మాటలకు బాలాజీ అహం దెబ్బతిన్నది. తనకు సంపాదనలేదని భార్య చిన్న చూపు చూస్తున్నదని అనుమానించాడు. అవమానంగా భావించాడు. "నా యిష్టం. నేను రోజూ కొంటాను. అష్ట రాల్ పాతిక రూపాయలు! నీ జీతం చాలకపోతే ఇంకా గడించు. ఛాలెంజ్ చేశావుగా" అన్నాడు గొంతు హెచ్చించి.

"వద్దు. రేపట్నుంచీ వంట నేనే చేస్తాను." అన్నది ఝాన్సీ.

ఆ మాటతో బాలాజీ కోపం హద్దు మీరింది. అన్నం పళ్ళేన్ని నేలకేసి విసిరికొట్టాడు. "అఖ్ఖర్లేదు. ఏదో... ఒక్కరోజు నీకిష్టం కదాని నాలుగు డబ్బులు పెట్టి హోటల్నుంచి తెప్పిస్తే ఇంత గొడవ చేస్తావా? నువ్వేం వంట చెయ్యఖ్ఖర్లేదు. నేనే చేస్తాను. చేతకాకపోతే నేర్చుకుంటాను. మీ కొక్కరికే కాదండీ. మాకూ తెలివి తేటలున్నాయి." అరిచి విసవిసా వెళ్ళిపోయాడు.



ఏడుస్తూ తాను కూడా లేచింది ఝాన్సీ. ఆ అలికిడికి పిల్లలు నిద్రలేచారు. 'ఇపుడు నేను తప్పుగా ఏం అన్నానండీ?" కళ్ళు తడుచుకుంటూ బెడ్రూమ్లో పిల్లల ఏడుపు వినిపిస్తే అక్కడికి పరిగెత్తింది.

ఇద్దరివీ మంచి మనసులే అయినా అపార్థాల పొరలు కమ్మినపుడు సంసారం దుఃఖభాజనమే కదా!

* * *

వీధిలో చెట్టుకింద! రచ్చబండ - నలుగురు స్త్రీలు కూర్చుకుని సినిమా పత్రికలు చదువుతూ పోచికోలు కబుర్లు చెప్పుకుంటున్నారు. అరబోసిన అప్పడాలు, వడియాలను కాకులెత్తుకుపోకుండా కాపలా కాస్తున్నాడు నర్సయ్య. అతని పక్కనే కుర్చీ వేసుకుని కూర్చున్నాడు బాలాజీ.

నర్సయ్య బాలాజీ చెవిలో జోరీగలా దూరాడు.

"ఏవయ్యా బాలాజీ. మీ ఆవిడ చేరినప్పట్నుంచీ ఆ కంపెనీ అమ్మకాలు జోరుగా ఉన్నాయట? జీతమేమైనా పెంచారేమో నీకేమైనా చెప్పిందా?" పుల్లవిరుపు ధ్వనితో అడిగాడు.

అతని ప్రశ్నకు తెల్లబోయాడు బాలాజీ. "అలాంటివి మన మడగ



మోయ్. బినీత్ మై డిగ్నిటీ." చెప్పాడు.

"అయినా మనమెందుకు అడగాలి? వాళ్ళంతట వాళ్ళు చెబితే వింటాం కానీ" అన్నాడు.

అంటే భార్య ఎంత సంపాదిస్తుందో బాలాజీకి చెప్పదనే వెటకారపు ధ్వని ఉందా మాటలో.

బాలాజీ ఆ శ్లేషను అర్థం చేసుకున్నాడేమో, "నర్సయ్యగారూ... మిమ్మల్నెక్కడో చూసినట్లుందండీ" అన్నాడు.

నర్సయ్య బాలాజీకి విసన కర్రతో విసురుతూ 'అంతా మీ భ్రమ. మాయ. విష్ణుమాయ" అన్నాడు నవ్వి.

* * *

హఠాత్తుగా ఇంటిముందు మారుతి వ్యాన్ ఆగింది. భజగోవిందం, మరో ముగ్గురు కుర్రాళ్ళు దిగారు. వారి చేతులో ఏవో వైర్లు, సామాన్లు ఉన్నాయి. వాళ్ళు నేరుగా బాలాజీ ఇంట్లోకి వెళ్ళారు.

ఆశ్చర్యంగా చూశారు వీధిలో కూర్చున్నవాళ్ళు. నర్సయ్య, బాలాజీ లేచారు. కుర్రాళ్ళ చేతుల్లోని వస్తువులను చూసిన ఆడవారి ముఖాలు మతాబుల్లా వెలిగాయి.

"ఫోను... ఫోను.. టీవీ బాలాజీ గారింట్లో ఫోను." అంటూ అందరూ బాలాజీ ఇంట్లో దూరారు.

భజగోవిందం దర్జాగా సోఫాలో కూర్చుని "త్వరగా కానివివ్వండయ్యా. ఏమైనా తేడాలొస్తే మేడమ్కు సమాధానం చెప్పుకోవాల్సింది నేను." అంటున్నాడు కుర్రాళ్ళతో.

బెడ్రూమ్లో పిల్లాడు నిద్రలేచి ఏడుస్తున్నాడు. బాలాజీని, అతని వెనకొచ్చిన గుంపును చూసీ కూడా రవ్వంత చలించలేదు భజగోవిందం.

"ఎవరు మీరు? ఏమిటీ గొడవంతా?" అరిచాడు బాలాజీ.

నమస్కారం పెడుతూ లేచాడు భజగోవిందం. "ఆహా! వాట్ ఫోర్స్! తమరు శ్రీ బాలాజీ గారే అయి ఉంటారు. మేడమ్ గారు ఆఫీసులో తమ గురించే చెబుతుంటారు" అన్నాడు వినయంగా.



"యస్... ఏమిటీ గొడవంతా?" అడిగాడు బాలాజీ గంభీరంగా.

"టెలిఫోన్ పెడుతున్నాం సార్" చెప్పాడు భజగోవిందం.

మరి కొంచెం గంభీరతను అరువు తెచ్చుకున్నాడు బాలాజీ "నో... ఆఫీస్ టెలిఫోన్ నాకు అఖ్ఖర్లేదు నా టెలిఫోన్ నాకొస్తుంది" అన్నాడు.

బాలాజీ దర్పానికి పులకించాడు భజగోవిందం.

"ఆహా! వాట్ అథారిటీ... వాట్ అథారిటీ! మాడమ్ గారు పెట్టమన్నారండీ" అన్నాడు.

నర్సయ్య కల్పించు కున్నాడు. "మేడమ్ ఎవరు ఆయన వద్దంటుంటే?" ఓ పుల్ల విరిచాడు.



"యస్... అయామ్ ది మాన్టర్ ఆఫ్ ది హౌస్" గర్వంగా చెప్పాడు బాలాజీ.

"అఫ్కోర్స్..." అని కిటికీ దగ్గర ఫోన్ వైర్ బిగిస్తున్న కుర్రాడితో "సీ... బాస్ గారి ఆర్డర్లే ఫైనల్" అని చెప్పి

బాలాజీ వైపు తిరిగి "మీరెలా చెబితే అంతే సార్.. హాల్లో పెట్టించమంటారా? బెడ్‌రూమ్‌లో పెట్టించమంటారా?" అడిగాడు భజగోవిందం.

ఎంత చెప్పినా వాళ్ళు తన మాట వినరని, తన ఆర్డర్లు చెల్లని రూపాయి కాసులేనని అవగతమైంది బాలాజీకి. తలవంచుకుని బెడ్‌రూమ్‌లోకి వెళ్తుండగా బాలాజీ భుజం తట్టి ఇంతకూ బాసంటే నువ్వా? ఆవిడా?" అన్నాడు నర్సయ్య.



"బెడ్రూమ్‌లోనే పెట్టండి" అరిచి వెళ్ళిపోయాడు బాలాజీ.

మళ్ళీ పులకించాడు భజగోవిందం. "ఆహా! వాట్ దూరదృష్టి! వాట్ దూరదృష్టి! మేడమ్‌కు శ్రమలేకుండా, మాటి మాటికీ హాల్లోకి పరిగెత్తకుండా.... ఓహో... హో.... " అన్నాడు.

పిల్లాడు 'అమ్మా' అని ఏడుస్తూ బెడ్రూమ్‌లోంచి వస్తున్నాడు. బాబుకోసం మంచినీళ్ళ గ్లాసు తీసుకుని వెళ్ళాడు బాలాజీ. భజగోవిందం మాటలతో మూడ్ పాడైపోయి మంచినీళ్ళ గ్లాసును బాబు కందించడం మర్చిపోయి తానే తాగేశాడు. దాంతో పిల్లాడు ఇంకా పెద్దగా ఏడవసాగాడు... 'ఒరే... ఒక్కనిముషం... ఏడుస్తుండు... మంచినీళ్ళు తీసుకొస్తా'' నీళ్ళకోసం వెళ్ళాడు.



"ఫోర్‌మన్... బెడ్రూమ్‌లో పెట్టండి ఫోను." చెప్పాడు భజగోవిందం.

ఆ మాటకు అమ్మలక్కలంతా ఆశాభంగం చెందారు. "భలేవారే.. బెడ్‌రూమ్‌లో పెట్టిస్తే మాకందరికీ ఇబ్బంది కాదూ?" దీర్ఘం తీసిందో సుమంగళి.

"అవునవును. హాల్లోనే పెట్టించండి" అని రాగం తీసిందో రమణి.

నర్సయ్యకు మంటెత్తింది. "నా మాట వినండి. వీధి అరుగు మీద పెడితే రాత్రిళ్ళు వాళ్ళు పడుకున్నా మనకెవరికీ ఇబ్బంది ఉండదు. అదీ నే చెప్పేది" అన్నాడు.



''హాల్లోనే పెట్టాలి'' అందరూ కోరస్‌గా అరిచారు.

వారి కేకలు విన్న బాలాజీ ''ఓకె... ఓకె... హాల్లోనే పెట్టించండి. మా ప్రజల కోసం" చెప్పాడు.

భజగోవిందం పరవశుడై పోయాడు. 'ధర్మ'బుద్ధితో బాలాజీ ప్రజలకిచ్చిన 'వరం'గా భావించాడు. 'ఆహా... వాట్ ప్రజా దృష్టి! ఫోర్మన్.. హాల్లోనే పెట్టు." ఆదేశించాడు.

హాల్లో ఫోన్ బిగించడం పూర్తయింది. దానిని చూసి అందరూ చప్పట్లు చరిచారు.

భజగోవిందం ఫోన్ పట్టుకుని "సార్.. ఫోన్ పెట్టేశాం అని చెప్పడానికి మేడమ్ గారికొక్క ఫోన్ చేస్తాననండీ" అడిగాడు బాలాజీని.



"చెయ్యద్దు" అరిచాడు బాలాజీ సోఫాలో ఠీవిగా కూర్చుని.

లౌక్యుడైన భజగోవిందానికి ఆ తీవ్ర స్వరం కూడా రాజేశ్వర్రావు కంఠంలా లలితంగా వినిపించింది. "ఆహా! వాట్ పొలైట్‌నెస్... ఆహా... హా... ఓహో... హో..." అని మెచ్చుకుని తన పటాలంతో వెళ్ళిపోయాడు.

ఫోన్‌ను ముద్దుగా ఒడిలో పెట్టుకుని "ఈ ఫోను మహా పతివ్రత. నేను పిలిస్తేనే పలుకుతుంది. చెప్పండి. ఒక్కొక్కరు చెప్పండి. ఎవరికి చేస్తారు?" అడిగాడు స్త్రీ రత్నాలను.



"కైకలూరులో ఉన్న మా మామగారిని పిలువబ్బాయ్" అన్నదో నడిమి వయసు నారి.

''మీ మామగారి నెంబరెంత?'' అడిగాడు బాలాజీ.

"మా మామగారికి నెంబరేంటి? నాకు ఒక్కడే మామగారు. ఒక్కడే మొగుడు. నేనేమైనా ద్రౌపది ననుకున్నావా?" అన్నది చిరుకోపంతో.

అందరూ నవ్వారు.

"అదికాదు వదిన గారూ. అక్కడ ఆయన ఫోన్ నెంబరు" అన్నాడు బాలాజీ.

"అక్కడ అలాంటిదేమీ లేదు." అన్నదామె.

" అక్కడ కూడా ఫోనుండాలటమ్మా" చెప్పాడు నర్సయ్య.

"ఏడ్చినట్లుంది. ఇంకెందుకు వెధవ ఫోను?" అన్నదామె మూతి ముడుచుకుని.

"ఎవరో ఒకరికి ఫోన్ చేద్దాం పట్టండీ..." సూచించాడొకాయన.

"ఎవరో ఒకరేంటండీ. ఫోన్ నెంబరున్న వాళ్ళు బోలెడంత మంది ఉన్నారు. రెల్వేస్టేషన్, బస్సు స్టేషన్..." చెబుతున్నాడు బాలాజీ.

"అదీ.. ప్రాణాల మీదికొస్తే ఆస్పత్రి, కొంప లంటుకుంటే ఫైరింజన్, ఖూనీ జరిగితే పోలీస్ స్టేషన్..." కొనసాగించాడు నర్సయ్య.



" నీ నోట్లో పంచదార పొయ్యా... ఎంత సొంపైన మాటలన్నారు...'' అని తీక్షణంగా నర్సయ్యను చూసి "అక్కయ్యగారూ... మీకు తోచిన నెంబరు చెప్పండి... చేద్దాం" అన్నాడు బాలాజీ ఒకావిడతో.

ఆఫీసులో-

భర్తకు ఫోన్ చెయ్యాలని చాలా సేపట్నుంచీ ప్రయత్నిస్తున్నది ఝాన్సీ. నెంబరు కలవడం లేదు. విసుగెత్తిపోతున్నది. "ఏమైంది? లైన్ రావడం లేదా? ఏమిటమ్మా మరీనూ? త్వరగా... ప్లీజ్..." విసుక్కుంది ఆపరేటర్‌ను.

ఆపరేటర్ స్వయంగా వచ్చింది. "మేడమ్ గంట నుంచీ ట్రై చేస్తున్నాను . లైన్ ఎంగేజ్డ్‌గా ఉంది." చెప్పింది.

''లైన్ పాడైందేమో కనుక్కున్నావా?" అడిగింది ఝాన్సీ.



ఆపరేటర్ మళ్ళీ వెళ్ళొచ్చింది. "ఎక్స్ఛేంజ్‌లో అడిగాను మేడమ్. ఎవరో అదే పనిగా ఫోన్ చేస్తున్నారట. ఎంగేజ్డ్‌గా ఉందని చెప్పారు." అన్నది.

"థాంక్యూ. నువ్వెళ్ళమ్మా" పంపించింది ఆపరేటర్ను ఝాన్సీ.

-(ఇంకావుంది)

“డాక్టర్! మా ఆవిడ ప్రసవించిందా?”
“ఇంకా లేదండి.”
“దానికి అసలే మతిమరుపు, కాస్త ప్రసవించమని అప్పుడప్పుడు గుర్తు చేస్తుండండి డాక్టర్.”





స్లైనో సుకుమారి రీఫిల్‌తో నోట్సు రాయడం చూసిన ఆఫీసర్ అడిగాడు.
“అదేంటి? రీఫిల్‌తో రాస్తున్నావ్. పెన్ను లేదా?”
“ఉంది సార్. ప్రస్తుతం మూడో నెల గర్భిణీని కదా, నిన్న చెకప్‌కు వెళితే డాక్టర్‌గారు బరువులు ఏమీ ఎత్తవద్దన్నారు, అందుకని...” అందా సుకుమారి వయ్యారాలు పోతూ.



“ఇందాక పంచదార కోసం వచ్చిన పక్కింటావిడ నా అందాన్ని పొగుడుతూ వుంటే మీకేమ్పించింది?”
“అవసరం కోసం మనుషులు ఎంతకైనా దిగజారతారనిపించింది.”

“గురువులను పూజింప వలెను. తెలిసిందా!?” అన్నారు మాస్టారు.
“పూజిస్తే ప్రసాదం పెడతారా మాస్టారూ..!?” అడిగాడో తిండిపోతు విద్యార్థి ఆశగా.





“ఈ రోజు నుంచి మీ ఇద్దరికీ విడాకులు మంజూరు చేయడమైనది” చెప్పాడు జడ్జీగారు.
“మరో భార్య వచ్చేవరకూ ఈవిడనే ఆపద్ధర్మ భార్యగా కొనసాగమని చెప్పండి జడ్జిగారూ” అడిగాడు శ్రీధర్ వినయంగా.



“స్వప్నా... నీకు అర్థమయ్యేట్టు పాఠం చెప్పడం అసాధ్యం అంటున్నాడు మీ టీచర్”
“నేనూ చెప్పేది అదే డాడీ... టీచర్‌గా ఆయన పనికిరాడు”

**ఈ జోకులను పంపినవారు : శ్రీనివాస్‌రెడ్డి, కొంగరకలాన్.**



ముగ్గురు నటులు గొప్పలు చెప్పకుంటున్నారు.
“నేను పోలీస్ వేషం వేస్తే రౌడీలు మామూళ్ళు తెచ్చి నా చేతికిచ్చారు.”
“నేను రాజకీయ నాయకుడి వేషం వేస్తే జనం రాస్తారోకో చేసి అస్సలు కదలివ్వలేదు తెల్సా?”
మూడో నటుడు మాట్లాడకుండా తలదించుకుని వున్నాడు.
“ఏరా సైలెంటయిపోయావేంటి నీ సంగతి చెప్ప” అని అడిగారు.
“నేను పులి వేషం వేస్తే తీసుకెళ్లి ‘జూ’లో పెట్టారు” అన్నాడా మూడోనటుడు నీరసంగా.



“మనిషి ముఖంలో ఏవేవి ఎన్నెన్నున్నాయో తెల్సా?”
“తెలుస్సార్. ఒక తల, రెండు కళ్ళు ఒక ముక్కు, మూడు చెవులు”
“మూడు చెవులేమిట్రా?”
“అదేసార్. మీరెప్పుడూ అంటుంటారుగా... పాఠాలు పెడచెవిని పెట్టకండర్రా అని... అంచేత ఎడమ చెవి ఒకటోది, కుడిచెవి రెండోది , పెడచెవి మూడోది.”



“నాన్నా! నాకో వాచీ కొనివ్వవూ?”
“నీకు వాచీ ఎందుకురా వెధవా?”
“నన్నెవరైనా టైమడిగితే?”
“నిన్ను టైమడిగే వెధవెవడ్రా?”
“ఒకవేళ నాకు టైమవసరమైతే?”
“వాచీ కట్టుకున్న వెధవనడిగితే సరి”

**ఈ జోకులను పంపినవారు : బి.చంద్రశేఖరయ్య, రామసముద్రం.**



"పంకజం.. ఎన్నాళ్లని యిలా నిద్రాహారాలు మాని చిక్కి శల్యమై పోతావ్... లే... లేచి భోంచెయ్...." అంటూ ఓ భర్త బ్రతిమాలుతున్నట్టు ఓ ఇంట్లోంచి రోజూ వినిపిస్తోంది.

అంత ప్రేమగల ఆ భర్త, మొండిఘటంలాంటి ఆ భార్య ఎలావుంటారో చూద్దామని ఇరుగుపొరుగు వాళ్లంతా కూడ బలుక్కుని తొంగి చూశారు.

భర్త బ్రతిమాలుతున్నాడు.

భార్య చలించని ఏకాగ్రతతో కూచొని వుంది - టీవీ సీరియల్స్ చూస్తూ!

"నేను మీకు నీడనై తోడుగా ఉంటానండి" అంది భార్య ప్రేమగా.

"అంటే... నీడ చీకట్లో తోడురాదు కనుక నాకు కష్టాలొస్తే నువ్ తప్పుకుంటావన్న మాట!" అంటూ కోప్పడ్డాడు అనుమానాల్రావ్.





"నేను తెలివి తక్కువదాన్ననీ, నన్ను మోసం చెయ్యడం సులువనీ అనుకోకు. నన్ను గానీ మోసం చేస్తే రెండు బెల్టు బాంబులు నడుంకి బిగించుకుని నిన్ను కౌగిలించుకుని చంపేస్తా"

"రెండెందుకు డాళింగ్ మనిద్దరికీ ఒక్కటి చాలుగా"

"ఒకటి నేను వస్తుండగా దార్లో పేలిపోయినా... రెండోది వుంటుందని..."




"ఏంటీ... ఒక మొగుడు ఒక పెళ్లాం కలిసుంటే ఈ లోకం ఆడిపోసుకుందా... ఎప్పుడు...?"

"వాళ్లిద్దరూ... ఎదురింటి మొగుడు పక్కింటి పెళ్లాం అయినపుడు."

చీరలపై అతి మక్కువతో ఘోర తపస్సు చేసిన చూడామణికి వరమివ్వడానికి దేవుడు ప్రత్యక్షమయ్యాడు...

"వచ్చే జన్మలోనైనా రోజుకో కొత్త చీరని కట్టుకునేలా వరమివ్వు స్వామీ" అని కోరుకుంది చూడామణి.



"తథాస్తు... షోకేసులో బొమ్మవై పుట్టు" అంటూ వరంలో ఎమెండ్‌మెంట్ అడగడానికి కూడా టైమివ్వకుండా ఠక్కున మాయమయి పోయాడా దేవుడు కొంటెగా.

"మీ ఆవిడకి టి.వి. నాలెడ్జి బాగా పెరిగిపోయినందుకు బాధగా వుందా... ఏం జరిగిందేమిటి?"

"ఇదివరలో నా షర్ట్‌పై చిన్న మరక కన్పిస్తే ఎవత్తది... ఎక్కడుంది? అని నిలదీసి... యింకా ప్రేమగా చూసుకునేది...

యిప్పుడేమో మరకల్ని తొలగించాలంటే ఏ సబ్బు వాడాలో చెబుతోంది."



**ఈ జోకును పంపినవారు : లకనం మూర్తి, కాకినాడ.**



"ఇది గోంగూర పచ్చడా? లేక గోరింటాకా?"

"గోరింటాకైయుంటే మీ నోరు ఎర్రగ పండి వుండేది కదండి."

**ఈ జోకును పంపినవారు : ఎ.ఉషారాణి, తిరుపతి.**

**ఈ సంచికలోని హ్యూమర్‌బాక్స్‌కి జోకులను పంపిన శ్రీనివాస్‌రెడ్డి (కొంగరకలాన్), బి.చంద్రశేఖరయ్య (రామసముద్రం), లకనం మూర్తి (కాకినాడ), ఎ.ఉషారాణి (తిరుపతి) గార్లకు బ్లిస్ ఆడియో వారు 'ఓరి నీ ప్రేమ బంగారం కానూ...!' ఆడియో క్యాసెట్‌ని, 'వినాయక చవితి' భక్తిగీతాల ఆడియో క్యాసెట్‌ని బహుమతిగా ప్రకటించారు. అతి త్వరలో ఈ క్యాసెట్లను పోస్ట్ ద్వారా పంపించడం జరుగుతుంది.**

BLISS







ప్రముఖ దర్శకుడు
శ్రీ సింగీతం శ్రీనివాసరావు
'హాసం' పాఠకుల కోసం
ప్రత్యేకంగా రాస్తున్న

## క రాజు కథలు 2

# పురోగమనం



తన రాజ్యపాలనలో అహర్నిశమూ కళా పోషణలో మునిగిపోయిన క రాజుగారికి ఒక రోజు ఒక ఆలోచన వచ్చింది. అసలు ప్రక్కనున్న మిగతా రాజ్యాల్లో పాలన ఎలా జరుగుతున్నదో వెళ్లిచూడాలని. వెంటనే మంత్రిని పిలిపించి తన ఉద్దేశాన్ని వివరించాడు.

"అలాగే మహారాజా! కావలసిని సిబ్బంది నంతా ఏర్పాటు చేస్తాను. మీరు ఎప్పుడు'ఊ' అంటే అపుడే బయల్దేరవచ్చు. ఎక్కడికి వెళ్లదలచుకున్నారో ముందుగానే ఆ వూరి రాజుగారికి తెలియపరిస్తే మీకు ఘనంగా స్వాగతం పలుకుతారు. అన్నీ వారే చూపిస్తారు" అన్నాడు మంత్రి.

"వారు చూపించింది మనం చూడ్డం కాదు మంత్రీ. మనము ప్రజల్లో కలిసి అక్కడ ఏం జరుగుతోందో చూడాలి".

"అంటే?"

"మనం మారు వేషాల్లో సామాన్య ప్రజల్లా వెళ్లాలి. ఇంకెవ్వరూ వద్దు. మనిద్దరమే".

మంత్రి ముఖం కాస్త ఇబ్బందిగా పెట్టేడు. పదిమంది సేవకులపని అని తెలిసేసరికి కడుపులో తిప్పినట్టయింది.

"కంగారు పడకు మంత్రీ. అక్కడ మనం రాజుమంత్రి కాదు. స్నేహితులం. ప్రయాణీకులం."

తన మనస్సులోని భయాన్ని రాజుగారు గ్రహించారని తెలియగానే మరింత యిబ్బంది పడ్డాడు మంత్రి.

"రేపు ఉదయమే బయలుదేరుదాం. ముందు మనం సందర్శించే నగరం సింగన్నపురం. అక్కడి రాజుగారు వినోదానికెక్కువ ప్రాముఖ్యత యిస్తారట. చూడాలని వుంది" అన్నారు క రాజుగారు.

మరుసటి రోజు వేకువ ఝామున క రాజు, మంత్రి ప్రయాణీకుల దుస్తులు ధరించి కావలసిన తిను బండారాలన్నీ సర్దుకొని సూర్యోదయానికి ముందే బయల్దేరారు. ఎండ జోరు ఎక్కకముందే సింగన్నపురం చేరుకున్నారు.





ముందుగా బజారుకు వెళ్ళారు. కాని అక్కడ ఉండవలసినంత జనం కనిపించలేదు. అంగళ్ళన్నీ మూసివున్నాయి.

"గురువారాలు మీ రాజ్యంలో సెలవా?" అని ఒకర్నడిగాడు మంత్రి.

"అన్ని గురువారాలూ కాదు. ఈ రోజే సెలవు."

"ఎందుకని?"

'కేళీ మైదానంలో ఒక కొత్త వినోదాన్ని ఏర్పాటు చేశారు రాజుగారు. మావూళ్లో ఏ రోజు వినోద ప్రదర్శనం వుంటే ఆ రోజు సెలవు"

క రాజు మంత్రితో సహా మైదానం వున్న వైపు కాస్త వేగంగా నడుస్తూ బయల్దేరారు. కళా ప్రియుడైన తాను వినోదం అనగానే చూపించే ఆసక్తికి తానే ఆశ్చర్యపోయాడు.

కేళీ మైదానం చుట్టూ జనంతో కిక్కిరిసిపోయింది. మధ్యనున్న విశాలమైన ఆకుపచ్చని మైదానం మీదికి ఎవ్వరూ రాకుండా భటులు కాపలా కాస్తున్నారు. పడమటి దిక్కున ఒక ఎత్తయిన వేదిక వుంది. దానిమీద వున్న సింహాసనంపై రాజుగారు అప్పటికే వచ్చి ఆశీనులై వున్నారు. మైదానం మధ్యలో అన్ని వైపులా కప్పబడిన ఒక చిన్న గుడారం వుంది. జరగబోయే వినోదాన్ని గురించి క రాజు ప్రక్కనున్న వారిని అడిగి తెలుసుకున్నాడు.

ఇది ఒక పోటీ. ఇందులో పాల్గొనేవాళ్ళు ఒక్కొక్కరుగా గుడారంలోకి వెళ్తారు. లోపలి తెరలో ఒక చిన్న రంధ్రం వుంది. అందులోంచి చూస్తే దూరంగా రెండు స్తంభాల మధ్య కట్టిన ఒక పెద్ద జేగంట కనబడుతుంది. పోటీలో పాల్గొనే వ్యక్తి అలా గంటను చూసిన తర్వాత అతని కళ్ళకు గంతలు కట్టి అతని చేతికొక కర్రనిస్తారు. అతను గుడారం బయటికి వచ్చి జేగంట యెక్కడుందో తెలుసుకొని వెళ్ళి దాన్ని కొట్టాలి. అలా కొట్టిన వానికి రాజుగారి చేతి మీదుగా రత్నాలహారం బహూకరింపబడుతుంది.

"ఇదేమిటి? ఇంత సులభమైన పనికి రత్నాలహారమా!" అనుకున్నాడు మంత్రి.

పోటీ మొదలైంది. వరుసగా ఒకరి తర్వాత ఒకరు గుడారంలోనికి వెళ్లడం, రంధ్రంలోంచి జేగంటను చూడ్డం, కళ్ళకు గంతలు కట్టడం బైటకి రావడం - ఇక్కణ్ణుంచి తమాషా మొదలౌతుంది. కఱ్ఱ పుచ్చుకొని ఒక్కొక్కరు ఎక్కడెక్కడో తిరుగుతూ గాలిలోకి కఱ్ఱను అటూ యిటూ విసురుతూ గంటను కొట్టడానికి నానాపాట్లు పడ్తున్నారు. కాని వాళ్ళు వెళ్తున్న దిక్కుకి గంటవున్న స్తంభానికి సంబంధమే లేదు. వాళ్ళ ప్రయత్నాలు విఫలమైనప్పుడల్లా జనంలోంచి నవ్వులూ, కేకలూ. అందరికంటె యెక్కువగా నవ్వుతున్నది ఆ వూరు రాజుగారే.

ఇలా మధ్యాహ్నం దాటి సాయంత్రం కావస్తున్నా ఎవ్వరూ గంటని కొట్టలేదు సరికదా దాని దరిదాపులలోకి కూడా పోలేదు. ఇదంతా గమనిస్తున్న క రాజు యిపుడు తనే పోటీలో పాల్గొనడానికి ఉద్యుక్తుడయాడు. మంత్రికి మొదట కాస్త బెంగ పట్టుకుంది. కానీ క రాజుగారు మారు వేషంలో వున్నారు కనుక ఒకవేళ పోటీలో నెగ్గకపోయినా నలుగురిలో నారాయణా అంటూ ఎవ్వరూ పట్టించుకోరని తృప్తిపడ్డాడు.

క రాజుగారు అందరిలాగే గుడారంలోకి వెళ్లారు. రంధ్రంలోంచి కాస్త తీక్షణంగా చూశాడు. ఆ తర్వాత ఆయన కళ్ళకి గంతలు కట్టేరు. గుడారం బయటికి వచ్చి ఒక్క క్షణం ఏకాగ్రతతో ఆలోచించారు. అందరూ ఏ వైపుకి వెళ్లారో దానికి సరిగ్గా వ్యతిరేకమైన దిశగా తిరిగి నేరుగా వెళ్ళి ఒకే ప్రయత్నంలో గంటను కొట్టారు. ఒక్కసారిగా జనమంతా హర్షధ్వానాలతో గంతులేశారు.

తను ఎవరైనదీ చెప్పకుండా క రాజుగారు తనలోతాను చిలిపిగా నవ్వుకుంటూ సింగన్నపురం రాజుగారి చేతుల మీదుగా రత్నాల హారాన్ని స్వీకరించారు.

రాత్రి క రాజు, మంత్రి అడవిమార్గాన తిరుగు ప్రయాణం చేస్తున్నారు. చాలాసేపు మౌనంగా వున్న మంత్రి తన సందేహాన్ని అడక్కుండా ఇక వుండలేక పొయ్యాడు.

"మహారాజా! ఈ రోజు జరిగిన పోటీ మొదట చూసినపుడు సులభ సాధ్యంగానే కనిపించింది. కాని, ఎందరెందరో ప్రయత్నించారు. విఫలులయ్యారు. మీరు మాత్రం పూర్తి ఆత్మవిశ్వాసంతో గంటని కొట్టగలిగారు. మీకిలా ఎలా సాధ్యమైంది?"

"మంత్రీ! మొదట్నుంచీ నాదొక నమ్మకం. జనం ఏనాడూ తెలివి తక్కువ వాళ్ళు కాదని. కాని అధిక శాతం పొరపాటు చేస్తూనే వుంటారు. ఎందుకని? నిలకడగా ఒక్క క్షణం ఆలోచిస్తే అలాచెయ్యరు. ఈనాటి పోటీలో అందరూ రంధ్రంలోంచి గంటను చూశారు. కాని గంట ఒక వైపుంటే వాళ్ళు వెళ్ళింది మరోవైపు.. దీని అర్థం? గంట వాళ్ళు చూసిన చోటలేదు. అంటే వాళ్ళు చూసింది ఒక మిథ్య. ఒక అద్దంలో కనిపించే ప్రతిబింబం. నేను ఆలోచించింది గంటను ఎలా కొట్టాలని కాదు. ఇంతమంది ఎందుకా పని చెయ్యలేక పొయ్యారని... ఒక్క క్షణం ఆలోచిస్తే అసలు విషయం అర్థమైంది. అందరూ ముందుకు వెళ్ళి విఫలులైతే నేను వాళ్ళకు వ్యతిరేకంగా వెనక్కి తిరిగి వెళ్ళి విజయం సాధించాను. మంత్రీ! జీవితంలో కూడా అంతే. బుద్ధిగా ముందుకు సాగిపోతేనే అన్నీ సాధించగలం అనుకోకూడదు. కొన్ని సమయాల్లో వెనక్కి తిరిగి నడిచినప్పుడే నిజమైన విజయం సాధించగలం."

క రాజుగారు చెప్పిన మాటల్ని మళ్ళీ మళ్ళీ తల్చుకుంటూ మౌనంగా ప్రయాణం సాగించాడు మంత్రి.







# లతా మంగేష్కర్



ప్రఖ్యాత నేపథ్య గాయకుడు,
బహుభాషా కోవిదుడు, కవి, రచయిత
'కళైమామణి', 'గానకళా సార్వభౌమ' బిరుదాంకితులు

డా॥ పి.బి.శ్రీనివాస్

'కోసం' పాఠకుల కోసం
తన అభిమాన గాయని జీవిత చరిత్రను
అక్షరబద్ధం చేస్తున్న సీరియల్ ఇది

ఇన్ని దశాబ్దాల చిత్ర సంగీత చిత్ర చరిత్రలో, బాలీవుడ్‌లో రాజ్యమేలిన ఒక గొప్ప గాయనీ గాయకుల జంట అంటే ఎక్కువ మందికి లతా రఫీల కాంబినేషన్ అనే స్ఫురిస్తుంది. ఇద్దరూ వేంటి ప్రతిభావంతులే. ఇద్దరి వృత్తి పయనంలోనూ కొన్ని సారూప్యాలు వున్నాయి. ఇద్దరికీ మధ్య కొన్ని అభిప్రాయభేదాలు పొడసూపినప్పుడు, ఉదార హృదయాలతో సరిపుచ్చుకుని, చాలా కాలం కలిసి పాడుతూ వందల డ్యూయెట్లు హిట్ చేశారు. కొన్ని సమయాలలో పోటీపడిన కొన్ని ఆడ, మగ గొంతులు వాటంతట అవే వేఱుదారిపట్టడం వలన, లతకీ రఫీకీ కూడా అనుకోని విధంగా ప్రగతి మార్గంలో అవరోధాలు తొలగిపోయాయి. దానికి కారణం పూర్వ జన్మపుణ్య ఫలమైన విశిష్టాదృష్టం. ఇద్దరూ అన్ని రకాల పాటలూ పాడి తమ సర్వతోముఖప్రజ్ఞని నిరూపించుకోగలిగిన వారే.

లత గొంతు ముందుగా కొంత యిబ్బంది పెట్టినా, కోలుకునే పర్యంతం నెలలు వేచివున్న హేమంత్ సంగీత దర్శకులుగా కూడా తమ అద్భుత సామర్థ్యాన్ని నిరూపించారు అనడం సబబే. దానికి 'నాగిన్' చిత్ర సంగీత దిగ్విజయం తార్కాణంగా ఎన్నుకోవచ్చు. ఆ చిత్రంలో హిట్టుకాని మట్టే (ట్యూన్) లేదు. "మన్‌డోలే మేరా తన్ డోలే" అనే పాటలోని స్వింగు శ్రోతల్ని ప్రేక్షకులనీ ఇట్టే ఆకర్షించి, అందరి మనస్సులనీ ఉయ్యాలలూపింది. ఆ పాట విని 'సబ్‌లోగోఁ కే దిల్ డోలే" అంటే అది అక్షర సత్యం. ఆ పాట ఒక ఆణిముత్యం. నాగిన్ చిత్రానికి పేరుకి అనువుగా 'బీన్' అనే ప్రత్యేక సంగీత వాద్యాన్ని పలికింపజేశారు హేమంత్. ఆ వాద్యాన్ని అనాయసంగా వాయించి, ఆ బీన్ బిట్టుకి ప్రత్యేక ఆదరణా ప్రజాభిమానం గడించిపెట్టిన వాద్యకారుడు (తర్వాత సంగీత దర్శకుడు కూడా) కల్యాణ్‌జీ. పాట మాత్రమే కాక ఆ బిట్టు కూడా మట్టుతో పాటే పాడుకునేవారు రసజ్ఞశ్రోతలందరూ. ఆ పిమ్మట ఆ బీన్ వాద్యానికి చాలా కాలందాకా గొప్ప డిమాండు లభించడంలో ఆశ్చర్యమే లేదు. నాగిన్‌లోని పాటలన్నీ అందర్నీ మెప్పించాయి.

అయినా హేమంత్‌గారు లతా చే పాడించినా ఫేవరేట్ డ్యూయెట్ "దేఖో వో చాంద్ ఛుప్‌కర్ కర్‌తా హై క్యా ఇశారా" అనే మధుర గీతం. "శర్త్" చిత్రానికై ఆయన స్వరపరచిన తీరు ప్రత్యేకం. తెలియనీయకుండా గ్రహభేదం (కీ ఛేంజ్) చేసి

## లతా గానలహరి



| | |
|---|---|
| చిత్రం | : సంగమ్ |
| గానం | : లతా |
| సంగీతం | : శంకర్ - జైకిషన్ |
| అభినయం | : వైజయంతీమాల, రాజ్‌కపూర్ |

మై కా కరూ రామ్ ముఝే బుడ్డా మిల్‌గయా
సబ్‌జో గయే బాగ్ మేరే బుడ్డా భీ చలా గయా2
సబ్‌తో లాయే ఫూల్, బుడ్డా గోబీ లేకే ఆ గయా2
మై హోగయీ బద్‌నామ్ ముఝే బుడ్డా మిల్‌గయా.. మై

మై గుడియా హసీన్ మేరీ మోర్‌నీసీ చాల్ హై2
సర్ మే సఫేద్2 ఉస్‌కీ దాదాజీ కా బాల్ హై 2
క్యా హోగా అన్‌జామ్ ముఝే బుడ్డా మిల్‌గయా..మై

పరియోంకే దేశ్ ముఝే బుడ్డా లేకే ఆగయా
మైనే జో ఉఠాయా ఘూంఘట్ బుడ్డా గుస్సా ఖాగయా
బిగ్‌డే సారే కామ్ ముఝే బుడ్డా మిల్‌గయా...మై

ఈ పాట పాడడానికి లతా ముందులో ఇచ్ఛగించలేదని రాజ్‌కపూర్‌ను కాదనలేక పాడిందనీ అంటారు.

# మెలడీ క్వీన్‌కు రాయల్టీ

మహల్ సినిమాలోని 'ఆయేగా ఆనేవాలా' పాట రికార్డుపై గాయని పేరు బదులు ఆ సినిమాలో పాత్ర పేరు వేశారంటే తెలుస్తుంది - ఆ రోజుల్లో గాయనీగాయకులకు ఏ మాత్రం ప్రాముఖ్యత నిచ్చేవారు కారని. అదే విధంగా రాయల్టీ విషయంలో కూడా! పాట రాసేవాళ్లు, సంగీతం సమకూర్చేవాళ్లూ మాత్రమే సృజనాత్మక కళాకారులనీ పాడేవాళ్లు ఒట్టి 'ఇంటర్‌ప్రెటర్', భావవ్యక్తీకరణకు తోడ్పడేవాళ్లు అనే అభిప్రాయం ఉండేది. అందువల్ల ఓ సారి డబ్బిచ్చి పంపేశాక వాళ్లకు రాయల్టీ ఇవ్వక్కరలేదని రాజ్‌కపూర్‌తో సహా చాలామంది నిర్మాతల అభిప్రాయం.



అయితే లతా అభిప్రాయం వేరు. తాము పాడకపోతే ఆ పాటలకు అంత అందం వచ్చేది కాదనీ అందువల్ల రాయల్టీలో భాగం ఉండాలనీ వాదించేది. ముఖ్యంగా వేర్వేరు సినిమాల పాటలను మ్యూజిక్ కంపెనీలు రకరకాల లేబుల్స్‌తో రిలీజ్ చేసినపుడు సినిమాపరంగా అమ్ముడుపోవడం లేదు కదాని ఆమె వాదన. పద్మభూషణ్ లతాకు వచ్చిన 25 సంవత్సరాల తర్వాత నౌషాద్‌కు వచ్చిందని గుర్తుంచుకుంటే లతా మాట నిజమేననిపిస్తుంది.

చివరికి లతా పాయింటు నెగ్గింది. గాయనీ గాయకులకు రెండున్నర శాతం రాయల్టీ చెల్లించడానికి అందరూ ఒప్పుకున్నారుఎప్పుడయితే లతా గాయకులకు రాయల్టీ గురించి గొడవ మొదలుపెట్టిందో అప్పుడు ఇబ్బందులు మొదలయ్యాయి. అప్పటిదాకా హెచ్.ఎమ్.వి.వారు ఆడియో సేల్స్‌పై సినిమా నిర్మాతలకు 10 శాతం రాయల్టీ ఇచ్చేవారు. దాంట్లో నిర్మాతలు 5 శాతం తాముంచుకుని 5 శాతం సంగీతదర్శకులకు ఇచ్చేవారు. గాయనీగాయకులకు రెండున్నర శాతం రాయల్టీ ఇవ్వాలని లతా పట్టుబట్టగానే నిర్మాతలు సంగీతదర్శకులకిచ్చే దాంట్లోంచి ఆ మేరకు తగ్గించి వీరికివ్వసాగారు. అదేమంటే 'అవును, మీరే కదా మీ సంగీతాన్ని ప్రజలకందించాలంటే లతా ఉండాలని పట్టుబడుతున్నది, అందుకని మీ దాంట్లోంచే అది తగ్గించుకోండి' అన్నారు. నౌషాద్, శంకర్-జైకిషన్ వంటి కంపోజర్స్‌కు ఇది నచ్చకపోయినా ఏమీ అనలేకపోయారు.

కానీ లతా అంతటితో ఆగలేదు. గాయకుల వాటా ఇంకా పెరగాలని పోరాడసాగింది. కొన్నాళ్లు పోయేసరికి దాన్ని 5 శాతానికి పెంచాలని లతా డిమాండు చేసింది. నిర్మాతలు మ్యూజిక్ డైరక్టర్లకు ఇవ్వగా మిగిలిన 5 శాతం తమకు ఇవ్వాలంది.

రఫీని తనతో కలుపుకుపోదామని ప్రయత్నించింది. ఎందుకంటే అప్పటికి, అంటే 1965 నాటికి లతా, రఫీయే టాప్ సింగర్స్. తన ప్రతిపాదనకు రఫీ ఒప్పుకుంటే నిర్మాతలు చచ్చినట్టు దిగివస్తారని లతా ఆలోచన.

కానీ రఫీకి రాయల్టీ పెంచడం రుచించలేదు. ఇది చాల్లే అన్నాడు. అతడు అల్పసంతోషి అనుకోవాలి. లతాకు పాటకు 500 రూపాయలు ఇచ్చేరోజుల్లో రఫీకు 100 మాత్రమే ఇచ్చినా ఊరుకున్నాడు. 1965 నాటికి లతాతో సమానంగా పాటకు 5 వేలు పుచ్చుకునే స్థాయికి వచ్చాం కదాన్న తృప్తి అతనిది. రఫీ అన్నదేమిటంటే మనకూ నిర్మాతకూ అగ్రిమెంటు ఏముంది? మ్యూజిక్ డైరక్టరు మనని పిలుస్తున్నాడు, నిర్మాత చేత అనుకున్న డబ్బు ఇప్పిస్తున్నాడు. ఇంకే కావాలి?

దాంతో లతాకు కోపం వచ్చి రఫీతో పాడడం మానేసింది. ఆ టైములో రఫీతో సుమన్ కల్యాణ్‌పురి పాడేది. నిర్మాతలకు లాభం చేకూరింది. ఎందుకంటే సుమన్ కిచ్చేది వెయ్యిరూపాయలే! రఫీ, లతా డ్యూయెట్‌కు (ఒకలైను పాడినా సరే డ్యూయట్ కిందే లెక్క) 10 వేలయ్యేది. సుమన్,రఫీ అయితే 6 వేలు చాలు. చివరకు మూడేళ్ల తర్వాత లతా, రఫీలకు సర్దిచెప్పి జ్యూయల్‌థీఫ్‌లో 'దిల్ పుకారే' పాట పాడించాడు ఎస్.డి.బర్మన్!

**- ఎమ్మెస్ స్వాతి**

రచనకి మంచి రసపుష్టిని కలగజేశారు.

లతా, హేమంత్‌ల చేత చాలాకాలం క్రితమే ఒక మధురాతిమధుర గీతం పాడించిన ఘనత విశ్వనాథన్‌రామమూర్తుల జంటకి దక్కింది. "నయా ఆద్‌మీ" అనే చిత్రంలో ఆ పాట "లౌట్‌గయా గమ్ కా జమానా". "మిస్‌మేరీ" చిత్రంలో లతా, రఫీల డ్యూయెట్టు "ఓ రాత్‌కే ముసాఫిర్" మట్టుకి హేమంత్ కుమార్‌దే క్రెడిట్టు. మాటిమాటికీ పాడుకోవాలనిపించే మట్లు కట్టడంలో హేమంత్ నిష్ణాతులనే చెప్పుకోవాలి. తను మంచి గాయకుడు కావడం కూడా ఒక ముఖ్య కారణం అనవచ్చు.

అలాగే చాలామంది సంగీత దర్శకుల సంగీత రచనలు బహుళ ప్రజాదరణ పొందడానికి లతా గానం ముఖ్యకారణం. ఆమె 'వాయిస్‌రేంజ్'కి లిమిటేషనే లేదు. పలకని సంగీతమే లేదు. అందువలన సంగీత రచయితలకి కూడా ఏ లిమిటేషనూ లేదు. లతా దివ్య గళస్వరం నుండి ఎట్టి క్లిష్టమైనవైనా రిక్వైర్డ్ ఎఫెక్టులన్నీ ఏ సంగీత దర్శకుడైనా ఇట్టే రాబట్టుకోవచ్చు అనేది ఆమె ప్రథమ ప్రోత్సాహకులలో ఒక ముఖ్య వ్యక్తి అయిన అనిల్‌బిశ్వాస్ గారి విశ్వాసం!! ఆ విశ్వాసాన్ని ఎన్నడూ వమ్ము చేయని మహా గాయనీమణి లతా మంగేష్కర్. అధ్యయనం చేయదగినది ఆమె గాన విధానం. ఆ విధానానికి గీత భావం అన్నిటికన్నా మిన్నగా ప్రధానం. ఆమె గానం చేసిన ప్రతీ గీతం ఔచిత్యానికి నిరూపమానోపమానం.

రఫీ విషయంలో కూడా కొన్ని సంఘటనలు ఆయనకి లాభకరంగా సంభవించాయి. తలత్, ముఖేష్, సి.హెచ్.ఆత్మా వంటి గాయకులు నటనలో కూడా ఆసక్తి చూపడం వల్ల వాళ్ళ నేపథ్య గానం చాలా అధికంగానే కుంటువడింది. ఇహపోతే హేమంత్ కుమార్ కూడా సంగీత దర్శకత్వం పట్ల అధిక శ్రద్ధ వహించి, సంగీత పరంగా సిల్వర్ జూబ్లీ చిత్రాలు అందించేసరికి, గాయకుడుగా ఆయన డిమాండు కూడా తగ్గింది. లతా, రఫీ యిద్దరూ కూడా నటన పట్లా, సంగీత దర్శకత్వం పట్లా శ్రద్ధ వహించలేదు. నేపథ్య గానాన్నే ముఖ్యధ్యేయంగా ఎన్నుకొన్నారు.

దిగ్విజయం సాధించిన 'బైజూబావ్‌రా' లతా, రఫీలిద్దరికీ సరికొత్త ప్రాధాన్యం కలిగింప జేసింది.

# గిన్నెస్ రికార్డు - లతా - రఫీ వివాదం



రాయల్టీ కారణంగా రఫీతో గొడవలు నడుస్తున్న కాలంలోనే 1967లో లతా తన సిల్వర్ జూబిలీ ఫంక్షన్ ఏర్పాటు చేయించింది. రఫీ బిత్తరపోయాడు. తను ఫిలింరంగానికి వచ్చింది 1944లో. తను వచ్చే 25 సంవత్సరాలు కాలేదు కానీ తనకంటే నాలుగేళ్లు తర్వాత వచ్చిన లతాకు సిల్వర్‌జూబిలీ ఏమిటి? అడుగుదామంటే ఆ ఫంక్షన్ ఏర్పాటు చేస్తున్నది లతా కాదు, రాష్ట్రప్రభుత్వం. యాగీ చేస్తే అసూయ కొద్దీ చేస్తున్నాడంటారు. ఇంకేం మాట్లాడలేక ఊరుకున్నాడు.

కానీ గిన్నెస్ రికార్డు విషయంలో మాత్రం ఊరుకోలేకపోయాడు. దానికి బీజం పడింది ఫిలింఫేర్‌లో. 'ఫిలింఫేర్ లతా స్పెషల్, 1971లో ఓ వ్యాసం రాస్తూ రాజూభరతన్ 'లతా 1600 సినిమాలలో 16 వేల పాటలు పాడి మెప్పించింది' అని రాసిన వాక్యాన్ని పట్టుకుని గిన్నెస్ బుక్‌లో నోట్ చేయమని ఎవరో (ఎవరో తెలియదు) అడగడం జరిగింది. దాని ప్రకారం 1977 గిన్నెస్ బుక్‌లో ఓ ఎంట్రీ చోటు చేసుకుంది - "లతా మంగేష్కర్ అనే గాయని 1948, 1974ల మధ్య 20 భారతీయభాషల్లో, 1800 సినిమాలలో 25,000 కు తక్కువ కాకుండా పాటలు పాడిందంటారు. (reportedly recorded not less than 25,000). వీటిల్లో సోలోలు,డ్యూయెట్లు ఉన్నాయి. ఆమె తరచుగా రోజుకి 5 పాటలు చొప్పున రికార్డు చేసేది."

ఇది చూడగానే రఫీకి ఒళ్లు మండింది. 1977 జూన్ 11న ఒక ఉత్తరం రాశాడు - 'ఒక భారతీయగాయని గురించి మీరు రాసిన అంకె కరక్టుకాక పోవచ్చని నాకనిపిస్తోంది. 1944 కెరియర్ ప్రారంభించిన నేనే 23 వేలకు మించి పాటలు పాడనప్పుడు నాకంటె జూనియర్ నాకంటె ఎక్కువ ఎలా పాడగలరు? పైగా రోజుకు 5 పాటలు రికార్డు చేయడం అసాధ్యం! "అని.

దానికి సమాధానంగా గిన్నెస్ అధికారి హోవర్డ్ గర్రాడ్ 'లతా మంగేష్కర్ ఆ విధంగా క్లెయిమ్ చేశారని మేమనటం లేదు. 'రిపోర్టెడ్‌లీ' అని రాశాం కదా. అయినా మేము వచ్చే ఏడాది ప్రతి ముద్రించేటప్పుడు విషయాన్ని లోతుగా పరిశీలించి ఒక నిర్ణయం తీసుకుంటాం." అని సమాధానం రాశారు.

ఆ ఉత్తరం అందుకున్న రఫీ 1977 జూలై 30న 'మీరు లోతుగా పరిశీలించకుండా ఇటువంటి సమాచారం ప్రచురించడం మీ విశ్వసనీయతను దెబ్బ తీస్తుంది" అంటూ రాసినా తరువాతి ముద్రణలలో కూడా గిన్నెస్‌వారు సవరించుకోలేదు. చూసి, చూసి వేసారి 1979 నవంబరు 20 న రఫీ ఇంకో లేఖాస్త్రాన్ని సంధించాడు -



"నాకు లతా మంగేష్కర్ అంటే ఎంతో గౌరవం. ఆమెతో కలిసి పాడడం నాకు గర్వకారణం కూడా. అయినా మీరు తప్పుడు సమాచారం ఇవ్వడం, నా క్లెయిమ్‌ను పట్టించుకోకపోవడం బాధాకరంగా ఉంది. తన అనారోగ్యం కారణంగా లతా చాలా రోజులు రోజుకి ఒక పాట పాడలేకపోయేది. ఏడాదికి 300 పాటలు, పాడిందనుకున్నా మొత్తం 9,300 అంటే ఈ 31 సంవత్సరాలలో అయితే రోజుకి రెండు పాటలు. నా విషయంలో ఒక్కోసారి 5 పాటలు పాడిన పాటలు పాడేవాణ్ని. పైగా సందర్భాలను ఋజువు చేయగలను. నిజానిజాలు ఆమెకంటె నాలుగేళ్లు సీనియర్ని. తేలేవరకు మీరు ఆ ఎంట్రీను పుస్తకంలోనుండి తొలగించగోరుతున్నాను."

కానీ గిన్నెస్‌వారు ఏ విచారణా జరపలేదు. రఫీ మరణించిన నాలుగేళ్లకు 1984లో లతా ఎంట్రీతో బాటు రఫీదికూడా చేర్చారు - '1944, 1980ల మధ్య 11 భారతీయభాషలలో 28,000 పాటలు పాడినట్లు రఫీ క్లెయిమ్ చేశారు." అని. లతా విషయంలో క్లెయిమ్ అని వాడలేదు. ఎందుకంటే లతా ఆ విషయం పట్టనట్టే ఉంది. అడిగితే 'ఆ లెక్కలూ డొక్కలూ చూడడం నా అలవాటు కాదు." అని సమాధానం చెప్పింది. రఫీ ఉత్తరాలు నౌషాద్ ఇంట్లోనే తయారయినట్టు వార్తలు రావడంతో నౌషాద్ పట్ల కినుక వహించింది.

అయితే ఇంతకీ ఎవరెన్ని పాటలు పాడినట్లు? హిందీ సినిమా గీత్‌కోశ్‌లు తయారయ్యాక గుల్బర్గాకు చెందిన రాజమన్నార్ ఎవరెన్ని పాటలు పాడారో జాగ్రత్తగా నోట్ చేసి ప్రచురించాడు. (వివరాలు బాక్స్‌లో) దాంతో అందరూ ముక్కున వేలేసుకున్నారు. ఫక్కున నవ్వారు. మొదట వ్యాసం రాసిన రాజూ భరతనే నాలిక కరుచుకుంటూ 1985 జూలై 1 'ఫిలింఫేర్' సంచికలో 'ది గ్రేట్ గిన్నెస్ మిత్' అనే పేరు వ్యాసం రాశాడు. కానీ లతా 30,000 పాటలు పాడిందన్న ప్రచారం చాలాకాలం కొనసాగింది. 'మా వూరి మిరియాలు తాటకాయలంత' అని చెప్పుకోవడం మన భారతీయులకు అలవాటు. చచ్చినవాళ్ల కళ్లే కాదు, బతికున్నవాళ్ల కళ్లు కూడా చారెడు చేసేస్తాం, మనం వాళ్ల వీరాభిమానులమయితే.

కథకు ముగింపేమిటంటే నిజం ధాటికి మొహం నల్లబడ్డ గిన్నెస్ బుక్ వారు 1991 ఎడిషన్ నుండి లతా, రఫీల ఎంట్రీని తొలగించడం!

- ఎమ్బీయస్ ప్రసాద్

సక్సెస్‌ఫుల్ కాంబినేషన్‌గా ఇద్దరూ స్థిరపడ్డారు. లతా, రఫీల కంఠాలు చిత్ర సీమలోని నాయికా నాయకులందరికీ తప్పనిసరి అయి వెలుగొందాయి. "ఆరాధన"లో కిషోర్ కుమార్ ఆగమనం వఱకూ ఈ జంట విజయాల పంటలు విరివిగా పండించింది. తరవాతి యుగంలో కిషోర్ కుమార్ గాయకుడిగా విజృంభించారు.

రాజేష్‌ఖన్నా, అమితాబ్‌బచ్చన్ లిద్దరూ క్రమంగా నూపర్‌స్టార్లూ, మెగాస్టార్లూ అనుపించుకున్న ఘట్టంలో కిషోర్‌కుమార్‌ది పై చెయ్యి అయ్యింది. రఫీలాంటి మహాగాయకుడు కూడా కాల ప్రవాహానికి తట్టుకోలేక వెనుకంజ వేయక తప్పలేదు. రఫీతో ఒక సందర్భంలో ఈ

## ఎవరెన్ని పాటలు పాడారు?

హర్మేందర్ సింగ్ హమ్‌రాజ్ తయారుచేసిన గీత్‌కోశ్‌ల ఆధారంగా 'లిజనర్స్ బులెటిన్', మే 1985 కోసం రాజమన్నార్ కూర్చిన పట్టిక

| దశకం | మొత్తం హిందీపాటలు | రఫీ | లతా | ఆశా | గీతా | ముకేశ్ |
|---|---|---|---|---|---|---|
| 1941-50 | 10,815 | 270 | 350 | 49 | 340 | 148 |
| 1951-60 | 8,853 | 1236 | 1766 | 1892 | 755 | 167 |
| మొత్తం | 19668 | 1506 | 2116 | 1941 | 1095 | 315 |

అప్పట్లో సినిమాకు 10 పాటలుండేవి కానీ తరువాత దశాబ్దాలలో సినిమాకు సగటున 5 పాటలుంటున్నాయి. అందువల్ల 1941-80 కాలంలో 35,000కు మించి హిందీపాటలుండకపోవచ్చు. 1960-63 ప్రాంతాలలో సైనస్ ట్రబుల్ వల్ల లతా పాటలు తగ్గించుకుంది. 1971 తర్వాత కిశోర్ కుమార్ ధాటికి రఫీకి పాటలు తగ్గాయి.

హర్మేందర్ ప్రకారం 1931 నుండి 1991 వరకు వచ్చిన సుమారు 7000 హిందీ సినిమాలలో మొత్తం పాటలు ఇంచుమించుగా 50,000 , ఆశా 7500 పాడగా లతా 5250 పాడారు.

విశ్వాస్ నెరూర్కర్ రాసిన 'గాంధార్' పుస్తకం ప్రకారం 1942 నుండి 1989 వరకు 1825 సినిమాలలో లతా పాడిన మొత్తం పాటలు 5067!

ఇవి హిందీపాటల వివరాలు మాత్రమే! ఇతరభాషలలో పాడినవన్నీ కలిపినా అవి ఖచ్చితంగా 25 వేలూ, 30 వేలూ ఉండవని చిన్నపిల్లవాడైనా చెప్పగలడు!

వింత మార్పు గురించి ప్రస్తావించినప్పుడు ఆయన ఏ మాత్రం చలించకుండా చిఱునవ్వు నవ్వుతూ "బాదల్ ఆతే జాతే హైఁ, మగర్ నూరజ్ హమేశా రహ్‌తా హై" అని భావగర్భితమైన బదులు అందించారు. అలాగే కొన్ని సంవత్సరాలు మఱుగున పడవలసివచ్చినా, మళ్లీ విజృంభించి తగినన్ని హిట్ సాంగ్స్ అందించిన పిదపనే భౌతికంగా అంతర్ధానమైనారు.

లతా, రఫీల కాంబినేషన్ సెన్సేషన్ సృష్టించిన తరుణంలోనే వారిద్దరి మధ్యా కొన్నాళ్ళు మౌన యుద్ధం సాగింది. కారణం "రాయల్టీ" ప్రశ్న. ఒక రికార్డింగ్ సందర్భాన రఫీ లతతో క్రితం దినం జరిగిన వేదనాపూర్ణ సంఘటనని, ఎంతో విచారపడుతూ వివరించారట. కొన్ని యేళ్ళు మహరాజులా వెలిగిన తోటి గాయకుడు "ఖాన్ మస్తానా" అనే ఆయన ఆర్థికంగా ఇబ్బంది పడుతూవుండగా, ఆయనకి తను కొంత ధనసహాయం చేయవలసి వచ్చిందనీ అది చాలా శోచనీయమైన విషయమనీ వ్యాఖ్యానించడం లత మనసులో ఒక కొత్త ఆలోచనని రేకెత్తించిందట. గాయనీ గాయకులకి అటువంటి పరిస్థితులు ముందు రాకుండా వుండగలందులకు వాళ్ళకి "రాయల్టీ" తగినంత పెర్సెంటేజ్‌లో ఇప్పించే ఏర్పాటు చేయడమే ఆమెకు కలిగిన ముఖ్యోద్దేశం.

తన్నిమిత్తం లత నిర్మాతలతోనూ. రికార్డింగు సంస్థలతోనూ కూడా పోరాటం సాగించారు. ఆమెకు చాలామంది సహకరించినా, మహమ్మద్ రఫీ మాత్రం 'పాట రికార్డింగు అవ్వగానే తమలాంటి గాయనీగాయకులకి అడిగిన పెద్ద మొత్తాన్ని సమర్పించే నిర్మాతలని మఱింత ఇబ్బంది పెట్టడం సమంజసం కాదని' అభిప్రాయ పడడం వలన, లతా ప్రతిపాదన ముందంజ వేయడానికి వీలు కాలేదు.

నాయికలకి లత గొంతు ఎంత అనివార్యమో, ఆరోజుల్లో రఫీ గొంతు నాయకులకి కూడా అంత అనివార్యమై, ప్రాబల్యం గడించివుండడం వలన వారిద్దరి భిన్నాభిప్రాయంవలన ఆ ఉద్యమం విరమించవలసి వచ్చింది. అయినా ఇద్దరూ ఉదార మనస్కులై రాజీపడడం వలన, నిర్మాతలకీ రికార్డింగు సంస్థలకీ చాలా పెద్ద ఇబ్బంది తప్పింది. అలా కళాకారులందరూ ఔదార్యంతో సహకరిస్తే 'చిత్రసీమ' గొప్ప ప్రగతిని సాధించగలదని అందరూ అభిప్రాయ పడ్డారు.

రఫీనీ, తలత్‌నీ "సాహబ్" అనే లత మదన్‌మోహన్‌నీ, ముఖేష్‌నీ "భైయా" అని సంబోధించేవారు. సినీమా కళాకారులలోనే కాకుండా, శాస్త్రీయ సంగీత విద్వాంసుడైన ఉస్తాద్ అమీర్‌ఖాన్‌కి కూడా ఎవరో లత తనతో పాడడానికి ఒప్పుకోలేదనే దురభిప్రాయం



కలగజేసినా అది వీలు పడలేదు. నిజానికి లతకి ఆయన పట్ల గౌరవభావం!

ఇలా వుంటాయి కొన్ని సన్నివేశాలు. ఎస్.డి.బర్మన్‌గారి విషయంలో కూడా ఇదే జరిగింది. కాని అందరూ ఒకలా వుండరుగా! తలత్ మెహమూద్‌లాగే ఆయన కూడా లతాని నేరుగా అడిగేసి నిజాన్ని తెలుసుకుని తమ సందేహాన్ని నివృత్తి చేసుకున్నారు.

తలత్‌కి ఎవరో చెప్పారుట. ఆయన ముసల్మాన్ అవడం వలన లతకి ఆయనతో పాడడం ఇష్టం లేదని. ఇది నిజమా అని లతని ఆయన నిర్మొహమాటంగా అడిగేసరికి, లత ఆశ్చర్యపోయి, ఆయన ప్రశ్నకి ప్రశ్నాపూర్వకంగానే ప్రత్యుత్తరమిచ్చిందట. "అదే కారణమైతే, నేను నౌషాద్‌తోనూ, రఫీ గారితోనూ, నిరభ్యంతరంగా ముసల్మానులెందరితోనో సహకరించడం మీరు ఎఱుగనిదా! ఈ మాటను మీరెలాగ నమ్మగలిగారు?" అని ప్రశ్నించేనరికి తలత్ నిరుత్తరులై నిలిచారుట.

తలత్‌లాగే ఎస్.డి.బర్మన్ కూడా ఏమాత్రం వెనుదీయకుండా లతని నిర్మొహమాటంగా అడిగి తెలుసుకోవడం వలన వారిద్దరికీ వైమనస్యం కొనసాగలేదు. లతా, బర్మన్‌లా సామరస్యం వలన ఆ పిమ్మట కూడా అనేకమైన హిట్ సాంగ్స్ ప్రజలకి లభ్యమయ్యాయి. దీనివలన అందరూ తెలుసుకోదగిన నిజమేమిటంటే - కళాకారులు, తమ వైయక్తిక భావభేదాలేవైనా తలయెత్తినా, వాటిని పాటించకుండా సౌహార్ద్రంతో వృత్తి ధర్మాన్ని నెఱవేరుస్తూ సహకరిస్తూ కృషి చేస్తే తప్పకుండా నిస్సందేహంగా సత్ఫలితాలే సదా లభిస్తాయి !!

కొన్ని కాంబినేషన్లలో రూపొందే ఉత్తమోత్తమ గీతాలు ఇతర కాంబినేషన్లలో రూపొందే ఉత్తమోత్తమ గీతాలు ఇతర కాంబినేషన్లలో లభించకపోవడానికి ఎంతైనా ఆస్కారం వుంది.

**(ఇంకావుంది)**




నలభై ఏళ్ళుగా సినీ పరిశ్రమ
తీరుతెన్నులపై అధ్యయనం
చేసిన రచయిత, జర్నలిస్టు, నటుడు

# రావి కొండలరావు

రాసిన వ్యాసమిది





(ఆ తెలుగు మాస్టారే. ఆ చాదస్తమే. ఆ ధోరణే. అప్పట్లోనే ఆయన ఒక షూటింగ్‌కి వెళ్లి అక్కడ రేలంగినీ, రమణారెడ్డినీ, రాజబాబునీ కలిశారు. అదొక హాస్య సన్నివేశం. పాటా అదీ తీస్తున్నారు. అదయిన తర్వాత, చిన్న విరామం ఇచ్చారు. అప్పుడు వాళ్ల ముగ్గుర్నీ కలిసి, మాస్టారు సంభాషించిన వైనం)

"మాస్టారూ! వీరు ముగ్గురూ మంచి హాస్యనటులు. రేలంగిగారు, రమణారెడ్డి గారు, రాజబాబుగారూ. మీరు ఈ చిత్రాలు చూడరు గాని, చూసివుంటే వీళ్లు బాగా తెలుస్తారు" అని చెప్పి- "మా మాస్టారు. సినిమాల గురించి తెలియదు. అంచేత ఏమీ అనుకోకండి. మిమ్మల్ని కలవాలనుకున్నారు" అని మాస్టార్ని వాళ్లకి పరిచయం చేశాడు శిష్యుడు.

"నాకు తెలియకేం - రేలంగి. అవును, గోడలమీద పెద్ద పెద్ద కాయితాల్లో కనిపిస్తూ వుంటుంది మీ పేరు. రేలంగి అంటే మీ వూరా?" అని అడిగారు మాస్టారు. రేలంగి మొహం సీరియస్‌గా వుంది. బింకంగా కూచుని, "కాదు. మా యింటిపేరు" అన్నారు.

"ఓహో! ఇంటిపేరునే నామధేయంగా ధరించితిరన్నమాట. మరి అసలు పేరు ?"

"వెంకట్రామయ్య"

'రేలంగి వెంకట్రామయ్య" అనుకున్నారు మాస్టారు పెదవులతో.

"అవునూ! మీ సినిమావారు ఉన్నపేరు తీసివేసి, ఇంటి పేరునే పేరులా వాడతారెందుకు? నాకు తెలీకడిగాను-" అని అడిగారు, కళ్ళజోళ్లోంచి చూస్తూ.

"కొంతమంది అలా పాప్యులర్ అవుతారు. అందరికీ వుండదు. ఈయన రమణారెడ్డి, వాడు రాజబాబు. వాళ్ల అసలు పేర్లే అవి"

"వాళ్లకి ఇంటి పేర్లు లేవా?"

"ఎందుకు లేవు మాస్టారూ. ఉన్నా, వాళ్ళు వాళ్ల పేర్లతోనే పాప్యులర్ అయ్యారు. అందర్నీ అనకండి." అని రేలంగి స్వరం తగ్గించి సర్దుబాటు చేశారు.

"తమరు నటించిన పౌరాణిక సినిమాలు కొన్ని చూశాను. ఏదీ? వీరు నటించిన చిత్రములు - రెండు పేర్లు చెప్పు" అని మాస్టారు, శిష్యుణ్ణి అడిగారు. శిష్యుడు "మాయాబజార్, నర్తనశాల" అన్నాడు.

"ఆఁ! నర్తనశాల! విరాటపర్వగాథ. ఆయనెవరూ, అక్కినేని నాగేశ్వర్రావా - కాదు, ఎన్‌టీరామారావు - ఆఁ!... ఆయన అందులో బృహన్నల పాత్రధారి. అవును. మంచి చిత్రము, మంచినటనము. అందులో తమరు...." అని ఆగారు.

"ఉత్తరకుమారుడు"

"సైలెన్స్! తమరు ఉత్తర కుమారుడెలా వేశారు?... తమ వయస్సెంత అప్పటికి? ఉత్తరకుమారుడు యువకుడు"

"సినిమాల్లో ఏ వయసు వాళ్లు ఆ వయసు వేషాలు వెయ్యరు మాస్టారూ. చిన్న వయసువాళ్లు పెద్ద వేషాలు వేస్తారు. పెద్ద



వయసువాళ్లు చిన్న వేషాలు వేస్తారు" అన్నారు రేలంగి.

"అదీ..... సైలెన్స్.... తమరేమీ అనుకోకండి - తమ నడక.... అదే రాజఠీవితో లేదు. ఉత్తరకుమారుడికి కాళ్ళు నొప్పులు లేవు కదా" అనేశారు మాస్టారు నిర్మొహమాటంగా.

"నాకూ, కాళ్లు పట్లు పడతాయి. అంచేత, నడక అలావుంటుంది. ఎలావున్నా ప్రేక్షకులు చూస్తారు. మీరు నా పాత్ర చూడాలిగాని, నడక మాత్రమే చూడకూడదు" అన్నారు రేలంగి చిన్న చిర్నవ్వు చిందిస్తూ.

"ఐనా, పాత్ర పోషణము, తీరూ నాకు అంతగా నచ్చలేదు. ఉత్తర కుమారుడు పిరికివాడు గాని, హాస్యగాడు కాదు."

"పిరికి వాడయినప్పుడు హాస్యగాడెందుకు కాకూడదు మాస్టారూ" అని రేలంగి స్వరం హెచ్చించారు.

"మహాభారతంలో ఆ పాత్రను అలా చిత్రించలేదు. మీరు భారతకథను తీసుకున్నప్పుడు ఔచిత్యమును పాటించాలి. లేనప్పుడు భారతకథని మానేయ్. మరోటి తీస్కో. సాంఘికమో ఏదో!.... అంతే గాని, ఆ పాత్రల్ని తీసుకుని మీ ధోరణికి మార్చేయడం సబబా? అది, భావ్యమా అని అడుగుతున్నాను" అని మాస్టారు కొంత తీవ్రమైన కంఠంతోనే అడిగారు.

"అలా ఔచిత్యాలు గౌచిత్యాలు సినిమాల్లో నూటికి నూరుపాళ్లూ వుండవు మాస్టారూ. కొంత తీసుకుని, కొంత కలపకపోతే, మజా వుండదు. మీరడక్కముందే చెబుతున్నాను - 'మాయా బజార్'లో లక్ష్మణకుమారుడూ నేనే. అదీ అంతే కదా" అని రేలంగి ఓ విసురు విసిరారు.

"అది కూడా హాస్యమునకే వినియోగింపబడింది. లక్ష్మణ కుమారుడు, వీరుడు. అయితే అది మొత్తము కల్పనము. భారతమునందు లేని కథ. మాయాబజారు అని, బజారు పాలు చేశారు - భారత కథాపాత్రల్ని."

"మీరు ఇప్పుడేమనుకున్నా అది పెద్ద హిట్టయింది. జనరంజకమైన చిత్రము. ఇప్పుడు విమర్శించినా ప్రయోజనం లేదు" అన్నారు రేలంగి మూతీ ముఖం రెండూ విరిచేస్తూ.

"సైలెన్స్!... నేను సాంఘిక చిత్రములు చూడను. కాని, పౌరాణిక గాథలు తెలుసు గనక, ఆ చిత్రములు మాత్రం చూస్తాను. మహాభారతంలోనే లేని శశిరేఖ బలరాముడి కూతురా? ఘటోత్కచుడికి అలాంటి బలగం వుందేమిటి? అదేమిటి - "హై హై నాయకా" అని అరుస్తూ వుంటారా వాళ్ళు?"

"కథే కల్పన అన్నారు కదా మాస్టారూ - ఇంక వాళ్లు ఏమంటే మనకేం?" అన్నారు రేలంగి.

"కల్పించడానికి నువ్వెవరివోయ్? మహత్తరమైన మహాభారతమును, భాగవతమునూ మార్చి తియ్యడానికి, రాయడానికి నువ్వెవరివీ అని అడుగుతున్నాను. ఆ భారత కర్తలు నేడు జీవించిలేరుగాని, ఉంటే మీ ఆటలు కట్టేవి. మీ సాంఘిక చిత్రముల్లో మీరు యథేచ్ఛగా నటించండి. పురాణ ప్రసిద్ధములైన పాత్రల్ని తీసుకుని వాటికి అగౌరవం ఆపాదించకండి - తమరు



హాస్యరసమును పోషిస్తారు కాదన్ను. దాన్ని సాంఘికాల వరకే పరిమితం చేస్కోండి - మరేమీ అనుకోకండి ఇలా అన్నానని".

"మీరు ఎలా అన్నా, ఎంత క్రిటిసైజ్ చేసినా, సినిమాలు సినిమాలే. మీరు చూశారో లేదో, నేను నారదుడు కూడా వేశాను" అన్నారు రేలంగి - కళ్లు పెద్దవి చేసి చూస్తూ.

"నారదుడు! అనగా నారదమహర్షిపాత్ర! అది కూడా తమరు ధరించారా.... నారదుడు హాస్యపాత్రకాదే. లోకమిత్రుడు. దాన్ని కూడా హాస్యానికి వాడేశారా మీ సినిమావాళ్ళు...? నేను చూడలేదు. ఏమా చిత్రము?"

"చెంచులక్ష్మి"

"చూడలేదు. ఏమిటో మీ సినిమా పేర్లు?... చెంచులక్ష్మి కోయలక్ష్మి! మహాలక్ష్మిని తెచ్చి మీ ఇష్టం వచ్చినట్టు మార్చేస్తున్నారు. సైలెన్స్! పరమ పవిత్రమైన, పూజనీయమైన పాత్రలు అవి! నువ్వు సినిమా తీస్తే యథాతథంగా తియ్యలేనప్పుడు మానేయ్... అదీ నా ఏడుపు! అంతేగాని, నారదుణ్ణీ, వశిష్టుడినీ తెచ్చి హాస్యం పలికించేస్తే - ఏమన్నమాటా?.... ఆఁ?... ఎక్కడ నారదుడు, ఎక్కడ రేలంగి?" అన్నారు మాస్టారు గొడుగూ అదీ సవరించుకుంటూ.

రేలంగి తను నవ్వకుండా, "అక్కడ నారదుడు, ఇక్కడ రేలంగి" అన్నారు. మళ్లీ ఆయనే అన్నారు - "నన్ను అంటున్నారు మాస్టారూ, మా రమణారెడ్డి కూడా వేశాడు నారదుడు..."

"జుబ్బాలేసుకుని" అని వాక్యం పూర్తి చేశారు రమణారెడ్డి. మాస్టారు రమణారెడ్డిని ఆపాదమస్తకం పరిశీలించి లేచి, "మీరా! మీరు నారదుడా!" అన్నారు ఆశ్చర్యంగా.

"అవును. నా వేళకొచ్చేసరికి నారదుడు బక్కచిక్కాడు" అన్నారు రమణారెడ్డి- తను నవ్వకుండా.



"పోనీ, నారదుడు అంటే ఒక్కలా వుండాలిగాని, ఒక్కో చిత్రములో ఒక్కో విధంగా ఎలా వుంటాడు? ఒక దాంట్లో రేలంగిలా, ఇంకోలా రామారెడ్డా ఎవరు ఇతను!... రమణారెడ్డి... రమణారెడ్డిలా బక్కగా, ఇలా రకరకాలుగా వుంటాడా నారదుడు?... నారదుడు మహర్షి. తపస్వి. మహర్షులకున్నట్టు గడ్డము, మీసమూ వుండదేమి మీ సినిమాలలో?... నన్నడగమను చెప్తాను. ఏ పాత్ర ఎలా వుండాలో"

"మీరు చెప్పినట్టు చేస్తే ప్రజలు ఆ సినిమాలు చూడరు. ఎంతమంది ప్రజలు మీ భారతాన్ని చదివారు? చదవని వాళ్ళు కూడా నాటకాలు, సినిమాలూ చూస్తారు మాస్టారూ" అన్నారు రమణారెడ్డి.

"రమణారెడ్డిగారు మాజిక్‌లు కూడా చేస్తారు మాస్టారూ" అన్నాడు రాజబాబు.

"మరింకేం! మాజిక్‌లు చేస్తూ కాలక్షేపం



చెయ్యండి. ఈ నారదుడూ అవీ వెయ్యకుండా" అన్నారు మాస్టారు - రాజబాబుని పరిశీలించి చూస్తూ.

"నా పేరు రాజబాబు. నేనూ హాస్యం చేస్తాను.

"మీరు కూడా ఉత్తరకుమారుడూ దక్షిణ కుమారుడూ లాంటి పాత్రలు ధరించారా?"

"లేదు, లక్ష్మణకుమారుడూ, రామ కుమారుడూ కూడా వెయ్యలేదు" అన్నాడు రాజబాబు, నవ్విస్తూ.

"మీరు ముగ్గురూ హాస్యపాత్రధారులేనా? నాయక పాత్రలు ధరించలేరా?" అని మాస్టారు అడిగారు అమాయకంగా.

"ధరించగలం. కాని ధరించం" అన్నారు రేలంగి.

"ఏం - మీరే చెప్పారు గదా, ఇంతకు ముందు! చిత్రములలో ఎవరైనా ఏ పాత్రయినా ధరిస్తారని. నారదుడు, ఉత్తరకుమారుడూ వెయ్యగా లేనిది, నాయకపాత్రలు వేస్తే ఏం?"

"వేస్తాం. మీరే ఏదయినా సినిమా తీసి, మా ముగ్గురికీ మూడు నాయక పాత్రలు ఇవ్వండి" అన్నారు రమణారెడ్డి.



"వేళాకోళమా! అసలు, ఈ సినిమాలే చూడనివాణ్ణి. తియ్యడం ఒకటా! కడు ధూర్తము మీ సలహా. చూడూ! చిత్రములు నాటకము లకు ప్రతిరూపములు. "కావ్యేషు నాటకం రమ్యమ్" అన్నారు పెద్దలు. ఇప్పుడు మీరు సినిమాలు రమ్యమ్ - అంటున్నారు. జానపదములు, సాంఘికములు మీ ఇచ్చవచ్చిన రీతిని తియ్యండి. పురాణములను మాత్రం కల్పన చెయ్యకండి. నీకు అంత స్వతంత్రం వున్నప్పుడు, కల్తీ చెయ్యగలుగుతున్నప్పుడు - భారతంలోని పద్యములను ఎందుకు వాడుతున్నావు?... నువ్వు రాయలేవా? రాయలేవు. ఆ భాషాపటిమ, భావనైపుణ్యమూ నీకు రావు. 'నర్తనశాల' చిత్రమా, అవును అదే అందులో అన్ని తిక్కన పద్యములే వాడారు. ఏం - అక్కడ కావలసి వచ్చేదేం తిక్కన? కథకి అక్కర్లేదా?... అందులోనే కాబోలు విరాట రాజుని ఒక మూర్ఖుడిలా చూపించారు!... నువ్వు భాగవత కథని తీసుకుంటే, పోతన పద్యాలు వాడతావు, భారతం తీసుకుంటే తిక్కనవి వాడతావు. వాళ్లు రాసిన ఆ మహత్తర పద్యాల్ని తీసుకున్నప్పుడు, ఆ గౌరవం ఉంచాలా లేదా? మీ రచయితలకి శ్రమ తగ్గుతుందనా - లేక ఆ స్థాయిలో రాయలేకనా ఆ పద్యములు వాడుట? - సైలెన్స్... మళ్లా మట్లాడకండి... హాస్యము మంచిదే. అవసరమే. నవ్వు ముఖ్యమైనదే. అపహాస్యము కూడదు. పాత్రను అపహసించుట, భావ్యము కాదు...." అని ఇంకా చెబుతూ వుండగా -

"మమ్మల్ని ఇలా వుండనిస్తారా మాస్టారూ - మీ ఉపన్యాసాలతో చావగొట్టక!" అన్నారు రేలంగి చిరాగ్గా.

"ఇవన్నీ మాతో చెప్పి ఏం ప్రయోజనం! మేం వేషాలు వేసే వాళ్లం. తీసేవాళ్లు వేరే వుంటారు. వాళ్లతో చెప్పండి. మీ మాట వాళ్లూ వినరనుకోండి" అన్నారు రమణారెడ్డి.

"సినిమాలు మడిగట్టుకుని తియ్యరు మాస్టారూ... అలా తీస్తే ప్రేక్షకులందరూ

మడికట్టుకునే చూడాలి" అని రాజబాబు కవ్వించాడు.

"మీ అందరికీ నవ్వులాటగా వుంది. ఆ ఆటేదో సినిమాల్లో చూపించుకోండి. సాంఘికాల్లో ఓ పిల్లని పట్టుకుని, ఆ పిల్లతో పాడుతూ గెంతండి. నాకేం! కాని, హాస్యము కూడా నవరసములలో ఒకటి. ప్రధానమైనది. దానిని పోషించు మీ త్రయము ఔచిత్యమును కూడా దృష్టిలో పెట్టుకోండి. పురాణ పాత్రల జోలికి మాత్రం పోకండి" అని లేచారు మాస్టారు, గొడుగు తీసుకుంటూ. అంతలో 'షాట్‌రెడీ' అని సహాయ దర్శకుడు వచ్చాడు.

"మాస్టారూ! ఈ చిన్న దృశ్యమును చూచెదరా! చూచి నవ్వెదరా" అని రేలంగి హాస్యమాడారు.

మాస్టారు సరే అన్నారు. ఆ షాటులో రమణారెడ్డి, రేలంగీ ఇద్దరే వున్నారు. చిన్న షాటు తీశారు.

"ఐతే ఏమంటా? నీ భార్యని తెచ్చుకోనంటా?" అని రమణారెడ్డి నెల్లూరు మాండలికంలో డైలాగు చెప్పారు.

"తెచ్చుకోనూ తెచ్చుకోను. నాకు రావలసిన కట్నం సొమ్ము, అదీ ఇదీ అన్నీ తెస్తేగాని, నేను నా భార్యని తెచ్చుకోను" అన్నట్టుగా రేలంగి సంభాషణ చెప్పారు.

షాట్ కట్టయింది. మాస్టారు దగ్గరకొచ్చి, తీవ్రంగా ఇద్దర్నీ చూశారు.

"ఇంతేనేమిటి - ఇదేనా ఏమిటి మీ హాస్యం? నాకెక్కడా నవ్వు రాలేదు... అయినా ఇంత ముక్కేనా - పూర్తిగా దృశ్యమంతా నటించలేరా?" అని అడిగారు మాస్టారు.

"ఇవి షాట్స్. ముక్కలు ముక్కలుగా తీస్తారు. అతుకుతారు" అని రమణారెడ్డి సిగరెట్టు తీశారు.

"అదే - ముక్కలు ముక్కలుగా తియ్యడం ఎందుకు - మళ్లీ అతకడం ఎందుకు?... డబుల్ వర్కింగ్ కాదూ అది! దానికి బదులు ఏకంగా దృశ్యమంతా చిత్రీకరించవచ్చు గదా. మీకెవరికీ తట్టలేదా, ఈ సులువు?"

"మీరు చెప్పాలి మాస్టారూ. ఇలాంటి సులువులు చెప్పడానికీ, పౌరాణికాలు తియ్యొద్దని చెప్పడానికీ మీరు మా సినిమాల్లో చేరిపోండి. మాకు రోగం కుదుర్తుంది" అన్నారు రేలంగి. మాస్టారి చూపు మారింది. కళ్లజోడు సవరించుకుంటూ - "సైలెన్స్! మీరంతా ఇలాంటి కల్తీ వాతావరణంలో పడిపోయి, నన్నూ రమ్మంటున్నారా - నాకెందుకయ్యా - నా బతుకు నన్ను బతకనీయండి - మీ బతుకు మీరు బతికినట్టు! కడు ధూర్తము మీ ఆహ్వానము. చాలు" అంటూ, వెనక్కి తిరిగారు మాస్టారు - హాస్యనటులు ముగ్గురూ సరదాగా నవ్వేస్తూ వుండగా. ■

# ఘంటసాల క్విజ్

మొదటి బహుమతి : రూ. 250/-
రెండవ బహుమతి : రూ. 200/-
మూడవ బహుమతి : రూ. 150/-
} మరియు ఘంటసాల కలర్ ఫోటో

క్విజ్ రూపకల్పన, సమర్పణ, నిర్వహణ
డా॥ కె.వి.రావు,
వ్యవస్థాపకులు,
పద్మశ్రీ ఘంటసాల గానసభ,
28, 1-1-79, ఆర్టీసీ క్రాస్‌రోడ్స్,
హైదరాబాద్ - 500 020.



## క్విజ్‌నెం-15

1. ఘంటసాల, టి.వి.రాజుకు మొదటిసారిగా పాడిన చిత్రం?

జ: ..............................

2. ఘంటసాల యోడిలింగ్ చేసిన పాట? చిత్రం?

జ: ..............................

3. పెండ్యాల సంగీత దర్శకత్వంలో ఘంటసాల, పద్మాసినితో కలిసి పాడిన చిత్రం?

జ: ..............................

4. ఘంటసాల ప్రైవేటు రికార్డుగా యిచ్చిన 'కుంతీకుమారి' ఏ చిత్రంలో వుపయోగించారు?

జ: ..............................

5. 'అత్తలేని కోడలుత్తమురాలు' అనే పాట ఒక చిత్రంలో పాడించారు. ఆ చిత్రం?

జ: ..............................

పంపినవారి పేరు :

చిరునామా :

**నిబంధనలు:**

ఎ) పోటీలో పాల్గొనగోరేవారు పక్కన ప్రచురించిన కూపన్ మాత్రమే నింపి కవరులో పంపాలి. కూపన్ కాకుండా మరే విధంగా పంపినా ఆ ఎంట్రీ స్వీకరించబడదు.

బి) కవరుపై 'ఘంటసాల క్విజ్' అంటూ పేర్కొనటం మరచిపోకూడదు.

సి) ప్రకటించిన బహుమతులను నగదుగా గాని, ఆడియో క్యాసెట్లుగా గాని, సీడీలుగా గాని విజేతలకు 'పద్మశ్రీ ఘంటసాల గానసభ - హైదరాబాద్' వారిచే నేరుగా పంపటం జరుగుతుంది.

డి) ఏ బహుమతి కైనా ఒకరు కన్నా ఎక్కువగా విజేతలుంటే తుది నిర్ణయం 'పద్మశ్రీ ఘంటసాల గాన సభ' వారిదే!

ఇ) ధారావాహికంగా కొనసాగే ఈ క్విజ్ పోటీలలో ఏ కేటగిరీలోనైనా వరసగా 5 సార్లు విజేతగా ఎన్నికైనవారికి ఓ ప్రముఖవ్యక్తి ద్వారా హైదరాబాద్‌లో మరొక ఆకర్షణీయమైన బహుమతిని అందజేయటం జరుగుతుంది.

**కూపన్‌లు 15-12-2003 లోగా చేరాలి**

**కూపన్‌లు పంపవలసిన అడ్రసు**
'హాసం- హాస్య సంగీత పత్రిక'
502, శ్రీ బాలాజీ నిలయం, 13-1-212,
మోతీనగర్, హైదరాబాద్-500 018.

**ఘంటసాల క్విజ్ - 12 విజేతలు**

మొదటి బహుమతి
శ్రీ వై. రోశిరెడ్డి, సత్తెనపల్లి.
రెండవ బహుమతి
శ్రీ డి.వి.కల్యాణ్, హైదరాబాద్.
మూడవ బహుమతి
శ్రీ బి.ఎమ్.రవి, కనిగిరి.

**సరి అయిన సమాధానాలు**

1. లైలామజ్ను
2. అవేకళ్ళు
3. రామాలయం
4. పెళ్ళికాని పిల్లలు
5. పూలమాల

**బహుమతులు**

మొదటి బహుమతి : ఎ) 'బహుదూరపు బాటసారి' (ఘంటసాల ప్రైవేట్ పాటల) డబుల్ డిస్క్/ స్వరసుధ ఘంటసాల 31 గాయనీ మణులతో పాడిన సినీ గీతాల డబుల్ డిస్క్ హెచ్.ఎం.వి.వారిది.
బి) ఘంటసాల పాడిన గోల్డెన్ అవర్స్ పాటల క్యాసెట్. హెచ్.ఎం.వి. వారిది.
రెండవ బహుమతి: 'బహుదూరపు బాటసారి' (ఘంటసాల ప్రైవేట్ పాటల) డబుల్ డిస్క్ హెచ్.ఎం.వి.వారిది.
మూడవ బహుమతి : ఎ) ఘంటసాల, ఎల్.ఆర్.ఈశ్వరి యుగళ గీతాల 'లవ్‌మి నెరజాణ' హెచ్.ఎం.వి. వారి సింగిల్ సి.డి.
బి) ఘంటసాల పాడిన గోల్డెన్ అవర్స్ పాటల క్యాసెట్. హెచ్.ఎం.వి.వారిది.

# ఎలుక వచ్చె ఇల్లు భద్రం

19



ఇలపావులూరి మురళీమోహనరావు

**హెచ్చరిక**

విరగబడి నవ్వితే గుండె చిక్కబట్టి ఊపిరాడక అవస్థపడేవారు కామెడీ యాక్ట్ 2003 ప్రకారం ఈ సీరియల్‌చదవడం నిషేధం.
ఒకవేళ మీ పొట్టచెక్కలైతే పత్రిక నుంచి ఎలాంటి పరిహారం రాదు. ఈ హెచ్చరిక ఈ సీరియల్ పూర్తయ్యేంత వరకు అమలులో ఉంటుంది.



## జరిగినకథ

వెంకట్రావు, సుందరిల ఇంట్లో ఓ ఎలుక చేరి నానా రభసా చేస్తూంటుంది. దాన్ని చంపడానికి పెట్టిన మందును వాళ్ల పాప రుచిచూడడంతో ఉత్తుత్తి పరీక్షల పేరిట డాక్టర్లు వేలాది రూపాయలు ఖర్చుపెట్టిస్తారు. మేనేజరు ఇంటినుండి పిల్లిని తెస్తారు. మర్నాడు చీలికలు పేలికలై కనిపించింది ఎలుక. అప్పటినుండి పిల్లీ కనబడడం మానేస్తుంది. కంగారుపడు తూండగానే కొన్నాళ్లకు ఆరుకూనలతో సహా అటకమీద ప్రత్యక్షమవుతుంది. పాలెక్కువై పిల్లి కూనలలో ఒకటి చనిపోవటంతో ప్రాయశ్చిత్తం చేయించాలన్న పక్కింటి ఆండాళ్ళమ్మ సలహా విని వెంకట్రావు పురోహితుడు శాస్త్రిని కలుస్తాడు. శాస్త్రి వెంకట్రావు ఇంటికి వచ్చి నరకబాధల బూచిచూపి ఇరవై వేల రూపాయల ఖర్చుతో శాంతి చేయించాలంటాడు. గత్యంతరం లేక ఒప్పుకున్న వెంకట్రావు దంపతులచేత తూతూ మంత్రాలతో పూజలు చేయించి దోచుకుంటాడు. జరిగిన తతంగమంతా తన కొలీగ్ నారాయణకు చెప్తాడు వెంకట్రావు. ఇదంతా మీ ఇంటి వాస్తు బాగా లేకపోవటం వల్లే జరిగిందని, వాస్తుభూషణరావుని కలిస్తే ఫలితం ఉంటుందని సలహా ఇస్తాడు నారాయణ.

(ఇక చదవండి)

ఓ ఆదివారం ఉదయం వాస్తు భూషణాన్ని కలవడానికి వెళ్ళాడు వెంకట్రావు. అది మామూలు ఇల్లుకాదు. జూబ్లీహిల్స్‌లో పెద్ద పెద్ద బంగళాలను తలదన్నేట్లుంది.

కాంపౌండ్ వాల్ మీద వాస్తు శిరోమణి, వాస్తు చింతామణి, వాస్తు పురుషోత్తమా, వాస్తు రత్న, వాస్తు వజ్ర, వాస్తు దైవజ్ఞ, వాస్తు భయంకర, వాస్తు జ్ఞానపీఠాదిప, వాస్తు ధురీణ, వాస్తు మహాపురుష, వాస్తు భూషణరావు" అని పాలరాతి అక్షరాలు అందంగా చెక్క బడున్నాయి.




ఇంటి ముందు దాదాపు రెండువందల కార్లు, నాలుగొందల స్కూటర్లు ఆగి ఉన్నాయి.

వెంకట్రావు తికమక పడ్డాడు.

రెండు నిముషాలు అటుఇటు చూశాడు. మళ్ళీ రోడ్డుమీదకెళ్ళి అటుగా వెళ్తున్న ఒక వ్యక్తిని ఆపాడు.

"సార్... ఇక్కడ వాస్తుభూషణరావని వాస్తు పండితుడుండాలి. ఆయన ఇల్లెక్కడ?" అడిగాడు.

"ఆయన ఇంటి ముందు నిలుచుని ఆయన ఇల్లెక్కడ అని అడుగుతున్నారు. పాగల్‌లెక్కన కనపడుతున్నానా?" కోపంగా అన్నాడతను.

"అబ్బే... అదికాదండీ. అర్థం కాకడిగాను. మరి ఈ వాస్తు చింతామణి, వాస్తు శిరోమణి... వీరంతా ఎవరు? అందరూ కలిసి ఈ కంపెనీ పెట్టారా?"

"భలేవారు సార్ మీరు... అవన్నీ ఆయన బిరుదులు."

"మైగాడ్... ఇన్ని బిరుదులా? ఎవరిచ్చారివన్నీ?"

"ఎక్కడ దొరికారండీ మీరు? ఒకడిచ్చేదేంటి? ఎవడికి వాడే ఇచ్చుకుంటాడు. ఒక కవి ఉంటాడు. నాలుగు పద్యాలు రాయగానే నన్నయ్యకు అన్నయ్యననుకుంటాడు. ఎవడూ సన్మానం చేయడం లేదని ఉడికిపోతుంటాడు. చివరకు ఏ సాంస్కృతిక సంస్థ వాడినో పట్టుకుని నాలుగు వేలిచ్చి నలుగురి ముందు సన్మానం చేయించుకుంటాడు. వేదిక మీదుండే వాగుడుకాయల్లో ఎవడో ఒకడు ఈ కవిని మహాకవనో, కవి పుంగవుడనో వాగుతాడు. మర్నాటి నుండీ ఆ పదాలను వీడు బిరుదులుగా వాడుకుంటాడు".

"ఇంత వివరంగా చెబుతున్నారు. మీ పేరేమిటో తెలుసుకోవచ్చా?"

"నేను శివం ఆర్ట్స్ కల్చరర్ అసోసియేషన్ ప్రెసిడెంట్‌ను. గత పదేళ్ళుగా ఇటువంటి బిరుదులు కొన్ని వేలమందికిచ్చాను. ఈయనకిచ్చిన బిరుదుల్లో నాలుగు నేనిచ్చినవే. ఇలాంటి వారి దయవల్ల ఇక్కడే రెండు కోట్లుపెట్టి బంగళా కట్టుకున్నాను. మార్నింగ్ వాక్‌లో మంచి కాలక్షేపం కలిగించారు. థాంక్స్..." వెళ్ళిపోయాడాయన.

గేటు తెరిచి లోపలకు వెళ్ళబోతుండగా 'రుక్‌జావ్' అని వినబడింది.




ఆగాడు వెంకట్రావు. ఆరడుగుల పొడవున్న ఆజానుబాహు గూర్ఖా వచ్చాడు.

"క్యా చాహియే" అడిగాడు.

"వాస్తు భూషణం గారి కోసం" చెప్పాడు వెంకట్రావు.

"కార్ పార్కింగ్ వంద రూపాయ లివ్వండి" రశీదు పుస్తకం తీశాడు గూర్ఖా.

"నాకు కారులేదండీ..."

"అయితే స్కూటర్ పార్కింగ్ ఏభై రూపాయలు. చించుతున్నా."

"వద్దొద్దు... నాకు స్కూటర్ లేదు."

"అయితే సైకిల్ పార్కింగ్ పాతిక రూపాయలు. చించనా?"

"వద్దొద్దు... నాకు సైకిల్ కూడా లేదు."

"అలాగా... అయితే ఇరవై నాలుగో కౌంటర్ దగ్గర అలా క్యూ అని ఉంటుంది. అక్కడ నిలుచోండి." వెంకట్రావును ఓ పనికిమాలిన వెధవను చూసినట్లు చూసి వెళ్ళిపోయాడు గూర్ఖా.

లోపలికి వెళ్ళాడు వెంకట్రావు.

సినిమా హాల్లో బుకింగ్ కౌంటర్లున్నట్లు ఓ పెద్ద హాల్లో పాతిక కౌంటర్లున్నాయి. వెంకట్రావు ఆశ్చర్యంగా చూస్తూ నడవ సాగాడు.

ఉన్నట్లుండి క్యూలో కలకలం మొదలైంది.

"రేయ్.... ఆగు... క్యూలోకి రా... మేమంతా వెర్రోళ్ళమనుకున్నావా? రేయ్ బాడ్కోవ్... ఫీఛే ఆరే... బేవకూఫ్.... ఏవయ్యో వెనక్కు రావయ్యా... లైన్లోనించో... యూ మేనర్లెస్ ఫెలో... వేరార్ యూ గోయింగ్... కమ్ బ్యాక్..." ఇలా రకరకాల భాషలలో దండకం వినిపించింది.

వెంకట్రావుకు భయమేసింది. కొంపదీసి తానేమైనా రౌడీల డెన్‌లోకి రాలేదు కదా అని కంగారు పడ్డాడు. ఇంతలోనే ఇద్దరు దృఢకాయులు వెంకట్రావును పెడరెక్కలు విరిచి మేక పిల్లను ఈడ్చినట్టు ఈడ్వసాగారు.

వెంకట్రావు భయంతో గావుకేకలు పెట్టాడు. అయినా వారు అదేమీ పట్టించుకోకుండా వెంకట్రావును మామూలు గానే ఈడ్చుకెళ్ళి క్యూ చివర నిలుచోబెట్టి వినయంగా వంగి నమస్కరించారు.

"సార్... క్షమించండి. వారంతా మీకంటే ముందు వచ్చిన వాళ్ళు. వాళ్ళను కాదని మీరు ముందు కెళ్ళడం అన్యాయం కదా! దయచేసి లైన్లో నించోండి. ప్లీజ్...." అన్నారు.

వెంకట్రావు ఊపిరి పీల్చుకున్నాడు.

"ఓరి మీ వినయం మండిపోనూ. ఒక్క క్షణం గుండె ఆగి గర్భంలోకి జారింది కదయ్యా. ఆ మాట ముందే చెప్పొచ్చు గదా...." అన్నాడు చిరుకోపంగా.

"ముందోసారి వెనకోసారి చెప్పడానికి టైం ఉండదు సార్.... రేయ్... ఆగు...." అని మళ్ళీ మరోవైపు పరిగెత్తారిద్దరూ.

వెంకట్రావుకీ పద్ధతంతా వింతగానూ అయోమయంగానూ తోచింది. గంట గడిచినా క్యూ అంగుళం కూడా కదల్లేదు.

"మేస్టారూ..." ముందు నిలుచున్నతనిని కదిపాడు.

"నేను మేస్టారిని కాదండీ. టైపిస్టును." అన్నాడతను.

"ఓహ్.... సారీ... టైపిస్టుగారూ..."

"చెప్పండి"

"మీరెక్కడినుంచొచ్చారు?"

"ఇంటి నుంచి".

"హి.. హి... అది సరే... ఏ ఊర్నొంచి వచ్చారని...?"

"వేరెవరి ఊరినుంచో ఎందుకొస్తాను? మా ఊర్నించే."

"హి... హి...హి... అఫ్‌కోర్స్... ఎందు కొచ్చారూ అని."

"అరికాళ్ళు జిల పుడుతున్నాయి. నించుంటే దురద తీరుతుందని."

"హి... హి... భలేవారే.. అదికాదు. మీ సమస్య ఏమిటని?"

"అది మీతో చెప్పడానికి కాదు మా ఊర్నొంచి వచ్చింది."

"హ.. హ.. భలే జోక్ వేశారు. ఊరికే తెలుసుకుందామని..."

"ఏవండోయ్.. మీకేమీ పనిలేకపోతే రామ రామ రామ అనుకోండి. ఊరికే నన్ను విసిగించొద్దు" కోపంగా అన్నాడతను.

ఇక అతనితో మాట్లాడటం అనవసరం అనిపించింది వెంకట్రావుకు. వెనక్కు తిరిగి చూశాడు. మరో ఇరవైమంది ఉన్నారు.

క్యూ మెల్లగా కదులుతున్నది.

"జనం చాలామందున్నారు. అసలిక్కడి ప్రొసీజరేంటో?" అనుకున్నాడు.

"ఒకసారి ముగ్గుర్ని లోపలకు పంపుతారు. ముగ్గురి సమస్యలు విని ఐదునిముషాల్లో బయటకు పంపేస్తారు. అంతే." వెనక నిలుచున్న ముసలాయన చెప్పాడు.

"ఫీజెంత పుచ్చుకుంటారు?"

"ప్రశ్నకు రెండు వేలు. స్పెషల్‌గా ఇంటికి పిలిపించుకోవాలంటే వేరే ఛార్జీ ఇచ్చుకోవాలి."

"ఈయన బాగా చెప్పగలడంటారా?"

"చిన్నగా అంటారేంటి? గత జన్మలో విశ్వకర్మే ఈ జన్మలో వాస్తు భూషణరావుగా జన్మించారు. ఆయన ఏదైనా సలహా ఇచ్చారంటే సాక్షాత్తూ మయ సభ నిర్మించిన మయుడు కూడా మాట్లాడడు."

"అందుకే కాబోలు ఇంతమంది క్లయింట్లు. ఈ లెక్కన మనవంతు వచ్చేసరికి చాలాసేపయ్యేట్లుంది." అనుకుని ఓ ధృఢకాయుడిని చప్పట్లు కొట్టి పిలిచాడు వెంకట్రావు.

"చిత్తం... చెప్పండి సార్... మిమ్మల్నెవరైనా నెట్టి ముందుకు వెళ్ళారా? చెప్పండి కీళ్ళు విరిచి లాక్కొస్తాం." అన్నాడు గార్డు.

"అదేం కాదు కానీ నా వంతు వచ్చేసరికి ఎంతౌతుంది?"

"మీరు నూట ఆరవ వారు సార్... మనిషికి రెండు నిముషాలు కేటాయిస్తారు మా సారు. వి.ఐ.పీ క్యూ వాళ్ళకు పది నిముషాలు కేటాయిస్తారు. వాళ్ళు దాదాపు వందమంది ఉన్నారు. మినిష్టర్ల రికమెండేషన్ తెచ్చిన వాళ్ళు దాదాపు ఏభై మంది ఉన్నారు. వాళ్ళకు కొంత వీళ్ళకు కొంత సమయం అడ్జెస్టు చెయ్యాలి. ఏవైనా మీవంతొచ్చేసరికి దాదాపు ఇరవై గంటలు పడుతుంది. ఇపుడు ఏడున్నరయింది. సారుకు మధ్యాహ్నం గంటసేపు లంచ్ బ్రేక్. రాత్రి పన్నెండు నుండి రెండున్నర వరకూ నిద్ర టైమ్. మూడింటికి మళ్ళీ మొదలు పెడతారు. మీకు పిలుపొచ్చేసరికి రేపు తెల్లవారు జామున నాలుగు కావచ్చు."

"మైగాడ్.... అంతసేపా? తిరుపతి వెంకటేశ్వర స్వామివారి దర్శనానికి కూడా అంతసేపు పట్టదు గదయ్యా." ఆశ్చర్యంగా అన్నాడు వెంకట్రావు.




"మరేమనుకున్నారు సార్? వెంకటేశ్వర స్వామి వారైనా వాస్తు చూపించుకోవాలంటే మా సార్ దగ్గరకు రావాల్సిందే. పెద్ద పెద్ద మినిష్టర్లు, గవర్నర్లు ఆయన క్లయింట్లే. ఆయన వాస్తు చెబితే వాస్తు పురుషుడు కూడా ఆయన చెప్పినట్లు రూల్సు మార్చుకోవాల్సిందే." అన్నాడు గార్డు.

"అవునండీ దిక్కులన్నీ ఆయన చెప్పినట్లు వినాల్సిందే. లేకపోతే వాటికే దిక్కుండదు." అన్నాడు వెనుక నిలుచున్నాయన.

"అబ్బో... కానీ అంతసేపు ఎలా నించోవడం? పోనీ మరోసారి వస్తాను." అన్నాడు వెంకట్రావు.

"ఎప్పుడొచ్చినా ఇక్కడ ఇలాగే ఉంటుందండీ. రాబోయేది ఎండాకాలం. ఇళ్ళు కట్టుకునే వాళ్ళు ఎక్కువుంటారు. అపుడు మరీ రష్‌గా ఉంటుంది." సలహా ఇచ్చాడు మరొకాయన.

"పోనీ... నేనలా ఇంటికెళ్ళి తెల్లవారు జామున మూడింటికొస్తాను. అంతవరకూ నా ప్లేస్ కాస్త చూస్తుండగలరా? అడిగాడు ధృఢకాయుడిని.

"సారీ సర్.. ఇక్కడలాంటిదేమీ ఉండదు. మా సార్ యమధర్మరాజు లాంటోరు. ఆయన కందరూ సమానమే. ఎవరైనా సరే క్యూలో అంతసేపూ నిలుచోవాల్సిందే. రాష్ట్రపతి రికమెండేషన్‌తో వచ్చేవారికి మాత్రమే కొంచెం కన్సెషనుంటుంది. రేయ్... గాడిదకొడకా... ఆగు... లైన్ సే జావ్..." ఎవరో దిక్కులు చూస్తూ ముందు కెళ్తుంటే అటువైపు పరిగెత్తాడు గార్డు.

అంతా కలా నిజమా అనిపించింది వెంకట్రావుకు. ఎక్కడ బట్టినా జనం, గుళ్ళలో జనం, బళ్ళలో జనం, సినమాహాళ్ళ నిండా జనం, హోటళ్ళనిండా జనం, హాస్పటళ్ళ నిండా జనం, షాపుల నిండా జనం. రైళ్ళు, బస్సుల నిండా జనం! క్లబ్బుల నిండా జనం! పార్కుల నిండా జనం! ఏమిటీ జనం! ఎక్కడ కెళ్ళినా వారాలముందే రిజర్వేషన్లు, ముందుగానే అడ్వాన్సులు! ఎవడినడిగినా జేబులో డబ్బుల్లేవంటుంటాడు. కానీ బయటకొస్తే ఎక్కడ చూసినా ఇసుకేస్తే రాలదు! ఎక్కడికెళ్ళినా గంటల తరబడి పడిగాపులు! ఇది నాగరికతకు నిదర్శనమా? అసహనగుణానికి అద్దమా? వెంకట్రావు బుర్ర వేడెక్కింది.

ముందు నిలుచున్న వ్యక్తి భుజం మీద చెయ్యి వేశాడు.

"మేస్టారూ... సారీ... టైపిస్టుగారూ... ఇంతింత సేపు నిలబడాలంటే కష్టం కదా! మరి అంతవరకూ మనకు ఒకటొచ్చినా రెండొచ్చినా... ఎలా?..." వేళ్ళు చూపిస్తూ అడిగాడు.

ముఖం చిట్లిస్తూ వెంకట్రావును చూశాడతను.

-(ఇంకావుంది)




# ఆరోహణవరోహణల ప్రయాణం

# రాగేశ్వరి



రాగేశ్వరి!

చూడటానికి సన్నగావున్నా వేదిక మీద చలాకీగా డాన్స్ చేస్తూ పాటలు పాడే ఆమెను ఓసారి చూసినవారు అంత తేలిగ్గా మర్చిపోలేరు. రాగేశ్వరి పాట చెవులనుండి - కదలికలు కనుల నుండి చెదిరిపోవు. అయితే స్టేజ్ ఫెర్మార్మెన్స్ కంటే ముందే రాగేశ్వరి వెండితెర నాయికగా ఓ వెలుగు వెలిగింది. ఆ తర్వాత వీడియోజాకీగా అవతారమెత్తింది.... ఈ రెండు ప్రక్రియల తర్వాతనే ఆమె పాప్ గాయనిగా భారతీయ ప్రేక్షకుల ముందుకు వచ్చింది.

### తొలి అడుగు వెండితెరపై...

రాగేశ్వరి లూంబా గాయకుడు, సంగీత దర్శకుడు త్రిలోక్ లూంబా కుమార్తె. తొలిసారిగా 1993లో పద్దెనిమిది సంవత్సరాల వయసులో రాగేశ్వరి గ్లామర్ ప్రపంచంలోకి అడుగిడింది. 'జిద్' సినిమాలో రాగేశ్వరి నటించింది. కానీ ఆ చిత్రం సక్సెస్ కాకపోవటంతో రాగేశ్వరికి గుర్తింపు రాలేదు. ఆ వెంటనే గోవింద, చంకీ పాండే లతో డేవిడ్ ధావన్ తీసిన 'ఆంఖే' చిత్రంలో రాగేశ్వరి నటించింది. ఇది ఆమెకు లభించిన తొలి విజయం. ఆ సినిమా సూపర్‌హిట్ అయ్యింది. ఆ వెంటనే సయీఫ్ అలీఖాన్, అక్షయ్ కుమార్‌ల 'మై ఖిలాడీ తు అనారి' లో అవకాశం వచ్చింది. ఈ సినిమా బాక్సాఫీస్ దగ్గర బోల్తా కొట్టింది. ఇద్దరు హీరోలు, ముగ్గురు నలుగురు హీరోయిన్లు నటించే చిత్రంలో తానూ ఒకటి కావటం రాగేశ్వరికి నచ్చలేదు. దాంతో బాలీవుడ్‌కి స్వస్తి పలకాలని భావించింది. అప్పటికే అంగీకరించిన ముఖేష్‌భట్ 'దిల్ కిత్నా నదాన్ హై', ఎన్ఎఫ్‌డిసి చిత్రం 'తుమ్ జియో హజారోం సాల్' లో మాత్రం నటించింది. నచ్చని రంగంలో రాజీపడి కొనసాగటం ఇష్టంలేని రాగేశ్వరి అటునుండి తన దృష్టిని టీవీ కార్యక్రమాల వైపు మరల్చింది.

### వీడియో జాకీగా...

1995వ సంవత్సరంలో ఛానల్ (వి) బిపిఎల్ 'ఓయే' కార్యక్రమం యాంకరింగ్ చేసే బాధ్యతల్ని రాగేశ్వరికి అప్పగించింది. కొత్త కెరీర్ వేటలోవున్న రాగేశ్వరి రెండు చేతులతోనూ ఆ అవకాశాన్ని అందిపుచ్చుకుంది. "వీడియో జాకీగా చేయటం ఓ కొత్త అనుభూతి. అందులో చాలా ఎంజాయ్‌మెంట్ వుండేది. సినిమాల్లో కాకుండా ఈ కార్యక్రమ నిర్వహణ బాధ్యత మొత్తం నా మీదనే ఉండటం గ్రేట్‌గా అనిపించేది. నిజానికి నాలో అంత 'కామిక్ ఎలిమెంట్' వుందని వీజే చేసేంతవరకూ నాకే తెలియదు. టీవీ కార్యక్రమ ప్రయోక్తగా వ్యవహరించడంతో ప్రతి ఇంటి లోనూ నేను ఓ సొంత మనిషిలా అయిపోయాను'' అంటుంది రాగేశ్వరి. అంతేగాదు సినిమా జనంతో పోల్చితే టీవీ మీడియాలో వ్యక్తులు తెలివిగలవారు, చదువుకున్నవారు అని రాగేశ్వరి కితాబిచ్చింది. అదే సమయంలో బిపిఎల్ రిఫ్రజిరేటర్స్, క్యాడ్‌బర్రీ పెర్క్‌కు ఆమె మోడల్‌గా పనిచేసి పేరు తెచ్చుకుంది.

### తండ్రి అడుగు జాడలలో - సంగీత ప్రపంచంలోకి...

పేరు ప్రఖ్యాతలు, కావాల్సినంత సంపాదన లభిస్తున్న సమయంలో రాగేశ్వరి అటునుండి సంగీత ప్రపంచంలోకి అడుగుపెట్టడం ఆశ్చర్యంగా అనిపిస్తుంది. దీని గురించి రాగేశ్వరి మాట్లాడుతూ "మా నాన్నగారి కారణంగానే నేను గాయనిగా మారాను. ఆయన యుక్తవయసు లోనే బెస్ట్ మ్యూజిషియన్‌గా జాతీయ స్థాయిలో గుర్తింపు పొందారు. కెరీర్ పరంగా ఎంత బిజీగా వున్నా నిత్యం సంగీత సాధన చేస్తుండేవారు. కమర్షియల్‌గా కాకుండా ఆత్మ సంతృప్తి కోసం

- ☆ రాగేశ్వరి ముద్దుపేరు 'రాగ్స్'.
  బి.బి.సి. ఛానల్ కోసం రాగేశ్వరి ఓ కార్యక్రమాన్ని చేయబోతోంది. క్వెస్ట్ అనే పేరుతో సాగే ఈ కార్యక్రమం ఓ ట్రావెల్ షో. భారతదేశంలోని పురాణ ప్రసిద్ధ క్షేత్రాల పరిచయంతో ఈ కార్యక్రమం వుంటుందని తెలుస్తోంది.
- ☆ కంట్రీ క్లబ్‌తో కలిసి రాగేశ్వరి 26 కార్యక్రమాలు నిర్వహించడానికి ఒప్పందం చేసుకుంది. ఇంతవరకూ దక్షిణ భారతదేశంలో 12 కార్యక్రమాలు నిర్వహించింది. మిగిలినవి దేశంలోని ఇతర ప్రాంతంలో చేయాల్సివుంది.
- ☆ రాగేశ్వరి 'రాగ్స్ ఆర్ట్స్ అండ్ మ్యూజిక్' పేరుతో సొంత ప్రొడక్షన్ కంపెనీని ఏర్పాటుచేసింది. సామాజిక చైతన్యం కలిగించే కార్యక్రమాలను రూపొందించి వివిధ ఛానల్స్‌లో ప్రచారం చేయాలన్నది ఆమె కోరిక.
- ☆ షిల్లాంగ్, గౌహతిలతో పాటుగా టిబెట్ లోని లామాల కోసం ఓ కార్యక్రమం నిర్వహించడానికి రాగేశ్వరి ప్రయత్నాలు చేస్తోంది. అలానే రష్యాలోని కొన్ని చిన్న చిన్న పట్టణాలలోనూ స్టేజ్ షోలను నిర్వహించే ప్రయత్నంలో వుంది.

ఆయన తీరిక సమయంలో స్వరాల్ని సమకూర్చుతుండేవారు. ఆయన కోరక మేరకే నేను పాటలు పాడటం నేర్చుకున్నాను" అని చెబుతోంది. "ఆయన స్వరాలకు నేను పాటలు పాడిన ఆల్బమ్ 'దునియా'. మొదట సరదాగా పాడినా - తర్వాతర్వాత కెరీర్‌ను సీరియస్‌గానే తీసుకున్నాను. మొదట డెమో టేప్ రెడీచేసి మ్యూజిక్ కంపెనీలకు వినిపించాం. అయితే నా ఇమేజ్‌తో పోల్చితే ఈ పాటలు చాలా గంభీరంగా వున్నాయని వాళ్ళు తిరస్కరించారు. చివరికి మేమే సొంతంగా 'దునియా' ఆడియోను విడుదల చేయాలనుకున్నాం. ఎందుకంటే మ్యూజిక్ కంపెనీలు కోరే విధంగా 'తూ... తూ.... చూ.... చూ...' అంటూ పాడటం నాకిష్టం లేదు. నా పాటల ద్వారా ఏదో ఒక సందేశాన్ని ఇవ్వాలన్నది నాన్నగారి కోరిక. లక్కీగా కోక్ నుండి స్పాన్సర్‌షిప్ లభించింది. ఆ తర్వాత బిఎంజి క్రెసెండే కంపెనీ 'దునియా' ను విడుదల చేయడానికి ముందు కొచ్చింది" అని చెప్పింది రాగేశ్వరి.

కొత్తగొంతులో - వైవిధ్యమైన బాణీలతో వెలువడ్డ 'దునియా' ఇండీపాప్ రంగంలో తనకంటూ ఓ ప్రత్యేక స్థానాన్ని పొందింది. ఇండీపాప్ ఆడియోకి అంతగా అమ్మకాలు వుండని కొచ్చిన్, త్రివేండ్రమ్ వంటి ప్రదేశాలలో కూడా 'దునియా' సేల్స్ అత్యధిక స్థాయిలో జరిగాయని రాగేశ్వరి చెప్పింది. వీజే నుండి గాయనిగా మారటం ఏ రకంగా ఉపయోగ పడిందనే ప్రశ్నకి సమాధానం చెబుతూ "నా జీవితం తిరిగిన మలుపులు చాలా తక్కువ మంది జీవితంలో జరిగివుంటుంది. బిఏఎల్ ఓయే చేసినప్పుడు ఎక్కువగా సంగీతం వైపు నేను దృష్టి నిలిపేదాన్ని. ఆ ఆసక్తి నన్ను గాయనిగా చేసింది. వీజేగా వచ్చిన పాప్యులారిటీ వల్ల నా పాటల పట్ల ప్రజలలో ఉత్సుకత కలిగింది. అయితే వారి ఆదరణ పొందడానికి మాత్రం నా ప్రతిభే కారణం. కేవలం పాప్యులారిటీ వల్ల ఎవ్వరూ



ఇక్కడ సక్సెస్‌ను పొందలేదు. అదే నిజమైతే అమితాబ్ బచ్చన్ 'అబీ బేబీ' ఆల్బమ్ కూడా సక్సెస్ అయ్యివుండేది కదా' అని ఎదురు ప్రశ్నిస్తోంది.

'దునియా' లోని రెండు పాటల్ని రాగేశ్వరి మీదనే ఆమె సోదరుడు రిషభ్ దర్శకత్వంలో చిత్రీకరించాడు. కేవలం అతనిలో వున్న టాలెంట్‌ను దృష్టిలో పెట్టుకునే చిత్రీకరణకు అవకాశం ఇచ్చామని ఇదంతా 'ఫ్యామిలీ అఫైర్' కాదని రాగేశ్వరి ఖండించింది. ఏదేమైనా ఆ తర్వాత వచ్చిన రాగేశ్వరి ఆల్బమ్ 'ప్యార్ కా రంగ్' ఆశించిన స్థాయిలో సక్సెస్ కాలేదు. అయితే భారతీయ యువత మాత్రం ఆమెని తమ ప్రతినిధిగా గుర్తించింది. 2000 సంవత్సరంలో రాగేశ్వరి 'వై 2 కె సాల్ దో హజార్' పేరుతో ఓ ఆల్బమ్ తెచ్చింది. పాటలు, దానికి ఆమె తండ్రి ఇచ్చిన బాణీలకంటే అందులోని రెండు పాటలు చిత్రీకరణ దేశవ్యాప్తంగా ప్రేక్షకుల్ని అలరించింది.

**చేదు అనుభవాలు...**

జీవితం అంటేనే కష్టసుఖాల సంగమం... ముఖ్యంగా పదిమందిలో పేరు ప్రఖ్యాతుల్ని గడించిన వారు ఆ ఆటుపోటుల్ని తట్టుకోవడం ఒకోసారి ఎంతో కష్టమౌతుంది. కుటుంబం, ఆ కష్టాల నుండి బైట పడటం ఎంతో కష్టం. కొత్త మిలీనియం ఎంతోమందికి సుఖసంతోషాలను పంచి పెట్టిందో తెలియదు గానీ రాగేశ్వరికి మాత్రం విషాదాన్ని మిగిల్చింది. 2000 సంవత్సరం జనవరి 7వ తేది రాగేశ్వరికి 'ఫేస్ పెరాలసిస్' వచ్చింది. ఆ రోజుల్ని ఆమె తలుచుకుంటూ "ఇందాక చెప్పినట్టుగా నా జీవితంలో ఆరోహణవరోహణాలు ఎక్కువ. నటిగా, వీజేగా, గాయనిగా మలుపు తిరిగిన నా కెరీర్ గ్రాఫ్ వేగంగా పైకి వెళుతుంటే - అనుకోని ఈ అవాంతరం వచ్చిపడింది. నా ముఖం ఎడమవైపు కదలిక లేకుండా అయిపోయింది. నాకైతే పిచ్చి ఎక్కినట్టు అయిపోయింది. కుటుంబ సభ్యులు హాస్పటల్‌కి తీసుకెళ్ళారు. మూడు రోజులు డాక్టర్లు రకరకాల పరీక్షలు చేసి 'ఫేస్ పెరాలసిస్' అని తేల్చారు. దాని కారణంగా నరాల వ్యవస్థ కొద్దిమేర దెబ్బతింటుంది. ముఖ కవళికలలో మార్పు వుండదు. మనమనుకున్న భావాల్ని వ్యక్తం చేయలేం. ముఖంలో ఓ ఆనందం వుండదు - ఓ బాధా వుండదు... నిజంగా ఓ నటికి, గాయనికి అంతకంటే పెద్ద శిక్ష ఏముంటుంది" అని అంది రాగేశ్వరి. అయితే దేవుడి దయ, కుటుంబ సభ్యుల నిరంతర సహకారంతో ఆమె నిదానంగా కోలుకుంది. దాదాపు రెండేళ్ళ వ్యవధిలో రాగేశ్వరి తిరిగి మామూలు మనిషి అయ్యింది. ఇదివరకటి చలాకీదనం - గాత్రంలో స్పష్టత ఆమె పొందగలిగింది.

"నాలో ఆశాభావమే నేను మళ్ళీ మామూలు మనిషిని కావడానికి కారణం. అతి త్వరలోనే నేనో కొత్త ఆల్బమ్‌తో ప్రజల ముందుకు రాబోతున్నాను" అని ఆత్మస్థైర్యంతో చెబుతోంది రాగేశ్వరి.

**- వి. అరుణ సత్యవతి**




# రాజా ఆడియో రివ్యూ

**విడుదల : సోహన్ మ్యూజిక్**

**వెల : రూ. 30/-**

'షో' చిత్రంతో మన తెలుగువారికి జాతీయ స్థాయిలో గౌరవాన్ని కలిగించిన నీలకంఠ దర్శకత్వంలో సత్యం ఎంటర్‌టైన్‌మెంట్ బ్యానర్‌పై బి.సత్యనారాయణ నిర్మించిన 'మిస్సమ్మ' సినిమా ఆడియో క్యాసెట్ సోహన్ మ్యూజిక్ ద్వారా విడుదలయింది. వందేమాతం శ్రీనివాస్ ఈ చిత్రానికి సంగీత దర్శకుడు.

సాహితి రాయగా ఉదిత్ నారాయణ్, ఉష పాడిన 'నువ్వలా జిలిబిలి గువ్వలా నను కవ్వించకే రత్నమాల' పాటలో సంగీతం, సాహిత్యం, గానం, వాద్య గోష్ఠి అన్నీ సమతూకంలో నడిచాయి. ఇటీవలి కాలంలో ఏ హోరూ లేకుండా వచ్చిన యుగళ గీతమిది. ఉదిత్ నారాయణ్ తెలుగు ఉచ్చారణ కూడా భరించదగ్గ స్థాయిలో ఉండటం మరో విశేషం. టోటల్‌గా వినడానికి ఏ ఇబ్బందినీ కలిగించకుండా హాయిగా సాగిపోతుందీ గీతం.

భువనచంద్ర రాయగా వసుంధరాదాస్, బృందం పాడిన 'నే పాడితే లోకమె పాడదా' పాట- విన్నవెంటనే సూటిగా గుండెల్లో ముద్రించుకు పోయే పాట! ఒక్కసారి వింటే చాలు పదిసార్లకు తక్కువ కాకుండా హమ్ చేసుకొని సంగీత ప్రియులు బహుశా ఉండకపోవచ్చు. సాహిత్య పరంగా పాజిటివ్ అవుట్‌లుక్‌ని అతి తేలిక పదాలతో అందించిన భువనచంద్రని ఈ సందర్భంగా ప్రత్యేకంగా ప్రశంసించి తీరాలి. వసుంధరాదాస్ కూడా ఎంతో ఎక్స్‌ప్రెసివ్‌గా పాడింది. పదిమంది ముందు పాడగలిగే సభ్యతా విలువలతో చాలాకాలానికి వచ్చిన ఓ ఫిమేల్ సాంగ్ యిది.

ఇక ట్యూన్ పరంగా చాలా చెప్పాలీ పాట గురించి... హిందీ సినీ గీతరచయిత శైలేంద్ర వర్ధంతి సందర్భంగా ఈ సంచికలో 'అర్థం చేసుకుందాం- ఆస్వాదిద్దాం' శీర్షికన ప్రచురించిన 'అజీబ్ దాస్తాహైయే' పాట ఎక్కడైనా దొరికితే వినండి. 'దిల్ అప్నా ప్రీత్ పరాయి' సినిమాలోని ఆ పాట 'నే పాడితే లోకమే పాడదా' పాటకి ప్రేరణ.

శంకర్ - జైకిషన్ స్వరపరచగా లతా పాడిన ఆ హిందీ పాటని విన్నవారెవరైనా - వారి మాతృభాష ఏదైనా - వారికాపాట సాహిత్యం అర్థం కాకపోయినా - ట్యూన్ మాత్రం మర్చిపోలేరు. 'ఎన్నో పాటలకి ఇమిటేషన్ సాంగ్స్, పేర్లల్ సాంగ్స్ వచ్చేస్తున్నాయే... అలా ఈ 'అజీబ్ దాస్తా హై దిల్' పాటని గుర్తు చేసే విధంగా తెలుగులో ఒక్క పాటయినా లేదేంటి' అని బాధపడే ఎంతోమందికి (ఈ సమీక్షకుడితో సహా) ఈ పాట ఓ మంచి ఓదార్పు. ఒరిజినల్ ట్యూన్‌ని స్ఫురింప చేస్తూ 'అనుసృజనం' చేయటంలో వందేమాతరం శ్రీనివాస్ చక్కటి పనితనాన్ని కన్పరిచాడు. మోహనరాగం ఆధారంగా సాగిన ఈ పాటలో బీట్, పియానో, కోరస్‌లు అన్నీ చెవికి సేద తీరేలా సమకూరాయి. శంకర్ - జైకిషన్‌లు బ్రతికుంటే వందేమాతరంని కచ్చితంగా మెచ్చుకునేలా అతని నుండి దర్శకుడు నీలకంఠ మంచి వర్క్‌ని రాబట్టుకున్నాడు.

సాహితి రాయగా రాందాస్ పాడిన 'ఆకాశానికి ఆశల నిచ్చెన వేసెను మనవాడు' పాట ఓ సరదా విషాద గీతం. అంచేత 'పాతాళభైరవి' లోని పాప్యులర్ గీతం 'ప్రేమకోసమై వలలో పడెనే పాపం పసివాడు' పాట ట్యూన్‌ని పేరడీగా ఉపయోగించుకున్నారు. సాధారణంగా పేరడీ అనగానే ధ్వనించే వెకిలితనం - సాహిత్యంలో గాని, పాడే విధానంలో గానీ లేదు. సీరియస్ గానూ, సిన్సియర్ గాను చేశారు పేరడీని.

భువనచంద్ర రాయగా శంకర్ మహదేవన్, శ్రియా గోషల్ పాడిన 'ఎంత సుఖమిదో మనోహరా' పాట ట్యూన్ పరంగా చాలా డెప్త్ వున్నపాట. సామరాగంలో రూపుదిద్దుకున్న చరణాలు, ఆ చరణాల్లో విరుపులు (ఔ... నా... ప్రియసఖి, దా.... సోహం తరుణి సొగసుకి లాంటివి) బాగా ఆకట్టుకుంటాయి. శ్రేయగోషల్, శంకర్ మహదేవన్‌ల గళాలు కూడా సామరాగాన్ని ఎక్స్‌ప్రెషన్స్‌తో పండించటంలో చక్కగా కుదిరిపోయాయి. పాట వింటుంటే- 'గీతాంజలి' సినిమాలో 'ఓం నమః అధరసుధరలకు' పాటా, 'దొంగదొంగ' సినిమాలో 'తీ.... తీయని' పాటా.... చిత్రీకరణ పరంగా గుర్తొస్తాయి. బహుశా మణిరత్నం టేకింగ్ ఇన్‌స్పిరేషన్‌తో దర్శకుడు దగ్గరుండి పనిగట్టుకు మరీ చేయించుకుంటే ఇలాంటి ట్యూన్‌లు వచ్చేయనిపిస్తుంది.

సాహితి రాయగా కార్తీక్, నిష్మ పాడిన 'అందాల గుమ్మారో ఆ బాపు బొమ్మారో నా యింటి చిలకమ్మా' పాట కూడా చక్కని అభిరుచికి అద్దం పట్టే యుగళ గీతంగా పేర్కొనాలి. ఈ పాటను వింటుంటే తెలుగు తమిళ సినీసంగీత ప్రియులకి 'నెల్లూరి నెరజాణ' (ఒకేఒక్కడు) పాట గుర్తుకు రావచ్చు. హిందీ పాటలు వినేవాళ్ళకి 'మెరె జానే జానా జానా తుఝే ప్యార్ కియా' అనే పాటలో గల 'ప్యార్ నహి కర్‌నా, ప్యార్ నహి కర్‌నా, క్యోం మెరే పీఛే ఆయే, కైసా పాగల్ ఆషిక్ హై తూ కౌన్ తుఝెు సమ్‌ఝాయే నకర్ దీవానా పన్' లైన్లు గుర్తుకురావచ్చు. ఇంగ్లీష్ పాప్ ఆల్బమ్స్‌తో పరిచయం వున్న వాళ్ళకి 'స్టీరియోనేషన్' గ్రూప్' వాళ్ళు సమర్పించిన 'ఓ బేబీ డోన్ట్ బ్రేక్ మై హార్ట్ ఐ హావ్ బీన్ వెయిటింగ్ ఫర్ ఎ లాంగ్ టైమ్' అనే గీతం గుర్తుకు రావచ్చు. ఏది ఏమైనా ట్యూన్ పరంగా, గానం పరంగా ఇదొక మంచి అడాప్టేషన్ - ఎందుకంటే అడాప్ట్ చెయ్యటంలో కూడా - ఒరిజినల్‌కి పేర్లల్‌గా వుండేలా చెయ్యటం అనేది మాటలు కాదు. సాహితి కూడా సాహితీ మర్యాదలు దాటకుండా మంచి సాహిత్యాన్ని అందించాడు.

ఈ సినిమా టైటిల్ రోల్‌ని దృష్టిలో నుంచుకుని ఆ పాత్ర వ్యక్తిత్వం ప్రతిబింబించేలా సాహితి రాసిన పాట - 'అచ్చం తెలుగు, ఇంటికి వెలుగు, అమ్మాయండి మిస్సమ్మ'! అలనాటి 'మిస్సమ్మ'లోని 'బృందావనమది అందరిది గోవిందుడు అందరి వాడేలే' పాట ట్యూన్‌ను ఈ పాటకు సగౌరవంగా వాడుకోవడం జరిగింది. 'నేటి మిస్సమ్మ' లోని ఈ పాట వింటే ఎవరికైనా అనిపిస్తుంది - 'నాటి మిస్సమ్మ' లోని ఆ పాటను గౌరవంతోనే వాడుకున్నారని. అందుకు బాలూ పాడిన పద్ధతి, సాహితి సాహిత్యం పూర్తిగా సహకరించాయి. 'అందరిపైనా అమెరికాలాగ అమ్మో కస్సుబుస్సమ్మా/ సృష్టించిన ఆ బ్రహ్మకు కూడా అంతే చిక్కని ప్రశ్నమ్మా' వంటి లైన్లు పాటపై గల సదభిప్రాయాన్ని మరింత పెంచేలా ఎంతో సరదాగా జతపడ్డాయి.

వున్న అన్ని పాటల్నీ హాయిగా వినిపింప చేసిన ఆడియో యిది. ■



రచన : సాహితి (1) గానం : ఉదిత్ నారాయణ్, ఉష

అ: నువ్వలా జిలిబిలి గువ్వలా నను కవ్వించకే రత్నమాల
ఆ: కూయకే అల్లరి కోయిలా ఆమని ముందరా ఈ తొందరేలా
అ: పొంగుతున్న నాలో ప్రేమ ఇంద్రధనుస్సు నువ్వేనమ్మా
నింగి వీడి వయ్యారంగా రావే
ఆ: మక్కువంత నీపై ఉన్నా చుక్క పొద్దు పొడిచేదాకా
పక్కకింక రాలేనయ్యో నేనే...
అ: అంతదాక ఇంత దూరమా....
అబ్బ నీ చెంతనే విరహమా ॥నువ్వలా॥
అ: సరికొత్త ప్రియసఖిలాగా నిను కోరేనూ నే ప్రతి రోజు
ఆ: గది బైట మన సడి చూసి పడి నవ్వేనూ ఆ నెలరాజు
అ: దోర ఆశలన్నీ పూశాయి మల్లెపూలు
ఆ: చాటు మాటు లేని సరసాలు చాలు చాలు
అ: ఊసులాడమంటు పిలిచాయి జాజిపొదలు
ఆ: వేళకానివేళ మారాము చేయవలదు
అ: రగిలే వగలే సెగలై రేగిపోయే మోజులు
ఆ: లాలాలాల అ: ॥నువ్వలా॥
అ: బజ్జోమ్మా
బేబి: నాకు నిద్దర్రావట్లే డాడీ
అ: బజ్జోమ్మా ప్లీజ్
బేబి: నాకు నిద్దర రావట్లే
అ: కళ్ళు మూసుకో అదే వస్తుంది
బేబి: ఊహూ... నాకో కథ చెప్పు
అ: నాకు మూడ్ లేదురా
బేబి: ఐతే నేను నిద్రపోను
అ: సరే....
అనగనగా ఒక మహరాజు తన జత కలిసే ఒక మహరాణి
ఆ: ముచ్చటగా వారొక జంటై శృతి కలిపారు సరసాలన్నీ
అ: రాణి రాజు వంక రంభల్లె చేరుకోగ
ఆ: రాజు రాణిగారి లేనడుమునల్లుకోగ
అ: రేయి చందనాల వసంత కేళిలోన
ఆ: హాయి శోభనాల సుఖాల తేలిపోగ
అ: మనసే బృందావనిలా పరవశించె నేడిలా
అ: జంటగా సరసములాడగా సమయము కుదిరినే రత్నమాలా
ఆ: సుందరా విరి పూబంతిలా సందిట వాలనా నందగోపాలా..

అభినయం
శివాజీ, లయ

రచన: భువనచంద్ర (2) గానం : వసుంధరాదాస్, బృందం

ప: నే పాడితే లోకమే పాడదా
నే ఆడితే లోకమే ఆడదా ॥నే పాడితే॥
నేనుంటే హోయ్ హోయ్ నాలోనే ఉంది జాయ్
మజాగ మస్త్ మారో యారో ॥నే పాడితే॥
చ: సంతోషమే సగం బలం
నవ్వే సుమా నా సంతకం
నిరాశనే వరించనీ సుఖాలకే సుస్వాగతం
నవ్వుల్లో ఉంది మ్యూజిక్
పువ్వుల్లో ఉంది మ్యాజిక్
లేదంటే ఏ లాజిక్
ఈ లైఫే ఓ పిక్నిక్
ఆ సూర్యుడు... చంద్రుడు...
మంచుపైన వాలు వెండి వెన్నెలా.. నా దోస్తులే ॥నే పాడితే॥
చ: ప్రతి క్షణం పెదాలపై ఉప్పొంగనీ ఉల్లాసమే
అనుక్షణం నా గుండెలో ఖుషీ ఖుషీ కేరింతలే
చెప్పాలనుంటె సే ఇట్
చెయ్యాలనుంటె డూ ఇట్
లైఫ్ ఈజ్ ఎ సాంగ్ సింగ్ ఇట్
నిరంతరం లవ్ ఇట్
వసంతమై వర్షమై గాలిలోన తేలు పూల తావినై... తరించనీ
॥నే పాడితే॥

అభినయం
భూమిక



రచన: భువనచంద్ర (3) గానం : :శంకరమహదేవన్, శ్రియాగోషల్

ఆ: ఎంత సుఖమిదో మనోహరా
అ: జంట సుఖమిదే ప్రియం వదా
ఆ: ఓపలేనురా యీ లాలస
అ: ఒడికి చేరవే అభిసారికా
ఆ: జాలమే తగదురా రా... రా... రా... రా...రా... ॥ఎంత॥
ఆ: ఈ మధుమాసం అహో పిలిచిందీ ప్రియా దరికిరా....
అ: ఔనా... ఓ ప్రియసఖి దాసోహం తరుణి సొగసుకి
ఆ: జోడించెయ్ తనువునీ తాపంతో రగులు తనువుకి
అ: తనువూ మనసూ సకలం నీవేగా ఆ : ॥ఎంత॥
అ: నీ ప్రియ రూపం చెలి సుఖసారం ఇలా ఒదిగిపో
ఆ: నీలో నీ సగముతో నాలో నీ సగమె కలవని
అ: శృంగార కేళిలో ఆనందం వెల్లివిరియని
ఆ: తెలుసా మదనా ఇదియే రతివేదం ॥ఎంత॥

అభినయం
శివాజీ, భూమిక

రచన: సాహితి **4** గానం : రాందాస్

అభినయం
శివాజీ

ప: ఆకాశానికి ఆశల నిచ్చెన వేసెను మనవాడు
ఔరా క్రేజీ మొనగాడు
తలచినదొకటి జరిగినదొకటి కాగా ఈనాడు
అయ్యో ఖంగే తిన్నాడు
టైము పాములా కాటు వేయగా
నడివీధిలో తను ఒంటరిగా.... ఓ ఓ ఓ....ఓ ఓ ఓ ఓ
బ్రతుకుదారి మరి ఏదీ తెలియని
బాధ గుండెలో రేగంగా
సతమతమయ్యే వేదనతోనే లైఫ్ టెన్షనే పెరగంగా ॥ఆకా॥
చ: కందగడ్డకు లేని దురద ఆ కత్తిపీటకు ఎందుకులే
గుట్టుగ దాచిన రహస్యాలనే బట్టబయలునే గావించే
సైంధవ శాస్త్రి అడ్డును దాటి సొంత గూటికే పోలేక ॥ఆకా॥
చ: డింభకుడా నువు చిక్కితివనుచు నమిలి మింగెడి మాయావి
ఓరి జిమ్మడ తగలడు అనుచు చీపురు దులిపిన సావిత్రి
ఇద్దరి మధ్యన నలిగిపోతూ ఇక బ్రహ్మదేవునిదే భారమని ॥ఆకా॥



రచన : సాహితి **5** గానం : కార్తీక్, నిష్మా

అభినయం
శివాజీ, లయ

అ: అందాల గుమ్మరో ఆ బాపు బొమ్మరో నా ఇంటి చిలకమ్మ
కోపాలు మాని మురిపెంగ నన్నే చేరింది ఈ వేళ
ఆ లేత చెక్కిళ్లల్లోన హాయ్ హాయ్ హాయ్ హాయ్
చిక్కింది నా గుండె కూన హాయ్ హాయ్ హాయ్ హాయ్
ఆ లేత చెక్కిళ్లల్లోన చిక్కింది నా గుండె కూన
మల్లెల్లో ఆ చుక్కతోన మళ్లీ పక్కేయ్‌నా ॥అందాల॥
అ: కిలకిల నీ నవ్వుల్లో ముత్యాలెటు దాచావో
నోటి పలుకై జారిపడితే ఏరుకుంటానులె...ఓ ఓ ఓ
ఆ: మిల మిల నీ కనులు
పిలిచేటి పిలుపులకు
రేయి పగలు పూలపడకై వేచి వున్నానులె
అ: నీ ముద్దే లేకుంటే నా పొద్దే పోదమ్మో
ఇన్నాళ్ల నా బాకీ వడ్డీతో కట్టమ్మో
ఆ: నా ఆశే నీ కోసం విరబూశా లేవయ్యో
వడ్డీతో పరువాలే వడ్డిస్తా రావయ్యో
అ: కొంగు చూడ ఏదో కొత్త గుందిలే
ఆ: గోగుపూలు పూచే పండువెన్నెలే
అ: ఎప్పుడంటే అప్పుడే కొప్పునెడత మల్లెలే ॥అందాల॥
ఆ: గిలగింతగ నినుచేరి పులకించని ప్రతి రేయి
కంటిపైన కునుకు లేక వేగిపోయానులే...ఓ ఓ ఓ
అ: చిరు అలకల అలివేణి నీ చిరు బురు సెగలన్నీ
చల్లబడగా చెల్లుబడిగా కౌగిలిస్తానులే..హాయ్
ఆ: తేలాలి ఆనాటి అచ్చట్లో ముచ్చట్లో
చేరాలి గువ్వల్లా గోరింట గుబురుల్లో
అ: రవ్వంత చోటిస్తే కవ్విస్తూ ఓ పిల్లో
కేరింత కొట్టిస్తా రేయంతా నీ ఒళ్లో
ఆ: ఇంత మంచి సమయం మళ్లీ రాదులే
అ: గుర్తు వచ్చె ఇప్పడే పెళ్లి రోజులే
ఆ: ముద్ద బంతి పువ్వులా విచ్చుకున్న మోజులే ॥అందాల॥



రచన: సాహితి **6** గానం : యస్పీ బాలసుబ్రహ్మణ్యం

అచ్చం తెలుగు - ఇంటికి వెలుగు - అమ్మాయండి మిస్సమ్మ ॥2॥
అందరిలాగ కాకుండా - తను ఎంతో వింతౌ - మనిషమ్మా ॥2॥ ॥అచ్చం॥
మిలమిల వయసుల - మిసిమిసి సొగసుల - శశిరేఖే ఈ మిస్సమ్మ
చిరుచిరు నగవుల తోటలో - ఎగిరే సీతాకోకా చిలకమ్మా ॥అచ్చం॥
ఎన్నో రంగులు - అన్నీ హంగులు - కలిగిన పడతీ మిస్సమ్మా
ఎవరి మాటను - లెక్కేచేయని - మహాపెంకి తల బిరుసమ్మా ॥అచ్చం॥
అందం -చదువు - డబ్బులు - అన్నిట నెంబరువన్నీ మిస్సమ్మ
అందరిపైనా - అమెరికా లాగ - అమ్మో కస్సుబుస్సమ్మా ॥అచ్చం॥
ఏదేమైనా - తుదకేమైనా - మొత్తానికి మన మిస్సమ్మా
సృష్టించిన ఆ బ్రహ్మకు కూడా - అంతే చిక్కని ప్రశ్నమ్మా ॥అచ్చం॥




## తారాగణం

భూమిక, లయ, శివాజీ, తనికెళ్ల భరణి, శరత్‌బాబు, ఎం.ఎస్.నారాయణ, ఎల్.బి.శ్రీరాం, బెంగుళూరు పద్మ, జయప్రశాంత్ సింగ్, బేబి నిక్షిప్త, రఘుబాబు తదితరులు


విందాల ఫణిశేఖర్ రెడ్డి


బి.సత్యనారాయణ


నీలకంఠ


వందేమాతరం శ్రీనివాస్


సాహితి


భువనచంద్ర

## సాంకేతిక నిపుణులు

| | |
|---|---|
| సమర్పణ | : విందాల ఫణిశేఖరరెడ్డి |
| కెమెరా | : జవహార్‌రెడ్డి |
| ఎడిటింగ్ | : నాగిరెడ్డి |
| ఆర్ట్ | : కె.వి.రమణ |
| స్టిల్స్ | : నారాయణ.జి |
| డ్యాన్స్ | : తార, స్వర్ణ |
| పి.ఆర్.ఓ | : యల్. వేణుగోపాల్ |
| పబ్లిసిటీ | : సుజీత్ |
| ప్రొడక్షన్ మేనేజర్ | : జి.మూర్తి |
| గ్రాఫిక్స్ | : శ్యామ్ |
| కో-డైరక్టర్ | : కె.వేంకట రమేష్ |
| అసిస్టెంట్ డైరక్టర్స్ | : తీగల రఘుకుమార్, బాలకృష్ణ |
| చీఫ్ అసోసియేట్ డైరక్టర్ | : జి.రమాదేవి |
| సంగీతం | : 'వందేమాతరం'శ్రీనివాస్ |
| నిర్మాత | : బి.సత్యనారాయణ |
| కథ, స్క్రీన్‌ప్లే, మాటలు, దర్శకత్వం | నీలకంఠ |

# మనసులోని మాట

**16-30** నవంబరు 'హాసం' సంచికలో సంపాదకీయం అభినందనీయం. పరిశ్రమకి గాని ప్రేక్షకులకి గాని ఆఖరికి ఆ పాటలు రాస్తున్న వాళ్ళకి గాని పట్టని ఈ విషయాన్ని తలకెత్తుకుని ప్రస్తావించిన 'హాసం'కి నా కృతజ్ఞతలు. సంపాదకీయంలో చెప్పినట్టు రాయల్టీ విషయాలు దేవుడెరుగు కనీసం ఏ పాట ఎవరు రాశారో కూడా ఎవరికీ తెలియని విధంగా ఇవాళ అయోమయస్థితి వుంది. టీవీలో ఏ ఛానల్ చూసినా ఒక్క తెలుగు తప్ప మరే ఇతర భాషకైనా సంగీత దర్శకులు, పాడినవారితో పాటు రాసిన కవి పేరు కూడా తప్పనిసరిగా వుంటుంది. తెలుగు ఛానల్స్‌ల్లో కవి పేరు కలికానికైనా కనబడదు. ఈ ఉపేక్షని ఏ ఒక్కరూ పట్టించుకున్న



(తరువాయి 42వ పేజీలో...)

చిన్నతనంలో వాల్‌పోస్టర్ మీద సముద్రాల, శ్రీశ్రీ, ఆరుద్ర, ఆత్రేయ వంటి మహానుభావుల పేర్లు చూసి అలా నా పేరు కూడా చూసుకోవాలన్న ఉత్సాహంతోనే నేను సినీఫీల్డ్‌కొచ్చాను. కొన్ని సంవత్సరాల పాటు చూసుకుని ఆనందించాను కూడా! కానీ పరిస్థితి యిప్పుడు ఘోరంగా తయారయింది. వాల్‌పోస్టర్ మీద సింగిల్ కార్డ్ రచయిత పేరు కూడా కనబడని దౌర్భాగ్యం నేడు నెలకొంది. ఆడియో క్యాసెట్ ఇన్‌లే పరిస్థితీ అంతే.... క్రెడిట్స్ సరియైన రీతిలో ఉండటం లేదు. ఈ విషయాన్ని అనేకసార్లు చెప్పినా పట్టించుకున్నవారు లేరు. మరో విషయం - ఆడియో ఫంక్షన్ అనేది ముఖ్యంగా నిర్మాత, దర్శకుడు, సంగీత దర్శకుడు, గీతరచయిత, గాయనీ



(తరువాయి 42వ పేజీలో...)

**16-30** నవంబరు 2003 సంచికలోని సంపాదకీయంలో సూచించిన సలహా చాలా బాగుంది. ఎవరు ఏ పాట రాశారన్న విషయం ప్రేక్షకులకు తెలియాల్సిన అవసరం ఎంతైనా వుంది. ఆ విషయాన్ని మీరు గుర్తించి, మేము కూడా గుర్తించేలా చేసి, మమ్మల్ని సమాయత్త పరిచినందుకు మీకు నా ధన్యవాదాలు.

నేను ప్రస్తుతం పాటలు రాస్తున్న బెల్లంకొండ సురేష్ గారికి యీ విషయం చెప్పి వారి చిత్రాలలో ఎవరు ఏ పాట రాశారన్నది స్పష్టంగా టైటిల్ కార్డ్స్‌లో వెయ్యమన్నాను. ఆయన దానికి అంగీకరించారు. అలాగే మరికొంతమంది నిర్మాతలకు కూడా తెలియజేయడం జరిగింది. అందరూ సానుకూలంగా స్పందించారు.

పత్రికాముఖంగా మరొక్కసారి మీకు, మా నిర్మాతలకు నా ధన్యవాదాలు.

\- చంద్రబోస్



గతపక్షం 'హాసం' ఎడిటోరియల్‌లోని అంశం సినీ గీత రచయితల నందరినీ ఒక్కసారి ఆలోచింపచేసిందది. మరోసారి రచయితల పక్షాల నిలిచిన 'హాసం'కి కృతజ్ఞతలు.

సినిమా సక్సెస్‌కి పాట - తనవంతు బాధ్యతను ఎప్పుడూ భుజాల మీద మోస్తూనే వుంది. అయితే ఆ బాధ్యత ఈ మధ్యకాలంలో మరింత పెరిగింది. కొత్త కొత్త ఎక్స్‌ప్రెషన్స్‌తో ప్రేక్షక శ్రోతలను కట్టిపడేసే దిశగా తీవ్రమైన కృషిని గేయ రచయితలు చేస్తూనే వున్నారనేది వాస్తవం. దీనిని దర్శక నిర్మాతలు గుర్తిస్తూనే వున్నారు. కానీ గేయ రచయితలకు అందాల్సిన గౌరవం అందుతోందా? అంటే ప్రశ్నార్థకమే. ఆ మధ్య నేను ఓ సినిమాకి పాట రాశాను. ఆడియో కేసెట్ చూశాక నా పేరు కనిపించలేదు. ఆ స్థానంలో



(తరువాయి 42వ పేజీలో...)

(41వ పేజీ తరువాయి...)



దాఖలాలు లేవు. సృజనాత్మక కళాకారుడైన కవి కేవలం కలం కూలీగా మిగిలిపోతున్నాడు. అంగట్లో సరుకులాగ అయినకాడికి తన అక్షరాన్ని అమ్ముకుని కిమ్మనకుండా ఊరుకుంటే అది భాషనీ కవినీ సాహిత్యాన్నీ చిన్న చూపు చూస్తున్నట్టే లెక్క. 'హాసం' సంపాదకీయం ఈ ఆదమరపు నుంచి సంబంధిత వ్యక్తులందర్నీ మేలుకొలుపుతుందని ఆశిస్తూ ఆ సుప్రభాతాన్ని ఆలపించిన 'హాసం'కి మరోసారి అభివందనాలు తెలియచేస్తూ...

**'సిరివెన్నెల' సీతారామశాస్త్రి**



గాయకులకు సంబంధించినది. నాయికానాయకులు ఆ ఉత్సవానికి అదనపు విలువలు తెస్తారు కనుక వారిని గౌరవించడం సబబే. నేటి పరిస్థితి ఏమిటంటే చాలా ఫంక్షన్స్‌లో పాటల రచయిత(లు) కనబడరు. గాయనీ గాయకులు కనబడరు. రచయితలను పిలిచే సంప్రదాయాన్ని ఏనాడో మర్చిపోయారు సరికదా ఏ పాట ఎవరు రాశారో చెప్పడం కూడా చెప్పరు. అలాగే రివ్యూలలో (ఒక్క 'హాసం'లో తప్ప) పాటల పల్లవులుంటాయి గాని రచయితల పేర్లను ప్రస్తావించటం మాని చాలాకాలమైంది. అత్యంత బాధాకరమైన విషయం ఏమిటంటే కొన్ని మంచి కంపెనీలు తప్ప రచయితలకి కాంప్లిమెంటరీ క్యాసెట్లు కూడా పంపరు. మేం రాసిన పాటల క్యాసెట్స్‌ని మేమే కొనుక్కునే పరిస్థితి వచ్చినందుకు నవ్వాలో ఏడవాలో కూడా తెలియటం లేదు. నేటి రచయితలలో ఎంత నిర్లిప్తత చోటు చేసుకున్నదంటే మా పారితోషికం మాకందింతే చాలన్న అల్పసంతోషులమయ్యాం. నేనెవ్వరినీ తప్పుపట్టాలనో ఎండగట్టాలనో ఇదంతా వివరించటం లేదు. ఒక సత్సంప్రదాయాన్ని మళ్ళీ నిలబెట్టమని పెద్దలకు వినయంగా మనవి చేసుకుంటున్నాను.

**భువనచంద్ర**



బి.రామ్‌కుమార్ అని వుంది. ఒక్కసారి 'షాక్' అయ్యాను. పాటల రచయితగా నా పేరు కేసెట్స్ మీద, స్క్రీన్ మీద చూసుకోవాలని, చేస్తున్న ఉద్యోగాన్ని వదిలిపెట్టి రచయితగా కెరీర్‌ను ప్రారంభించిన తొలి రోజుల్లోనే ఇలా జరగడం నేను మరిచిపోలేను. ఇంకోసారి మరో భారీ చిత్రానికి పాట రాస్తే కేసెట్ మీద నా పేరుని సరిగ్గానే ప్రింట్ చేశారు గానీ, స్క్రీన్ మీద కె.రవికుమార్ అని వేశారు. ఇవన్నీ అంత సీరియస్సా అని ఎవరైనా అనుకోవచ్చేమో గానీ పాట కోసం పగలూ రాత్రీ కూర్చొని ఒక రూపాన్ని తీసుకొచ్చే రచయితలకి 'క్రెడిట్' దక్కకపోవడం బాధగానే వుంటుంది.

డి.రామానాయుడు గారు తీసే సినిమాల్లో రచయిత పేరుని, ఆ పక్కనే బ్రాకెట్‌లో ఆ రచయిత రాసిన పాటలను ఉదహరిస్తున్నారు. నాకు తెలిసి ఇలా గీత రచయితలు ఎవరు ఏ పాట రాశారో క్రెడిట్ కార్డ్‌లో స్పష్టంగా పేర్కొనడానికి - దర్శక నిర్మాతలకు - ఎలాంటి అభ్యంతరాలూ వుండవు.

సినిమా పరిశ్రమకు వెన్నెముక లాంటి దర్శక నిర్మాతలు తప్పకుండా గేయ రచయితల గురించి ఈ దిశలో ఆలోచిస్తారనే ఆశతో....

**- భాస్కరభట్ల రవికుమార్**



# కొమ్మ కొమ్మకో సన్నాయి...

## పాటసారి దైరీలోంచి....



పువ్వులెన్నివున్నా వంగవంగడపు వాసినీ వాసనను రజనీగంధ కుసుమంలోనే చూస్తారు బెంగాలీలు - ఎన్నికాయలున్నా అవి ఎన్నెన్ని కాపులు కాసినా నారికేళంలోనే భూగోళాన్ని చూసుకుంటూ జీవిత వలయాన్ని చుట్టుకుంటారు కేరళవాసులు. దేవతలు, దేవుళ్లూ ఎందరున్నా ఆవలింత వచ్చినా, ఆనందం వచ్చినా ఆపదే వచ్చినా 'మురుగా' అని సుబ్రహ్మణ్యేశ్వర స్వామినే తలుస్తారు తమిళులు.

చిన్నప్పుడు, పడుచప్పుడు, పెద్దప్పుడు ఎప్పుడైనా సరే ఇంటగాని బైటగాని తన భాష తాను మాట్లాడడం తప్పనుకునే గొప్పవాడు మాత్రం తెలుగువాడు. తెలుగునాడు తెలుగునేడూ కూడా వాడంతే - మారడు.

సినీగీతరచనకు దూరంగా, 'నేనూ నాదీ నా కోసం' అనే స్పృహ నా తీరంగా రాసుకున్న పాటలు కొన్ని 'గీతాంజలి' పేర కాసెట్టుగా వచ్చాయి. వాటిలో 'శ్రీవేంకటేశ్వర పదములు' అని నేను రాసిన గీతాలు స్వరబ్రహ్మ అమృత హస్తాలతో పులకించి పూజా కుసుమాలు అయినాయి. అలాగే 'భద్రాచల శ్రీరామ పట్టాభిషేకం' చక్రవర్తి స్వరకల్పనలోను, 'స్వామియే శరణం అయ్యప్ప' రాజుకోటి సంగీతంతోను వెలువడ్డాయి. 'కబీర్‌వాణి' కూడా చక్రవర్తి స్వరకల్పనలోనే వినిపించడం జరిగింది.

'అఘమను కులమున పుట్టితిని
అహమను మతమును పట్టితిని
ఇహమే స్థిరమని నమ్మితిని
పరమే పరులకు అమ్మితిని
గగన వీధిలో కెగసితిని
కడలి లోతులే తరచితిని
స్వల్పమైన ఈ దేహ శిల్పమున
అల్పజీవినని మరచితిని'

తప్పుదారులలో తప్పటడుగులు వేస్తున్న జీవుడు ఆత్మనివేదన భగవంతుడి ముందు చేసుకోవడానికి ఎన్నో మార్గాలు - భక్తి ఒక మార్గమైతే అది తొమ్మిది విధాలు. పైన పేర్కొన్న పదం ఏ పథానికి చెందుతుందో తెలియదు గానీ, అందులో కానవచ్చే నిజాయితీ నాకు కల్పనా శిల్పానికి దూరంగా వికసించిన భావ పుష్పంగా కనిపిస్తుంది.

'మనిషిగ పుట్టెను ఒక మట్టి - తన
మనుసు పెంచిన దేమట్టి
మానై పుట్టెను ఒక మట్టి - మరి
పూవై పూసిన దేమట్టి - విరి
తావై వీచినదే మట్టి
అటనట నిలిచెను ఒక గగనం - తన
ఘటమున నిండినదే గగనం
ఘటనాఘటనల నడుమ బ్రతుకులో
మెరుపులు మెరిసినదే గగనం
పంచభూతముల పంజర శుకమై
అలమట చెందిన నేనెవరో
ఏడుకొండల ఎత్తున నిలిచి
బదులే పలకని నీవెవరో
ఇంతకు నాకు నీవెవరో'

పువ్వును దాని రంగులను దాని ఆకార సౌకుమార్యాన్ని చిత్రించగలిగిన కుంచె ఆ పువ్వు వెదజల్లే పరిమళాన్ని చిత్రించగలదా? దాని ఘుమఘుమను రూపించి చూపగలదా? అక్కడొక శూన్యం రాక తప్పదు. అది ఆత్మానుభూతిగా అవగతమయ్యే దివ్య దర్శనం. కవిసమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణ గారన్నట్లు 'ఊహావధిక్షమ హేలామధుయానముల్ చేసినప్పుడు, చేయగలిగినప్పుడు మాత్రమే కలిగే సాక్షాత్కారమది.

పదాలపొహళింపుతోను స్వరాల మేళవింపుతోను పుట్టుకొచ్చే పాటలు మానసోల్లాసం కలిగిస్తాయి - ఆత్మదాహం తీర్చలేవు. విశ్వనాథవారి 'ఋతుసంహారం'లోను, కొడాలి సుబ్బారావు 'హంపీక్షేత్రం' లోను, శిష్టా ఉమామహేశ్వరరావు 'నవమిచిలుక'లోను, వేదులవారి 'దీపావళి'లోను తల్లావఝ్ఝుల, జాషువా, కరుణశ్రీల లోను, నండూరి గొంతులోను దర్శనమిచ్చే ఒక తీరని తపన (బహుశా అదే విశ్వనాథవారు చెప్పిన 'జీవుని వేదన' కావచ్చు) ఆత్మకు అద్దం పడుతుంది. అనాగతమైన అనుభవానికి అర్థం చెబుతుంది. పులకింతల పురాణమై కట్టుకథేనా అన్న నిస్పృహ మిగిల్చి దైనందిన జీవిత భూతం ముందు పడేసి వెళ్లిపోతుంది.

సినిమా రంగంలోకి రాకముందు నెల్లూరులో ఔత్సాహిక కళాకారులు కొందరు టౌను హాల్లో ప్రదర్శించిన 'దేవదాసు' స్టేజినాటకానికి పాటలు నన్ను వ్రాయమని కోరడం జరిగింది. విలియమ్స్ అనే హార్మోనిస్టు, చాలా మంచి సంగీతజ్ఞుడు. ఆ నాటకంలో పాటలను ట్యూన్ చేశాడు. అవి మధురాతి మధురాలు. ఆనాడు నేను దేవదాసు పాత్రను, అతని భగ్న ప్రేమను, విధి చేత విజితమైన జీవితాశలోనుంచి పుట్టుకొచ్చిన జన్మ వైరాగ్యాన్నీ అతని స్వరాలలోను నా పదాలలోను చూసుకున్నాను. ఈ విలియమ్స్ రంగస్థలానికీ, కిరాయి నాటకాల వేదికలకీ, కావలి ఒంగోలు గుంటూరు నెల్లూరు బస్తీలకే పరిమితమై వేదిక మీదనే 'హరిశ్చంద్ర' నాటకానికి హార్మోనియం వాయిస్తూ అనంత వాయివుల్లో ఆయువును కలిపేసుకున్నాడు.

'అంతా సుఖమేనోయ్ బ్రతుకే
వింత అనుభవమోయ్
ఆరిపోయిన ఆశలలోన
ఆరు రుతువులూ ఒకటేనోయ్
'కలనిజమా నిజము నిజమా
కలా నిజమూ కలేనా'
'వసగొంతున కోయిలా
కొసరి కొసరి కూయకే
వసంతమే వచ్చిందని
వలపులు కలబోయకే
మూడునాళ్ల ముచ్చట యిది
మోడులు నవ్వే పండుగ
ఎగసి పొడకే గుండెలు
రగిలే వేసవులుండగ'

ఇత్యాది 'దేవదాసు' నాటక గీతాలు, వాటికి కట్టబడిన బాణీలు మరపురాని మధురిమలు - అలాగే సిరికాకొలను చిన్నది' రేడియో సంగీత నాటికకు శ్రీ పెండ్యాల నాగేశ్వరరావుగారు అలదిన స్వరపరిమళం 'ఆకాశవాణి' విద్వాంసులు, ప్రయోక్తలనే పరవశం చేసింది.

'ప్రాదేశిక సుగమ సంగీతం' అనే పేరుతో నేను నిరుద్యోగినై అనేక సందర్భాలలో కొందరు పెద్దల వాత్సల్య సాంగత్యాలతో కొన్ని కొన్ని ప్రదేశాలలో పర్యటిస్తున్నప్పుడు కలిగిన స్పందనను కవితలుగా రాసుకున్నాను.

ముక్త్యాల రాజాగారు ముచ్చటపడి అనేక ప్రాంతాలకు నన్ను వెంటపెట్టుకుని వెళ్లేవారు. నంది కొండలలో ఒకసారి (అప్పటికి నాగార్జునసాగర్‌కి శంకుస్థాపన జరుగలేదు) సుప్రసిద్ధ చిత్రకారుడు శ్రీ హెచ్.వి.రామగోపాల్‌నీ, నన్నూ వెంట పెట్టుకుని అనేక సుందర ప్రకృతి దృశ్యాలు చూపించారు. అక్కడ శిల్పాలను చూస్తూ, కృష్ణవేణమ్మ సౌందర్యాన్ని చూస్తూ కళ్లతో ఆయువు నింపుకున్న సన్నివేశాలవి. అదొక బుద్ధ భూమి - ముక్కులూ, చెవులూ విరిగిన విషాద శిల్పవీణల సంగీత సభ - రామ్‌గోపాల్ బొమ్మలను గీస్తుంటే నేను కవితలు రాసేవాడిని. ఆ బొమ్మలూ, ఈ కవితలూ కొన్ని 'కృష్ణాపత్రిక'లో అచ్చుపడ్డాయి. మిగతావన్నీ ఈనాడు సాగరగతమైన శిల్పాలవలెనే కాలసాగరంలో మునిగిపోయాయి.

'ఈ పర్వత సర్వత్రా
ఎటుచూస్తే అటు చరిత్ర
క్షతగాత్రం ప్రతి శిల్పం
మృతి ఎరుగని సంకల్పం
కృష్ణవేణి ఝుళంఝుళల
కఠినశిలల ఘలంఘలల
కపిలవస్తు గాథామృత
కలశాలను ఎత్తుకున్న
గతకాలపు స్మృతులెన్నో
స్వాగతాలు పలుకునిచట-'

అటు తర్వాత 'గీతాంజలి' చిత్రానికి పాటలు రాసే సందర్భంలో ఒక్కసారిగా నాకు ఆ పరిసరాలు గుర్తుకువచ్చే సన్నివేశం చెప్పారు మణిరత్నం. 'నందికొండ వాగుల్లోన నల్లతుమ్మ నీడల్లో' అనే పల్లవి అక్కడ పొద్దుకూకే వేళ కొండ చరియలలో అలుముకుంటున్న చీకటులను గుర్తుకు తెచ్చాయి. నిలువెత్తు కొండలు సూర్యాస్తమయ వేళకు నల్లని నీడలై నడుము వాల్చినట్లు కనిపించిన ఆ దృశ్యాలు - ఇటువంటివే అనేక ప్రకృతి అందాలు అవకాశం దొరికినప్పుడల్లా తెలుగు సినిమా పాటల్లోకి తేవడానికి ప్రయత్నించాను.

తెలుగునాటి అందాలనీ, రుచులనీ రాగాలనీ ప్రేమలనీ,పెదవి విరుపులనీ కావ్యగీతం చేసి ఆంధ్రేతర పాత్రలకు కూడా అంటించిన సరసులు తెలుగు కవులు!



'మాయాబజార్'లో శాకంభరీ దేవి వరప్రసాదం ఆంధ్రశాకం గోంగూర లేనిదే రారాజు 'ముద్దయినా ముట్టడు' అనిపించారు పింగళిగారు.

ఆ సంప్రదాయం, సరసం తెలుగు సినిమా పాటలోకి తేవాలనే తాపత్రయం జంధ్యాల గారి సినిమాలలో కొంత తీరింది.

అక్టోబరు మొదటి సంచిక 'హాసం'లో నేను రాసిన 'బుల్లెట్' పాట పల్లవి (రాధకృష్ణుడికి ఏమిస్తుందో ఇస్తావా మరి!)ని చూసి ప్రొద్దుటూరు నుంచి శ్రీ పుల్లగూర సత్యనారాయణగారు 'Krishna was a child bofore Radha - Radha had a Love of ecstasy only' అని రాశారు. ఆ రాధనే జయదేవుడు 'హరిరితి హరిరితి జపతి సకామం' అని 'క్షణమధునా నారాయణం అనుగత మనుసర రాధే' అని ఆమె విరహిణియై చేరిన విరి పాన్పు 'హుతాశనతల్పం' అని రాసినదానికి జవాబేమిటో నా సినీ గీతానికీ అదే జవాబుగా భావించమని ప్రార్థన-

సంగీత దర్శకులలో సత్యంగారి స్థానం విశిష్టమైనది. మాధురీ మహిమ ఆయన సరిగమ. తుంబాదరువు ఆయన ఆదరువు. లాలిత్యం ఆయన ప్రాణం. కొట్టుడు పాటలన్నా అవి రాసే చేసేవారన్నా ఆయనకు నచ్చదు. నా దేవదాసు నాటక గీతాలలో 'వసగొంతున కోయిలా' ఆయన ఎంతో గొప్పగా స్వరబద్ధం చేశారు. శ్రీమతి జానకి పాడారు. చిత్రం పేరు గుర్తు రావడం లేదు కానీ నిర్మాతపేరు అమరనాథ్. నా ప్రయివేట్ పాటలలో ఒక ప్రణయగీతం దర్శకుడు శ్రీ వి.మధుసూదనరావుకి ఎంతో నచ్చి 'ఎదురీత' సినిమాలో ఎన్.టి.ఆర్, వాణిశ్రీ యుగళగీతంగా పెట్టడం జరిగింది. సత్యంగారే స్వరకర్త - 'తొలిసారి ముద్దివ్వమంది చెలిబుగ్గ చేమంతి మొగ్గ' అనే పాట అది.

అమిత ప్రతిభావంతులైన కొద్దిమంది స్వరకర్తలలో సత్యంగారు ఒకరు. ఆయన 'మూడ్'నుబట్టి ఏస్థాయికైనా వెళ్లి ఆశువుగా స్వరపరిచిన గీతాలు ఎన్నో! కానీ కొంత కాలం 'కాపీ' దోషం నుంచి ఆయన తప్పించుకోలేని అపవాదుకు గురికావడం జరిగింది. సృష్టికర్తృత్వ శక్తి ఆయనలో లేకపోతే 'ఏ దివిలో విరిసిన పారిజాతమో', 'మల్లికా నవమల్లికా', 'తొలిసారి ముద్దివ్వమంది', 'ఇది తీయని వెన్నెలరేయి', 'గున్నమావిడి కొమ్మమీద', 'కిరాతార్జునీయం' మొదలైన పాటలు వెలువడి వుండేవా?

సత్యంగారు సంగీత శరీరుడు. ఆయన సినీసంగీత స్వర నిఘంటువు. అన్నపానాలకు పెట్టవలసిన ఖర్చు సినిమాలు చూడడానికి వెచ్చించిన గానరస పిపాసి. అయితే ఆయన జీవితంలో నేపథ్యం ఎక్కువగా చోటు చేసుకుంది - ఆయన ప్రతిభ మబ్బుచాటు మార్తాండ కిరణమైపోయింది.

ఎన్నో అవార్డులు, రివార్డులు ఆయన అందుకోవలసినవి ఆయనకు అందలేదు. ఆ చింతకూడా ఆయనకు లేదు. శిఖర శిలలు కనిపించినట్లు పునాది రాళ్లు కనిపించవు కదా!

డ్యూయట్ల యుగం ముదిరి ముమ్మరమైన రోజుల్లో ఒకసారి ఓ గమ్మత్తు జరిగింది. ఈ సంఘటన మన సినిమాల సన్నివేశాల సందర్భశుద్ధిపై ఒక చురక మాత్రమే! 'బడాయి బసవయ్య' అనే చిత్రానికి ఒక డ్యూయట్ రాశాను. దానికి సత్యం గారు సంగీత దర్శకుడు. దాని రికార్డింగు జెమినీలో, మరో చిత్రం (పేరు జ్ఞాపకం లేదు) కోసం మరో డ్యూయట్ రాశాను. దీనికి చక్రవర్తి స్వరకల్పన. దాని రికార్డింగు విజయా గార్డెన్స్‌లో - ఇద్దరూ ట్యూన్‌లు యిస్తే రాసినవే. అయితే అవి యిచ్చి పంపించడంలో ఒకరి పాట ఒకరికి యివ్వడం జరిగింది. ఒకదాని తర్వాత ఒకటి రికార్డింగు, ఇంతలో నా పొరబాటు నాకు గుర్తు వచ్చి హుటాహుటిని విజయాగార్డెన్స్‌కు వెళ్లాను. అప్పటికే బాలూ సుశీలా పాట పాడేస్తున్నారు. రాసిన పాట వేరే ట్యూన్‌లో వినిపిస్తుంటే వింతగా తోచింది. 'ఏమయ్యా! పాట ట్యూనుకు సరిపోయిందా?' అని చక్రవర్తి నడిగాను. 'బ్రహ్మాండం' అన్నాడు. సరే... చూదామని జెమినీకి పరుగెత్తాను. సత్యంగారినీ యిదే ప్రశ్న అడిగాను. 'చిన్న చిన్న ఎడ్జస్ట్‌మెంట్సు... సరిపోయింది' అన్నారు. ట్యూన్లు నరే పాటలో భావం, అర్థం, సన్నివేశం వీటిమాటేమిటి? ఉభయ దర్శకులు అభ్యంతరమె చెప్పలేదు!

దీనిని బట్టి డ్యూయట్‌కి మనం కొత్త అర్థాలు చెప్పుకోవాలి. పెద్ద పీట వెయ్యాలి డ్యూయట్‌లకి ఇటువంటి ప్రత్యేకత ఏర్పడి అప్పుడే రెండు దశాబ్దాలు కావస్తున్నదన్న మాట! 'డ్యూయటే సినిమానిజాయ్!' అన్నదేపాట!

సినీఫార్ములాలు ఏర్పడిన తరువాత జీవత్చిత్రాల జోలికి వెళ్లడం మానేశారు దర్శక నిర్మాతలు. వినోదం ఒక్కటే సినిమాకి పరమావధిగా చేసుకున్నారు. జనాకర్షణ, తద్వారా ధనార్జన ప్రధానమైన తరువాత పాటకు ఛందస్సు మారిపోయింది. మాటకు విలువ పడిపోయింది. అర్థోక్తిలో, చిరునవ్వులో, నిట్టూర్పులో, కన్నీటి చుక్కలో మౌనమైన మాటకి శక్తిపోయింది. అటువంటి సినిమాలు (దేవత, త్యాగయ్య, సీతాకోకచిలుక, గీతాంజలి, శంకరాభరణం) తీయాలనే ఆసక్తి నిర్మాతలలో తగ్గిపోయింది.

హీరోహీరోయిన్లకీ కమేడియన్లకీ తేడా లేకుండా పోయిన తరువాత కథనంలో మసాలా కోసం డ్యూయట్లు పాడుకోవడం ప్రారంభమైంది. సోలోలు గానీ, డ్యూయట్లు గానీ 'ముత్యాలముగ్గు' తరువాత రంగు రుచివాసన మారిపోయి పూర్వపు బంగారక్క కేతిగాడు పద్ధతికి చేరుకున్నాయి. అందుచేతనే వాటి భాష, పరిభాష మారిపోయాయి. పాత్రధారుల వేషాలూ, గాత్రధారుల రాగాలూ కూడా మారిపోయాయి.

తెలుగులో రాయడానికి తగిన అమరిక ఈనాటి యుగళ గీతాలలో లేదు, సందెగాలి, చందమామ, మల్లెపూలు, మంచిగంధం, ఏటి ఒడ్డు, పడవ ప్రయాణం, గుడి గంటలు, ఆకుపచ్చ చేలూ, చిలకపచ్చ చీరలు, కట్టూ బొట్టూ, గుట్టూ మట్టూలేని శృంగారానికి సరిపోనని సవినయంగా తెలుగు భాష ఏనాడో ఒప్పుకుంది.

'సీతారామయ్య గారి మనవరాలు' తరువాత నేను రాసిన తెలుగు పాటల్లో నేనే తెలుగు తనాన్ని వెతుక్కోవలసిన స్థితిలో పడ్డాను.

**- వేటూరి సుందరరామమూర్తి**

# తాతా ధిత్తై తధిగిణతోం...

సీరియల్ 2

| పాత్రలు | నటీనటుల సజేషన్ |
| --- | --- |
| వీరభద్రం | - కోట శ్రీనివాసరావు |
| విష్ణుమూర్తి | - నూతన్‌ప్రసాద్ |
| శ్రీరామ్ | - తరుణ్ |
| అశ్విని | - శ్రియ |
| పార్వతమ్మ | - అన్నపూర్ణ |
| హనుమంతు | - గుండు హనుమంతరావు |
| అనంత్ | - గోపీచంద్ |

పైన ఉదహరించిన నటీనటులను మనసులో ఉంచుకుని ఈ సీరియల్‌ను మీ మనో నేత్రాలతో తిలకించండి.

- జీడిగుంట రామచంద్రమూర్తి



## జరిగిన కథ

రాజ పాలెం అనే గ్రామంలో రావ్ బహద్దూర్ వంశానికి చెందిన వీరభద్రం అనే స్కూలు మాష్టారు ఉంటారు. ఆయనంటే ఆ ఊరి మొత్తానికి భక్తితో కూడిన భయం. చీటికి మాటికి భార్యపై రుసరుసలాడే ఆయన తన కుమారులు శ్రీరామచంద్రమూర్తి, లక్ష్మణమూర్తి ల విషయమై భార్యను కోప్పడి స్కూలుకు బయల్దేరి వెళ్తాడు.

(ఇక చదవండి)

విశాలమైన ఆవరణలో అదో పురాతనమైన భవనం... దాని కాంపౌండు గోడలు ఎత్తుగా వున్నాయి. గేటుకి పైన వున్న 'ఆర్చి' మీద 'రావుబహద్దూర్ రామభద్రం మెమోరియల్ పాఠశాల' అనే అక్షరాలు రాసి వున్నాయి. పాఠశాల వరండాలో ఓ గది ముందు 'హెడ్‌మాస్టర్' అని రాసి వున్న బోర్డు వ్రేలాడుతోంది... ఆ గది తలుపు తోసుకుని వీరభద్రం లోపలకు నడిచాడు.

గదిలో - గోడనున్న దేవుళ్ళ క్యాలెండర్లన్నింటికీ - చెప్పులు విడిచి మరీ నమస్కరించాడు. తర్వాత తన సీటులో కూర్చోబోతూంటే - బయటనించి ఎవరో 'తుమ్మటం' వినిపించి ఆగిపోయాడు. అతనికి కోపం ముంచుకొచ్చింది. బల్లమీది పేకబెత్తం తీసుకుని - బయటకొచ్చి అటూ ఇటూ పరికించి చూసి అడిగాడు - "ఎవర్రా అదీ? ఎవడా తుమ్ముల మనిషి ?"

ముక్కుపొడుం దట్టించి అటుగా వెడుతున్న రంగారావు మేస్టారు బిక్క చచ్చిపోయి చూశాడు.

వీరభద్రం ఆయన్ని సమీపించాడు...

"తమరేనా రంగారావుగారూ తుమ్మినదీ?" - సీరియస్‌గా చూసి అడిగాడు.

"చి... చిత్తం!" భయంగా చూస్తూ బదులు చెప్పాడు రంగారావు... సరిగ్గా అదే క్షణంలో మళ్లీ తుమ్ము రాబోతూంటే - పై మీద కండువా అడ్డం పెట్టుకుని ఆపుకునే ప్రయత్నం చేశాడు.

"అనగా... ఏమిటి మీ ఒపీనియను?... తుమ్ముటకు వేళాపాళలూ సమయా సమయములూ, హద్దు పద్దులూ అవసరము లేదా?... నేను తల్చుకున్నచో - తమ శాలరీనందు పాతిక రూపాయలు 'కోత' విధించగలను... ఏమనుకొనుచుంటిరో?" - కోపంగా అతనివైపు బెత్తం ఝుళిపిస్తూ చెప్పాడు వీరభద్రం.

'కోత' మాట వినగానే రంగారావు బెదిరిపోయాడు.

"చిత్తం ! ఆ కోతి పని మాత్రం చేయకండి ప్రభూ!"

"ఏమంటిరీ? కోతిపనా?"

"ఛ ! 'కోత' అనబోయి - 'కోతి' అన్నాను కాబోలు... క్షమించండి!... అసలే ఆడపిల్లలు గలవాణ్ణి!... పైగా నేను కావాలని తుమ్మలేదండి... ముక్కుపొడుం తుమ్ము... లెక్కలోకి రాదండి !" చేతిలో వున్న నశ్యం డబ్బాను చూపిస్తూ చెప్పాడు.

ఆ డబ్బాని వీరభద్రం లాక్కున్నాడు.

"ఇకమీదట తమరు పాఠశాలలో నశ్యం పీల్చుట నిషేధించటమైనది. జలుబు చేసినచో - స్కూలుకి శలవు లెటరు పంపించి - ఇంటి దగ్గర వైద్యం చేయించుకోండి" - అంటూ ఆ డబ్బాను దూరంగా విసిరేసి - విసవిసా తన 'రూం'లోకి వెళ్లిపోయాడు.

రంగారావు బిక్కమొహంతో చూశాడు... మళ్లీ తుమ్మబోయి తమాయించుకున్నాడు....

కుర్చీలో కూర్చున్న తర్వాత - అటెండెన్స్ రిజిస్టర్ తెరచి చూస్తున్న వీరభద్రం దగ్గరకు - గుమాస్తా గురవయ్య వచ్చాడు. అతని చంకలో 'లెదర్‌బ్యాగ్' కనిపిస్తోంది.

"ఇవాళ ఒకటో తారీఖండయ్యా!... మీరు చెక్కు రాసిస్తే బ్యాంకుకి వెళ్లి డబ్బు తెచ్చి అందరికీ జీతాలిస్తానండి !" - అణుకువగా చెప్పాడు.




"మంచిది!" - అంటూనే డ్రాయరు సొరుగులోంచి చెక్కు పుస్తకం తీసి అందులోంచి ఓ చెక్కు చింపాడు. దానిమీద తారీఖు వేయబోయి గోడమీది కేలండర్లోకి చూశాడు.

"ఇవాళ శుక్రవారమా?" - అనుకున్నాడు...

గురవయ్య అలాగే చూస్తున్నాడు.

"లాభం లేదు... ఇవాళ శుక్రవారం... ధనలక్ష్మిని కదపకూడదు... శాలరీలు రేపీయవచ్చు... వెళ్లు!" - అన్నాడు వీరభద్రం.

"రేపు బ్యాంకు శలవండి... ఎల్లుండి ఆదివారమండి!" - వినయంగా చెప్పాడు గురవయ్య.

"కనుక శాలరీలు సోమవారమే!" - చెక్కుని మళ్లీ సొరుగులో వేసి డ్రాయరు మూసేశాడు వీరభద్రం.

గురవయ్య నిరాశగా బయట కొచ్చాడు.... వరండాలో ఎదురైన రంగారావుని చూసి చెప్పాడు -

"ఇవాళ మనకి జీతాలు లేవండి!"

"ఎందుకనీ?" ఆదుర్దాగా అడిగాడు రంగారావు

"శుక్రవారం కదండీ!... ధనలక్ష్మిని కదపకూడదన్నారు మన చాదస్తం గారు!"

"ఖర్మ ! ఏం చేస్తాం?..." నుదుటి మీద కొట్టుకుని ముందుకు నడిచాడు రంగారావు.

"ఏమిటి రంగారావ్ గారూ? - ఖర్మంటున్నారు? ఏం జరిగింది?" - పక్కనున్న క్లాసురూంలో పాఠం చెప్తున్న శరభయ్య మేస్టారు రంగారావు మాట విని - అడిగాడు.

గురవయ్య మోసుకొచ్చిన విషయాన్ని ఆయనకు చెప్పాడు రంగారావు.

మరో అయిదు నిమిషాలకు ఆ వార్త అందరికీ చేరిపోయిందది.

"ఏం చేస్తాం చెప్పండి?... సర్దుకుపోవాలి... అయినా ఇవాళ మనకేవన్నా ఇది కొత్తా?... ఒకటో తారీఖు - ఖర్మం చాలక శుక్రవారం వస్తే - ఎప్పుడైనా జీతాలు తీసుకున్నామా?" - శంకరం మేస్టారన్నారు.

"మనిషి మంచివాడే! కానీ ఓపాలు మూర్ఖత్వం రెండుపాళ్లు చాదస్తం ఎక్కువ గురుడుకి" - కామెంట్ చేశాడు కామేశం.



"అయినా మనకి ధైర్యం లేకపోతోంది మాస్టారూ! పై అధికారులకి ఒక్క పిటీషన్ తగిలిస్తే - " రంగారావ్ ఇంకా ఏదో అనబోయాడు... అయితే శంకరం అడ్డంపడి మందలింపు స్వరంతో చెప్పాడు వెంటనే -

"మీరు చెప్పేది మరీ బావుందండీ !... పై అధికారులకి కంప్లయింట్ చేయటానికీ పై ఊరుకి బదిలీ చేయించటానికీ - ఇదేవన్నా గవర్నమెంటు స్కూలా?... చేతనైతే ఆయనగారి చెప్పుచేతల్లో పడివుండాలి.... లేదంటే చెప్పుల్లో కాళ్లెట్టుకుని - మనవే మరోదారి చూసుకోవాలి !"

"అసలీ ప్రయివేటు స్కూళ్ళన్నీ ఇంతే గురువుగారూ!... అంతవరకూ ఎందుకూ? హైదరాబాదులో మా కోడలు - అదేదో కాన్వెంటులో పనిచేస్తోంది... నెలకు ఎనిమిది వందలు చేతిలో పెట్టి - పదిహేను వందలు తీనుకున్నట్టుగా సంతకం పెట్టించుకుంటారట!... అది చాలక ఏడాదేడాదీ - ఎండాకాలం శలవల్లో ఉద్యోగంలోంచి పీకేస్తారట..!" - శరభయ్య చెప్పాడు.

"అదీ మరీ దారుణంలెండి!" శంకరం కామెంట్ చేశాడు.




"కనక - సర్దుకుపోవాల్సిందే !" - అంటూనే దూరంగా చూసిన శరభయ్య ఉలిక్కిపడ్డాడు.

దూరంనించి వీరభద్రం - అటే వస్తూ కనిపించాడు.

"అమ్మో... ఆ చాదస్తంగారు ఇటే వస్తున్నారు... పదండి... పదండి!" - గబగబా తన క్లాస్‌రూం వైపు పరుగిడుతూ తక్కినవాళ్ళను హెచ్చరించాడు శరభయ్య... తక్కిన టీచర్లు కూడా ఎవరి గదుల్లోకి వాళ్ళు నిష్క్రమించారు.

'విజిట్స్'కి బయల్దేరిన వీరభద్రం చేతిలో 'పేకబెత్తం' కనిపిస్తోంది. అతని వెనకాల వెండిచెంబుతో మంచినీళ్ళ గ్లాసు పట్టుకుని 'ప్యూను' ఫాలో అవుతున్నాడు...

పక్కగా గ్రౌండులో కొంతమంది పిల్లలు అల్లరి చేస్తున్నారు - వాళ్ళు వీరభద్రాన్ని చూసి స్థాణువుల్లా నిలబడిపోయారు.

"ఏమిటి గ్రౌండులో అఘోరిస్తున్నారు"- వాళ్ళను చేరుకుని అడిగాడు.

"ఇవ్వడం మాకు డ్రిల్లిండి!"- తలవంచుకునే బదులిచ్చాడు ఓ కుర్రాడు.

"డ్రిల్లు మేస్టారింకనూ రాలేదా?" మళ్లీ తీవ్రస్వరంతో అడిగాడు వీరభద్రం.

భయం వల్ల పిల్లలెవరూ పెదవి విప్పలేదు.

"ఇంకా రాలేదండయ్యా!"- ప్యూన్ చెప్పాడు.

సరిగ్గా అదే క్షణంలో దూరంనించి 'లెఫ్ట్-రైట్'- అనే 'మార్చింగ్' వినిపించటంతో ప్యూన్ అటువైపు చూశాడు. గేటులోంచి డ్రిల్లు మాస్టరు రావటం కనిపించింది. కాకీనిక్కర్లో తెల్లని షర్టు 'టక్' చేసుకుని - మెడలో పెద్ద 'విజిల్' వేలాడదీసుకుని - ఫ్రెంచికట్ మీసాలతో తమాషాగా కనిపిస్తున్నాడు డ్రిల్లు మేస్టరు అనంతం.

అతన్ని చూసి వెంటనే వీరభద్రానికి చెప్పాడు ప్యూను-

"చిత్తం! అరుగో...డ్రిల్లు మేస్టారు వచ్చేస్తున్నారండి!"

"లెఫ్టైరైట్... లెఫ్ట్...రైట్... లెఫ్టైరైట్...! హాల్ట్!"- మార్చింగ్ చేనస్తూనే వచ్చిన అనంతం - అక్కడ ఆగిపోయాడు.

వీరభద్రం కోపంగా చూస్తూ అన్నాడు-

"ఆపండి మీ విన్యాసములు - ! గ్రౌండునందు తప్ప - వీధిలో 'లెఫ్టురైట్లూ - అబౌట్‌టర్నులూ' వద్దని తమకు వంద పర్యాయములు వక్కాణించితిని... మీకు లెక్కలేకపోయినది!"

"అదికాదుసార్... వీధిలో మొదలెడితేనే కానీ - గ్రౌండ్‌లోకొచ్చేసరికి నాకు మూడ్ వస్తుందండి!" - బెరుగ్గా చూస్తూ చెప్పాడు అనంతం.

"సరే... తమరి చిత్తము! ఇంతకూ ఈ దినమింత ఆలస్యంగా దయచేశారేమిటి? ఈ మాసమున పూర్తి శాలరీ తీసుకొనవలయునన్న కోరిక తమకు లేదా?"-

"చిత్తం! స్టార్టవటం ఎర్లీగానే స్టార్టయ్యానండి... తీరా బయటకొచ్చేసరికి మా బంధువొకాయన ఎదురయ్యాడండి... మళ్లీ ఆయన్ని లోపలకు తీసుకెళ్లి పది నిమిషాలు ఆయనతో గడిపి - పనయ్యాక తిరిగి ఆయన్ని బస్టాండులో దిగపెట్టివచ్చానండి... ఆయన జాతకాలు అద్భుతంగా చెప్తాడు కదా... అనీ...!"

'జాతకం' అనే మాట వినగానే వీరభద్రం డౌనైపోయాడు.

"నిజమా? ఆయన అంత గొప్పగా చెప్పగలడా?" ఆత్రంగా అడిగాడు.

"ప్రామిస్సండి... ఒకప్పుడు ఇందిరాగాంధీకి, ఆ తర్వాత రాజీవ్‌గాంధీకీ కూడా ఆయన జాతకం చెప్పాడండి!..."

"అంటే?... ఆయనతో జాతకం చెప్పించుకున్నవారు హత్యలకు గురయ్యెదరా ఏమిటి కొంపదీసి?"

"అలాక్కాదండి! అంత గొప్పవారికి మాత్రమే జాతకాలు చెప్పగల 'లెవల్' మనిషండి... ఎలాగా వచ్చాడు కదా అని మా అమ్మాయి జాతకం ఒకసారి చూపించాను - అంటూ ఇంకా ఏదో చెప్పబోతున్న అనంతాన్ని వారిస్తున్నవాడిలా, అతని చేతులు పుచ్చుకుని అడిగాడు వీరభద్రం-

"అట్టయిన ఒక్కసారి తమరు - వారిని నాకు 'ఇంట్రడ్యూస్' కావించాలి... నా జాతకమును కూడా చూపించుకుంటాను!"

"లాభం లేదుసార్!" నిరాశగా పెదవి విరిచాడు అనంతం.

"అనగా ఏమిటి తమరి భావన?... నా భవిష్యత్తు



బాగుండదనా?... లేక నాకసలు భవిష్యత్తే లేదనా?"- కోపంగా చూస్తూ అడిగాడు వీరభద్రం.

"నో.. నో.. నో.. అదికాదు సార్... ఆయన ఇంతకు ముందే వెళ్ళిపోయాడు!... ఆయనగార్ని బస్సెక్కించి సెండాఫ్ చెప్పివచ్చినందుకే - నాకింత ఆలస్యమైంది"

"ఇంతకీ తమరి కుమార్తె జాతకము చూసి ఏమిచెప్పారాయన?" - ముందుకు నడుస్తూ అడిగాడు.

"చిత్తం... ఆ విషయమే తమరితో నేను స్వయంగా మనవి చేసుకోవాలను కున్నాను... మీరే అడిగారు!" - చేత్తో గుండుమీద రాసుకుంటూ భయంభయంగా చూస్తూ - కొంచెం తత్తరపాటుతో చెప్పాడు అనంతం.

"నాతోనా?... ఏ విషయం?" - అడిగాడు వీరభద్రం.

"అదేసార్!... మా అమ్మాయి జలజ పెళ్లి విషయం!"-

అర్థం కానివాడిలా చూశాడు వీరభద్రం...

మళ్ళీ చెప్పాడు అనంతం -

"చిత్తం... ఈ స్కూల్లో నాతో పనిచేసే ఓ ఉపాధ్యాయుని కొడుకుతోనే మా జలజకి వివాహం జరుగుతుందని చెప్పాడండి!"

"అటులనా? అయినచో?" - అనుమానంగా చూస్తూ అడిగాడు.

"అంటే... అంటే... ఈ స్కూల్లో - నాతోపనిచేసే ఉపాధ్యాయులెవరికీ అంత వయసున్న మగపిల్లలు లేరుకదండీ - తమరికి తప్ప!"-

వీరభద్రం తుళ్ళిపడ్డాడు.

"డ్రిల్లుమాస్టారూ! ఏమిటి తమరు వాగుచున్నది?... అయిననూ ఈ పాఠశాలనందు - 'నాతో' మీరు పనిచేయుచున్నారు తప్ప - 'మీతో' నేను పనిచేయుట లేదు." - కోపంగా అన్నాడు.

"చిత్తం!... ఆ మాట నిజమేసార్!... కానీ జాతక విషయాన్ని - కొన్నింటికి మనకు అనుగుణంగా మనమే అన్వయించు కోవాలని ఆ శాస్త్రమే ఉద్ఘోషిస్తోంది...! మీ పెద్దబ్బాయికి ఈ ఏటితో డిగ్రీ అయిపోతుంది కదా?.. ఒక్కసారి తమరొచ్చి మా జలజను చూసుకుంటే - ఏమో?... ! ఎవరికి ఎక్కడ రాసిపెట్టుందో ఎవరు చెప్పగలరు చెప్పండి?..." - వణికిపోతూనే ఆడపిల్ల తండ్రిగా - మనసులోని మాటను చెప్పేశాడు అనంతం.

వీరభద్రానికి పుండుమీద ఆవకాయ రాసినట్లుంది.

"కావచ్చు... కానీ మీ కుమార్తెకు మాత్రం మా సుపుత్రుడితో రాసి పెట్టలేదు!.. అర్థమైనదా?"- అంటూ ముందుకు నడిచాడు.

అయినా అనంతం తనపట్టు విడిచిపెట్టలేదు... ఆడపిల్ల తండ్రికి అర్థింపులు తప్పవని తెలుసు.. పైగా వ్యవహారాన్ని కొంతవరకూ లాక్కొచ్చాడు కదా?..

"మీరంత కోపంగా డిక్లేర్ చేస్తే - నేను అవుటైపోవాల్సిందే... కానీ ఒక్క మాటమాత్రం దయుంచి వినండి! మా జలజ నాకంటే అందంగా వుంటుంది... తొమ్మిది పాసైంది. రామాయణ భారతాల్ని పారాయణం చేసింది... రామదాసు కీర్తనలు నేర్చుకుంది." - వేడుకుంటూ వెంటపడ్డాడు.

"క్వాలిఫికేషన్లు వల్లించకండి!... మా జ్యేష్ఠపుత్రుని మేరేజి - వాడు జన్మించినపుడే సెటిలైంది... నా సోదరి కుమార్తె శ్యామసుందరిని మావాడికిచ్చి వివాహము జరిపించెదనని -




అమెకు ఏనాడో 'వరడి'చ్చితిని.. అర్థమైనదా?" - అంటూ సీరియస్‌గా అతనివైపు చూసి విసురుగా తన రూమ్‌లోకి వెళ్ళిపోయాడు వీరభద్రం.

* * *

క్లాసులో తెలుగు లెక్చరర్ వరూధిని పాఠం చెప్తున్నాడు. విద్యార్థులందరితో పాటు శ్రీరామ్ కూడా పాఠాన్ని శ్రద్ధగా వింటున్నాడు. పక్క బెంచీలో కూర్చున్న అశ్విని అతన్నే రెప్పవాల్చకుండా చూస్తోంది... లెక్చరర్ పాఠాన్ని కొనసాగిస్తూనే వున్నాడు.

అంతలో అశ్వనికి హఠాత్తుగా ఓ ఆలోచన వచ్చింది... వెంటనే, నోట్ పుస్తకంలోంచి ఓ తెల్లకాగితం చింపి దానిమీద 'లవ్' గుర్తువేసింది. ఆ గుర్తు - మధ్యగా 'ఐ లవ్ యూ' అని రాసింది... ఆ కాగితాన్ని 'బంతి'లా చుట్టి శ్రీరాం మీదకు విసిరింది...

శ్రీరాం గమనించకపోయినా - ఆ 'బంతి' లెక్చరర్ దృష్టిలో పడనే పడింది. ఆ సంగతి గ్రహించని అశ్విని - 'కాగితం బంతి'ని తీసుకొమ్మంటూ శ్రీరామ్‌కి సైగలు చేసింది...

విషయం అర్థం చేసుకున్న శ్రీరామ్‌కి ఏం చేయాలో తోచలేదు. ముఖం మీద ముచ్చెమటలు పోశాయి.

అంతలో లెక్చరర్ అతని దగ్గరగా వచ్చాడు. ఆ 'కాగితం' బంతిని తీసి - విప్పి అందులో వున్న వాక్యాన్ని ముందుగా మనసులో చదువుకుని - ఆ తర్వాత ముసిముసి నవ్వులతో క్లాసులో అందరికీ చదివి వినిపించాడు.

"ఐ లవ్ యూ!"

విద్యార్థులంతా ఆయనవైపు వింతగా చూశారు...

లెక్చరర్ అంతలో శ్రీరామ్ దగ్గరగా వచ్చి - తన కర్చీఫ్‌తో అతని ముఖంమీది చెమటలు తుడిచాడు.

"అందమైన ఆడపిల్ల 'ఐలవ్‌యూ' అని బేనర్‌కడితే - 'ఐస్‌క్రీం'లా కరిగిపోవాలయ్యా!.. అంతేకానీ ఇలా చెమటల్తో తడిసి ముద్దయిపోకూడదు.. బెస్టాఫ్‌లక్" అంటూ ఆ కాగితం బంతిని అతని చేతిలో పెట్టాడు.

శ్రీరామ్ అందరివైపూ అయోమయంగా చూశాడు. అందరూ తనవైపే చూసి ముసిముసిగా నవ్వుతున్నట్లు గ్రహించి సిగ్గుపడ్డాడు.

**(ఇంకావుంది)**



## కొంటెకొశ్నెన్లు - తుంటరి జవాబులు

**వి.మంజురాణి - హైదరాబాద్.**

ప్ర: అతి జాగ్రత్త పరుడైన షుగర్ పేషెంట్?

జ: ట్రాఫిక్‌జామ్‌లో ఇరుక్కున్నా, షుగర్ టెస్ట్ చేయించుకునేవాడు.

**కూర్మాన వెంకట సుబ్బారావు - విశాఖపట్నం.**

ప్ర: పరమ సందేహ ప్రాణి అంటే ఎలా వుంటాడు?

జ: 'దొంగలు పడితే తెలియ చేయడానికి కుక్కను పెంచుకుందామండీ' అని భార్య అడిగితే 'ఆ టైమ్‌కి అది గట్టిగా అరుస్తుందని నమ్మకం ఏంటి...' అని తప్పించుకునేవాడు.

**బి.మోక్షానందం - ఉప్పలపాడు.**

ప్ర: ప్రేమ 'విలువ' తెలిసేదెప్పుడు?

జ: పర్స్ ఖాళీ అయినప్పుడు?




## ఈ రూటేవేరు




అండర్ స్టాండ్ = కింద నిలబడుట

- వై.ధీరజ్ కుమార్, నందిగామ.

గోపాల్ = ఆవుపాలు

- దాసరి చంద్రయ్య, నెల్లూరు.

సాఫ్ట్‌వేర్ = నెమ్మది ఎక్కడుంది

- బి.శ్రీరాం, రుద్రారం.



## చిలిపి లిపి




O C D E = ఓ సీడీ ఈ

A C D? = ఏ సీ డీ ?

E THE GO, E THEY = ఇదిగో ఇదే !

-రమణ శాస్త్రి, సంగారెడ్డి

టపాకాయ =Post Nut

పదిలంగా =Ten Skirt

నోరూరు =Mouth Village

రాబందు =Come Strike

- నన్నపనేని రవి, ఉలిచి (ప్రకాశం జిల్లా)

అతడే ఒక సైన్యం - ఔనా

నువ్వు నాకు నచ్చావ్ - ఐతే- ఎలా చెప్పను

- కె.ఎస్.రామారావ్, విజయనగరం.

సంసారం-సాగరం-బ్రహ్మచారి-జీవితం-ఆనంద నిలయం

పల్లెసీమ-స్వర్గసీమ-పట్నవాసం-ఆకలిరాజ్యం

-పి.వి.కె.రవితేజ, హైదరాబాద్

## పేరు - రిపేరు



## చిలిపి కవిత



బావా చిక్కితి నీ కరములందు
కొట్టిన, కట్టెద హాస్పిటల్ బిల్లు వైద్యనిమిత్తమునన్
ఇచ్చినచో ఛాన్సు, కొట్టెద బీటు నీ సహోదరికి
ఆలస్యము అమృతము విషమగు గావున్

- జె. నాగేష్, భగత్‌సింగ్ కాలనీ, హైదరాబాద్.

## డబుల్ రోల్



ఈ '**పది**' రూపాయలు జాగ్రత్తగా '**పది**'లపరచు
'**వంద**'నా ఓ '**వంద**'రూపాయలివ్వు
**నీ లంగా నీలంగా** అయిపోయిందేంటి?

- జి.యస్.వాణి, సరిపల్లె.

## షార్ట్‌కట్స్




గోరంట్ల చిత్ర = గోచి
బూరుగుపల్లి చిన్నయ్య = బూచి
బాలాంత్రపు కుమార్ = బాకు
చాగంటి కుమారి = చాకు

- పురాణపండ మేఘనా శ్రీ రవళి

## పేరడీ పెరేడ్



అ : నన్ను వేపుకుందువటే - నవ్వుల విషరాణీ
ఆ : వేపకుండ నంజుకుందు నిన్నే ఓ స్వామీ నిన్నే ఓ స్వామి
ఆ : భరియించను నీ కూతలు - సహించను నీ చేతలు
కాళినౌదు నేను - మహంకాళి నౌదు నేను
మహంకాళి నౌదు నేను
అ : ఎంతటి పాపాత్మురాలివంతరంగమందు నీవు
చిరకాలపు పీడ గోరి - తాళిగడితి నేను -
సుడిలోన యిరికినాను ॥నన్ను॥
ఆ : నీ జీతము నా వశమై - నా బ్రతుకే పరవశమై
వెలుగుతున్న చాలు - సంసారమందు మేలు -
సంతోషమందు తేలు
అ : ఏనాటిదో యీ ఖర్మం - ఎరుగరాని కలి ధర్మం
ఎంతటి పగవాడికైన - రాకూడని ఖర్మం-
ఇది బైటపడని మర్మం ॥నన్ను॥

- దేవరం సతీష్‌కుమార్, జగిత్యాల.

("గుళేబకావళి కథ" చిత్రంలోని "నన్ను దోచుకుందువటే" పాటకు పేరడీగా...)

ఈ సంచికలోని పేరడీ పెరేడ్ రాసిన దేవరం సతీష్‌కుమార్ (జగిత్యాల) గారికి బ్లిస్ ఆడియో వారు 'హీరో' ఆడియో క్యాసెట్‌ని, 'వినాయక చవితి' భక్తిగీతాల ఆడియో క్యాసెట్‌ని బహుమతిగా ప్రకటించారు. అతి త్వరలో పోస్ట్ ద్వారా పంపించడం జరుగుతుంది.






# 'ఏడుకొండలూ - టెంకిజెల్లలూ

**- కండ్లకుంట శరత్‌చంద్ర**

పోలీస్‌లాకప్‌లో కుర్చీకి కట్టేయబడున్నాడు పాపారావ్!

అతని చుట్టూ నలుగురు కానిస్టేబుళ్ళు నిలబడున్నారు.

ఎదురుగా... 'నేరస్తుల పాలిటి సింహస్వప్నం' అని తనకు తానే ఓ బిరుదు తగిలించుకున్న ఎస్సై ఏడుకొండలు నిలబడి, హిట్లర్ మీసాన్ని మెలితిప్పడానికి ప్రయత్నం చేస్తూ... పద్దెనిమిది వందలా పద్దెనిమిదోసారి అదే ప్రశ్నవేసాడు.

"ఆ గోల్డ్‌ఛైన్ ఎక్కడ దాచావో చెప్పు! నేనేదీ రెండోసారి అడగను! చెప్పు... ఆ ఛైన్ ఎక్కడ?! చెప్తావా చెప్పవా?! నేనేదైనా ఒకేసారి అడుగుతాను. మళ్ళీమళ్ళీ అడగను. చెప్పు.... ఆ ఛైన్ ఎక్కడ? ఊఁ... చెప్పు... అంటూ" గ్రామసింహంలా మొరుగుతున్నాడు ఎస్సై.

"దాన్ని ఛైన్ అనకూడదు సార్! చైన్ అనాలి." చెప్పాడో కానిస్టేబుల్ మెల్లిగా.

"ఎలా అంటే ఏమిటి... అది గొలుసు కాకుండా పోతుందా.... వీడు దొంగ కాకుండా పోతాడా! నీ తెలుగు తెలివితేటలు నా దగ్గర చూపించమాక!" అని కానిస్టేబుల్ మీద రంకేసి, పాపారావు వైపు తిరిగి "ఊఁ...! చెప్పు!" అన్నాడు ఎస్సై ఏడుకొండలు.

"ఏం చెప్పు? తోలు చెప్పా.... రబ్బరు చెప్పా?" అంటూ పళ్ళికిలించాడు పాపారావు.

"ఏయ్...! నా తోనా నీ పరాచికాలు! ఈ వన్‌టౌన్ ఎస్సైతోనా నీ కుళ్ళు జోకులు!! నేను చండప్రచండుడననీ.... గండర గండడుననీ... దుష్టశిక్షణా... శిష్టరక్షణా... న్యాయభక్షణా చేయ అవతరించిన ఇన్‌స్పెక్టరుండననీ... నీకు తెలీదా! బంగారు గొలుసు ఎచ్చటనున్నదో... చెప్పినచో... అవుతాను నీకు శ్రీరామరక్ష! లేనిచో తప్పదు నీకు శిక్ష! మాకెందులకీ పరీక్ష! చీరేస్తానేమను కున్నావో.... చెప్పు!" అరిచాడు ఎస్సై పౌరాణిక భాషలో.

"అయ్‌బాబోయ్.... భలే కామెడీగుందండీ! వన్స్‌మోర్!! కాస్త కట్లిప్పండి సార్.... విజిల్ వెయ్యాలని వుంది..." అని అన్నాడు పాపారావు.

"ఏయ్‌ఁ....! నీకెలా కనపడుతున్నానురా నేను! చవటదద్దమ్మ ననుకున్నావా! సోంబేరీగాడి ననుకున్నావా! తిక్క వెధవననుకున్నావా! వాజమ్మననుకున్నావా...!.." అంటూ గడగడా చదివేస్తున్నాడు ఎస్సై.

కానిస్టేబుల్ కనకారావ్ మధ్యలో అందుకుని, "సార్ సార్... సార్... సార్... కొన్ని కొన్ని నిజాలు బయటికి చెబితే... అంత బాగోదు సార్! దయచేసి శాంతించండి" అన్నాడు.

అతగాడు తనని పొగిడాడో, తెగిడాడో తెలీక

ఎస్సై తికమకపడి, పాయింట్‌కొచ్చాడు.

"చూడు... పప్పారావ్! నీకు నా స్పంగతి లెలీదు! లారీ... ఎత్తానంటే... లాకప్ డెత్తే!"

"సార్! మీరు మళ్ళీ స్పెలింగ్ మిస్టేక్స్ చేస్తున్నారు సార్!!" అన్నాడు కనకారావ్.

"నువ్వు నోర్ముయ్యెహె! ఎం.ఏ. తెలుగు సాహిత్తెం చదివినవాళ్ళు... కానిస్టేబుళ్ళైతే... ఇట్టాగే వుంటది. నా ఇట్టమెచ్చినట్టు మాటాడతా! నువ్వు కానిస్టేబుల్‌వి, నేను ఎస్సైని...! అండర్‌స్టాండ్!!" అని మొరిగి

మళ్ళీ పాపారావు వైపు తిరిగి, "చెప్పు! ఆ గోల్డ్‌చైన్ ఎక్కడెట్టావ్?" అన్నాడు ఎస్సై.

ఈసారి పాపారావు చిద్విలాసంగా నవ్వి, "నాయనా ఏడుడొంకలూ...!" అన్నాడు.

"ఏయ్...! నా పేరు ఏడుకొండలు! డొంకలు... కాదు!!" అన్నాడు ఎస్సై.

"డొంకలైతేనేమి... కొండలైతేనేమి! నేను నిన్ను డొంకలూ అని పిలిచినంత మాత్రాన నువ్వు ఎస్సై కాకుండా పోతావా... ఇది జైలు కాకుండా పోతుందా! దొంగెవరు... దొరెవరు! అంతా ఒక్కటే! ఎందుకు నాయనా... అనవసరంగా ఆ పాడు బంగారం కోసం తాపత్రయపడతావు! కామినీ కాంచనాదుల పట్ల వ్యామోహం పెంచుకోవద్దని గీతలో కిట్టపరమాత్మ చెప్పాడు కదా! నీవంటి జ్ఞానులకు... ఆ అశాశ్వతమైన బంగారు గొలుసు దేనికి చెప్పు! అలాంటి వాటిని మాలాంటి అజ్ఞానులకు వదిలెయ్! అంతా... మాయ! ఓం తత్సత్!!" అన్నాడు పాపారావు, నెమ్మదిగా.

కానిస్టేబుళ్ళు మొహామొహాలు చూసుకున్నారు.

ఏడుకొండలు... నోరుతెరుచుకుని బిత్తరపోయి చూస్తున్నాడు!

...అంతలో ఫోన్....

ఓ కానిస్టేబుల్ రిసీవర్ ఎత్తి, మాట్లాడి, "సార్! సి.ఐ. గారు లైన్‌లో ఉన్నారు" చెప్పాడు ఎస్సైతో.

సి.ఐ. పేరు వినగానే పరుగెత్తుకొచ్చి గబుక్కున రిసీవర్ అందుకున్నాడు ఏడుకొండలు.

"హలో! గుడీవినింగ్ సార్!"

"అవతల కొంపలంటుకుపోతుంటే... గుడీవినింగ్ అంటావేమిటి? దిస్ ఈజ్ ఏ బ్యాడ్ ఈవినింగ్!" అరిచాడు సి.ఐ.

"వ్వాట్...! కొంపలంటుకుపోతున్నాయా! ఫైరింజన్‌కు ఫోన్ చెయ్యమంటారా సార్" అడిగాడు ఎస్సై ఆదుర్దాగా.

"ఛస్...! కొంపలంటుకుపోతుంటే.... ఫైర్ సర్వీస్‌క్కూడా ఫోన్ చేసుకోలేనంత వెధవలా కనబడుతున్నానా నీకు... ముఖ్యమైన విషయం మాట్లాడాలి. అర్జంటుగా ఇంటికిరా!" అన్నాడు సి.ఐ.

"నా ప్రమోషన్ గురించా సార్?!" పలుకుల్లో ఆనందాన్ని మేళవించి అడిగాడు ఏడుకొండలు.

"ప్రమోషనూ కాదు డిమోషనూ కాదు. నేను




చెప్పేది విన్నావంటే... లూజ్ మోషన్స్ పట్టుకుంటాయి నీకు. త్వరగా రా!" చెప్పాడు సి.ఐ.

"అలాగే సార్! మరో పదకొండు నిమిషాలలో మీ ఇంటి ముందు లాండ్ అవుతాను." చెప్పి రిసీవర్ పెట్టేసాడతను.

* * *

సి.ఐ. ఇంటిముందు జీప్ ఆగింది.

జీపులో నుండి దిగాడు ఏడుకొండలు. ఎదురుగా బంతితో ఆడుకుంటున్న సి.ఐ. గారి ఆరేళ్ళ కూతురు అగుపించిందతనికి.

"అధికారుల దగ్గర ఎక్కువ మార్కులు కొట్టేయాలంటే... వారి పిల్లల్ని కాకా పట్టాలన్న పెద్దల ఉవాచ గుర్తొచ్చింది.

వెంతనే పాప దగ్గరికి వెళ్ళి, వంగి ఆమె బుగ్గమీద ముద్దు పెట్టుకుని, "నా చిట్టిపాప! నా బుజ్జిపాప! నా మంచిపాప!! ఏంతమ్మా ఏం చేత్తున్నావ్...! ఆలుకుంతున్నావా! ఆలుకో! ఆలుకో! బాగా ఆలుకో!" అన్నాడు చిన్నపిల్లల భాషలో.

అతనివైపు సీరియస్‌గా చూసి, బుగ్గపై చేతితో రుద్దుకుని, "పెద్దవాడివి.... యుక్త వయస్సు రాబోతున్న అమ్మాయితో ఇలా ప్రవర్తించడానికి నీకు సిగ్గుగా లేదూ! పైగా బచ్చాగాళ్ళు మాట్లాడినట్లుగా... ఆ ముద్దు మాటలేంటసలు... నీకు ఈ పోలీస్ ఉద్యోగం ఇచ్చిన బ్రూట్ ఎవరో చెప్పు!! వాడ్నీ నిన్నూ కలిపి పిట్టలను కాల్చినట్టు కాల్చిపారేస్తా!" అనేసి, వెనక్కి తిరిగి, "ఛా! ఇలాంటి ఫూల్స్‌తో... డాడీ ఎలా వేగుతున్నారో ఏంటో!" తనలో తాను గొణుక్కుంటూ వెళ్ళిపోయిందా అమ్మాయి.

నెమ్మదిగా షాక్‌లో నుండి తేరుకుని, ఇంట్లోనికి నడిచాడు ఏడుకొండలు. హాల్లో, బొమ్మతో ఆడుకుంటున్న సి.ఐ. గారి పదేళ్ళ కొడుకు అగుపించాడు.

'అమ్మో! సి.ఐ. గారి పిల్లలు... పిడుగులు! చాలా జాగ్రత్తగా డీల్ చెయ్యాలి. వీడ్నైనా జాగ్రత్తగా కాకాపట్టాలి. ఆరేళ్ళమ్మాయే అంతలేసి మాటలందంటే పదేళ్ళ వీడితో కొంచెం పెద్ద రేంజ్‌లోనే మాట్లాడాలనుకుని, ఆ అబ్బాయి దగ్గరకు వెళ్ళి, "ఏంటిబాబూ... బొమ్మతో ఆడుకుంటున్నావా! గుడ్! నేటి బాలలే... రేపటి నిరుద్యోగులనీ... నేటి బాలికలే... రేపటి బాలింతలనీ... 22వ శతాబ్దంలో పుట్టిన అలెగ్జాండర్ అన్నాడు. అందుకే... మీరు బాగా ఆడుకోవాలి. కేవలం ఆడడమే కాదూ... పోట్లాడాలీ... కాట్లాడాలీ కూడా! దేశ సంస్కృతినీ, సౌభాగ్యాన్నీ సంరక్షించాలంటే... భారతదేశ



పోరులు కాళ్ళు బిగించి ముందుకు గెంతాలి! దేశం యొక్క ఆర్థిక, సామాజిక, రాజకీయ...'' గడగడా ఉపన్యసిస్తున్న ఏడుకొండలు కాస్తా... సి.ఐ.ని చూడగానే తకీమని నోరు కట్టేసి, సెల్యూట్ చేసాడు.

సి.ఐ. పళ్ళు నూరుతూ, కళ్లు తిప్పుతూ ముందుకొచ్చి, ''ఏంటయ్యా... ఏంటిది? సిగ్గులేదూ...! తుమ్మమొద్దులా ఎదిగావు గానీ బుర్రలో కాస్తంత కూడా గుజ్జులేదు నీకు! పదేళ్ళ పని కూనకి.... పదవ తరగతిలోని చరిత్ర పాఠం చెప్తావా! పోనీ... ఆ చెప్పేదేదో కరెక్టుగా చెప్తావా అంటే... అదీలేదు! అన్నీ తప్పుల తడకలే! నేటి బాలికలే రేపటి బాలింతలు అనే గొప్ప కొటేషన్ చెప్పింది అలెగ్జాండర్ కాదు... అరిస్టాటిల్! అతను 22వ శతాబ్దంలో పుట్టలేదు. 49వ శతాబ్దంలో పుట్టాడు. హిస్టరీ కూడా తెలీదు. ఎవడయ్యా నీకు ఉద్యోగమిచ్చింది! నీలాంటి అజ్ఞానికి సి.ఐ.నైనందుకు నన్ను నేను బాటా బూటుతో బాదుకోవాలి. అసలూ...'' అంటూ తిట్లోత్తర శతనామావళి ఆరంభించాడు.

ఎస్సై ఏడుకొండలు వాటిని సావధాన చిత్తంతో వింటూ.... ఏడవలేక ఏడుస్తూ.... నవ్వలేక నవ్వుతూ... నిలబడ్డాడు.

తిట్ల దండకం ముగించి, కొడుకు వైపు తిరిగి, ''లోపలికెళ్ళి ఆలుకో నాన్నా!'' అన్నాడు సి.ఐ.

''భలే డాడీ!'' అని ముద్దుముద్దుగా అని లోపలికెళ్ళిపోయాడా బాబు. ఏడుకొండలుకి ఏమీ అర్థం గాక బుర్రగోక్కుని, ''...ఏదో అర్జెంటని పిలిపించారు...'' అన్నాడు నెమ్మదిగా.

సి.ఐ. తలూపి, షెల్ఫ్‌లో నుండి ఓ బాణం తీసుకొచ్చాడు. దానికి మిరపకాయ బజ్జీ కట్టివుంది. ''ఇదిగో! ఇది అరగంట క్రితం... రివ్వున దూసుకొచ్చి నా డెస్క్‌కు గుచ్చుకుంది. దానికి ఈ కాగితం కట్టబడుంది.'' అంటూ ఓ కాగితాన్నిచ్చాడు.




ఏడుకొండలు కాగితంలోనికి తొంగిచూసాడు.

''(మాకు) అగౌరవనీయులైన శ్రీశ్రీశ్రీ సి.ఐ. గారికి!

అర్భకా!

మేము క్షేమం. మీరు క్షేమమని తలుస్తాం! ఇందుమూలముగా సమస్త పోలీసు ప్రజానీకానికి తెలియజేయునది ఏమనగా... ఈ రోజు రాత్రి, వన్‌టౌన్ పోలీస్‌స్టేషన్ పరిధిలో వుండే కాలనీలో... ఒక ఇంటిని సంపూర్ణముగా దోచెదమని తెలియజేయుటకు సంతోషించుచున్నాము.

మీకు సత్తావుంటే మమ్మల్ని బంధించండి!

అహ్హహ్హాహ్హా! ఇహ్హిహ్హిహ్హీ! ఉహ్హుహ్హుహ్హూ!!

ఇట్లు

తమ విశ్వాసపాత్రులు

''సార్... ఇప్పుడెలా?'' అన్నాడు ఏడుకొండలు సాంతం చదివాక.

''ఎలాగేముందయ్యా...! వాడెవడోగానీ వస్తానని ఛాలెంజ్ చేసింది నీ పరిధిలో ఉండే ప్రాంతానికే! ఏంజేస్తావో... నీ ఇష్టం! వాణ్ని పట్టుకుని లాకప్‌లో వేసావంటే... నేను డీఎస్పీని, నువ్వు సి.ఐ.వీ!! అర్థమైందా!'' అన్నాడు సి.ఐ.

''అర్థమైంది సార్! ఆ దొంగగాడికి... నా సత్తా ఏమిటో తెలీదనుకుంటాను. నా ఏరియాకే వస్తానని ఛాలెంజ్ చేసాడంటే... వాడికెన్ని గుండెలు? అసలు వాడు నా గురించి ఏమనుకుంటున్నాడు? నన్ను వొట్టి వాజమ్మ అనుకుంటున్నాడా... వొట్టి చవట అనుకుంటున్నాడా... వొట్టి పిరికిపంద అనుకుంటున్నాడా... వొట్టి వెధవననుకుంటున్నాడా.... వొట్టి..''

''ఆపేయ్! ఆపేయ్! నీకున్న బిరుదులన్నీ ఏకరువుపెట్టకు. వెళ్ళి పనిచూడు.'' అంటూ గాండ్రించాడు సి.ఐ.

''యస్సార్!'' సెల్యూట్ కొట్టి అవతలికి నడిచాడు ఏడుకొండలు.

* * *

సమయం 11.15 !!

ఎస్సై ఏడుకొండలూ, ఇద్దరు కానిస్టేబుళ్ళూ మఫ్టీలో తిరుగుతున్నారు.

''సా.... ర్! అటు చూడండి. ఎవరో.... ముసుగులో వెళ్తున్నాడు'' నెమ్మదిగా అన్నాడు కనకారావ్.

''అవున్సార్...! వాడి తత్తరపాటు చూస్తుంటే... నాకూ అనుమానంగానే వుంది. వాడేసార్... మనక్కావల్సిన దొంగ!'' అన్నాడు రెండవ కానిస్టేబుల్.

''యస్! యు ఆర్ రైట్! వాడే... మనక్కావాల్సిన దొంగ నా కొడుకు!'' అన్నాడు ఏడుకొండలు.

''వ్వాట్! ఆ దొంగ... మీ... కొడుకా!!!'' అన్నారు ఇద్దరు కానిస్టేబుళ్ళూ ఒకేసారి.

''నోర్ముయ్యండహే! దొంగ నా కొడుకు అనేది ఓ తిట్టు!! తిట్టుకీ, మామూలు మాటకీ తేడా తెలియనంత థిక్ స్కిన్ అయిపోయిందేంట్రా మీ లైఫు...!?... మీ బతుకులు చెడ! నడవండి. మెల్లిగా వెళ్ళి వాణ్ని పట్టుకుందాం!''

ముగ్గురూ... నెమ్మదిగా ఆ ముసుగు వ్యక్తిని వెంబడించారు. ఆ ముసుగు వ్యక్తి, మెల్లిగా ఒక ఇంటి గేటు తెరిచి, కాంపౌండ్‌లోనికి వెళ్ళాడు.

''సార్! ఆ ఇల్లు.... మ్యూజిక్ టీచర్ నీలవేణిది!! పదండిసార్! ఆ దొంగను పట్టేద్దాం''



అన్నాడు కనకారావ్.

ముగ్గురూ ముందుకు గెంతి, ముసుగు వ్యక్తి వీపు మీద లాఠీలుంచి, "హ్యాండ్సప్!" అరిచారు.

ముసుగువ్యక్తి గజగజ వణుకుతూ, ఇటు తిరక్కుండానే చేతులు పైకెత్తాడు.

"ఒరేయ్... నువ్వెందుకొచ్చావో మాకు బాగా తెల్సు! మా కన్నుగప్పి నువ్వు తప్పించుకోలేవు! ఇప్పుడైనా ఒప్పుకుంటావా... ఈ ఎస్సై ఏడుకొండలంటే ఏమిటో...!!" అన్నాడు.

ఆ వ్యక్తి గిరుక్కున తిరిగి, ఏడుకొండలు కాళ్ళమీద పడ్డాడు.

"బాబూ...! నన్ను క్షమించి వదిలెయ్యండి బాబూ...! మీరు గొప్పవారని ఒప్పుకుంటాను బాబూ...! మీరు జేమ్స్‌బాండంతటోరు బాబూ! కానీ... ఈ నీలవేణి నా లవరు బాబూ" అంటూ ఆ వ్యక్తి ఏడవసాగాడు.

ఎస్సై, కానిస్టేబుళ్ళు మొహామొహాలు చూసుకున్నారు.

"అంటే... నువ్వు... మిరపకాయబజ్జీతో టపా పంపిన దొంగవి కాదా?"

"కాదు బాబూ? నేను... మీ పక్క వీధిలో వుండే టైలర్ శంకరాన్ని బాబూ" అంటూ తలెత్తి "నన్నొదిలేయండి బాబూ! మీకు రేపే... రెండు చొక్కాలు ఫ్రీగా కుట్టిస్తాను!" ఏడవసాగాడావ్యక్తి.

"సరేలే వెళ్ళు!" అన్నాడు ఎస్సై.

శంకరం వెనక్కి తిరిగి చూడకుండా పారిపోయాడు.

"సార్... వాళ్ళిద్దరూ ప్రేమించుకుంటే ధైర్యంగా రావచ్చు... ధైర్యంగా పోవచ్చు... దొంగలా ఇలా అర్ధరాత్రి వేళ రావాల్సిన పనేంటి" అడిగాడు కనకారావ్.

కమ్చీతో ఛెళ్ళున కొట్టినట్టు చూశాడు ఏడుకొండలు. "ఆ సంగతి వాడు పారిపోయిన తర్వాత గుర్తు చేస్తావా.... నీకసలు బుద్ధుందా" అంటూ ఎగిరాడు.

"అతను ఉండగా చెప్తే మిమ్మల్ని ఇన్నల్లు చేసినట్టవదా సార్?" అన్నాడు కనకారావ్.

"అదీ కరెక్టే" అంటూ మెచ్చుకోలుగా చూశాడు ఏడుకొండలు.

* * *

సమయం 11.30 !!

"కాపాడండీ...! కాపాడండీ...!"

"ఎవడే... నిన్ను కాపాడేది!"

"ఎవరైనా వచ్చి నన్ను రక్షించండి! హెల్ప్! హెల్ప్"

అంటూ ఒక ఇంట్లోనుండి కేకలు వినిపించాయి.

"సార్! మనక్కావల్సిన దొంగ ఈ ఇంట్లో దూరి... ఒక అమ్మాయిని బలాత్కారం చెయ్యబోతున్నాడు సార్! పదండి కాపాడదాం!" అన్నాడు కనకారావ్.

"ఊఁ...! కమాన్!" అరుస్తూనే వెళ్ళి దబదబా తలుపులు బాదసాగాడు ఏడుకొండలు.

"దొరక్కదొరక్క దొరికావే పిట్ట! నిన్నొదులుతానా!"

అంటోంది ఓ రౌడీగొంతు.

"అబ్బ... వదలరా... నీ మొహంమండ" అంటోంది ఓ స్త్రీ కంఠం.

"వదలనే పిట్ట!"

"వదలవా...!"

"వదలను!"

"వదలవా..!"

"వదలను!"

"అయితే సరిగ్గా పట్టుకో!!" అంది ఆడగొంతు

తలుపులు బాదుతున్న ఏడుకొండలు ఆగిపోయాడు. తనేం విన్నాడో ఓ క్షణం పాటు అర్థం కాలేదు. మరుక్షణమే తలుపులు ధన్‌మని తెరుచుకున్నాయి. పిడికెడు కారం కంట్లో పడింది.

"హయ్యో!! హమ్మో!! పుణ్యం చేయబోతే పాపం ఎదురైంది! హమ్మో...!" అంటూ కరెంటు షాక్ తగిలిన కాకిపిల్లలా గిలగిలా తన్నుకు చావసాగాడు ఏడుకొండలు.

కానిస్టేబుళ్ళు శ్రమదానం చేసి... పైకిలేపారతన్ని.

"అయ్యో... ఎస్సైగారు... మీరా! ఇంత అర్ధరాత్రిపూట తలుపులు విరిగేటట్లు బాదితే... ఎవరో దొంగవెధవనుకున్నాను" అంది కారంపొడి చల్లిన గృహిణి.

"ఇంతముందు 'హెల్ప్ హెల్ప్' అని అరిచింది మీరేనా?" కళ్ళు నులుము కుంటూ అడిగాడు ఏడుకొండలు.

"అబ్బే కాదండీ! టి.వి.లో కామెడీషో వస్తోంది. చూస్తున్నాను" అంటూ చెప్పిందా గృహిణి నవ్వుతూ.

* * *

సమయం 12:00

"సార్! ఆ దొంగెవడోగానీ... మనకు నిద్రలేకుండా చేయాలని... ఇలా ఉత్తరం ద్వారా భయపెట్టాడు. అంతేగానీ... మన ఏరియాలో మీరుండగా... దోచుకోవడానికి వాడెవడు సార్!" అన్నాడు కనకారావ్.

"ఏంటీ... డబుల్ మీనింగ్ ధ్వనిస్తోంది...."

"ఇందులో... డబుల్ మీనింగేముంది సార్! పదండి... హాపీగా స్టేషన్‌కెళ్ళి తొంగుందాం."

"అంతేనంటావా?!"

"అంతేసార్! పదండి!"

ముగ్గురూ పోలీస్‌స్టేషన్‌కొచ్చి పడుకున్నారు.






సరిగ్గా అరగంట తర్వాత ఫోన్ మోగింది!!

కనకారావ్ రిసీవర్ ఎత్తి మాట్లాడాడు. అవతలివారు ఏం చెప్పారోగానీ అతని చేతిలో నుండి రిసీవర్ జారిపోయింది.

"ఏమైంది కనకారావ్?" అడిగాడు ఏడుకొండలు.

"సార్... ఆ ఛాలెంజ్ విసిరిన దొంగ సరాసరి మీ ఇంటికే వెళ్ళి... మీ ఇంట్లో వున్న వైట్‌మనీ, బ్లాక్‌మనీ, బంగారు నగలు, కలర్ టీవీ, వి.సి.ఆర్., పట్టుచీరలు ఇలా... విలువైన సామాన్లన్నీ దోచుకెళ్ళాడట! సొంత ఇంటినే కాపాడలేని దద్దమ్మ... ఊరినేం కాపాడతాడని మీ ఆవిడ... మీతో తెగతెంపులు చేసుకుంటున్నట్లు ఉత్తరం రాసిపెట్టి పుట్టింటికి చెక్కేసిందట!" చెప్పాడు కనకారావ్.

"వ్వా..ట్..ట్! నా ఇంటిని దోచాడా? పదండి అందరూ." కేకేస్తూనే వెళ్ళి జీపును అధిరోహించాడు. స్టేషన్‌లో వున్న కానిస్టేబుళ్ళందరూ జీప్ ఎక్కారు. జీప్ సరాసరి ఎస్పై ఇంటిముందు ఆగింది.

ఇల్లు... బోసినవ్వుల పాపాయి నోరులా వుంది.

"సార్! సి.ఐ. గారికి ఈ విషయం తెలిస్తే...!? అన్నాడు కనకారావ్.

"ఏం ఫరవాలేదు. రేప్పొద్దునకల్లా ఎవడో ఓ గొట్టంగాడ్ని పట్టుకొచ్చి... నేరం వాడిమీద నెట్టి బొక్కలో తోస్తాను. డబ్బుదేముంది సర్వీసులో వున్నంతకాలం లక్షలకి లక్షలు సంపాదించుకోవచ్చు!" అన్నాడు ఏడుకొండలు.




ట్రింగ్ ట్రింగ్! ట్రింగ్ ట్రింగ్! అంది ఫోన్.

"ఇంత అర్ధరాత్రివూట ఫోన్ చేసే వెధవెవడబ్బా?!! అంటూ రిసీవర్ అందుకున్నాడు.

అవతలినుండి సి.ఐ. కంఠం ఖంగుమంది.

"సిగ్గూ శరం వుందటయ్యా... నీకు"

"మీరేం కంగారుపడకండ్సార్! నా ఇంటిని దోచుకున్న ఆ దొంగను రేపు ఉదయానికల్లా పట్టేస్తా!" అన్నాడు ఎస్పై ఏడుకొండలు.

"నేను మాట్లాడేది... నీ ఇంటిని దోచిన దొంగ గురించి కాదు"

"మరి...!?!"

"మన పోలీస్‌స్టేషన్‌ను దోచిన దొంగ గురించి"

"!?!?!?!?!?"

ఏడుకొండలు నోటమాట పడిపోయింది.

"స్టేషన్‌లో ఒక్క కానిస్టేబుల్‌ను కూడా వుంచకుండా తీసుకెళ్ళావా. ఆ దొంగ.... సంకెళ్ళు, తుపాకులు, బీరువాలు, బల్బులు, ట్యూబ్‌లైట్లు, జైలు ఊచలు, తలుపులు, లాఠీలు... ఇలా ఒక్కటి కూడా మిగలకుండా దోచుకుని.... స్టేషన్‌లో వున్న మిగిలిన ఖైదీలను తప్పించి... మరీ వెళ్ళాడు. యు ఆర్ డిస్మిస్డ్! నీ దిక్కున్న చోట చెప్పుకో పో" అంటోంది డీయస్పీ కంఠం.

ఆ తర్వాత ఆయన ఇంకేం అన్నాడో తెలియటానికి ఏడుకొండలు స్పృహలో లేడు. ■

## ఆకాశవాణి సంగీత సమ్మేళన్ - 2003 బ్రాడ్‌కాస్ట్ షెడ్యూల్

### 10.00 P.M. To 11.00 P.M


01.12.03
సతీష్‌ప్రకాష్ కవార్
షెహనాయి


05.12.03
పండిట్ బల్దేవ్‌రాజ్ వర్మ
వోకల్


09.12.03.
మైసూర్ జి.ఎన్.
నాగమణి శ్రీనాథ్
వోకల్


12.12.03
జయశ్రీ పట్నేకర్
వోకల్


02.12.03
ఉస్తాద్ మజర్ అలీ,
జావెద్ అలీ
వోకల్ డ్యూయెట్


06.12.03
ఇ. గాయత్రి
వీణ



10.12.03.
1. దేవికానందన్ మహరాజ్
పఖ్వాజ్
2. ఉస్తాద్ సబీర్‌ఖాన్
తబలా


13.12.03
డి. శేషాచారి
&
డి. రాఘవచారి
వోకల్ డ్యూయెట్

03.12.03
డా॥ రాజేంద్రప్రసాద్
మెమోరియల్ లెక్చర్


07.12.03
బహుద్దీన్ దాగర్
రుద్రవీణ


14.12.03
పండిట్ విశ్వమోహన్ భట్
గిటార్


04.12.03
ఎం.ఎస్.గోపాలకృష్ణన్
వయొలిన్


08.12.03
పండిట్ యశ్‌పాల్
వోకల్


11.12.03
కన్నకూడి
ఆర్.వైద్యనాథన్
వయొలిన్


15.12.03
ఆర్. వెంకటరామన్
వీణ



# సర్దార్ వల్లభ్‌భాయ్ పటేల్

## (31 అక్టోబర్, 1875   15 డిసెంబర్, 1950)

"... మనలను మనం పటిష్టపరచుకోవాలి.

ఈ పటిష్టతను మనలోనున్న విభేదాలతో సాధించలేం.

సమిష్టి లక్ష్యం, సమిష్టి ఆశయాలు, సమిష్టి కృషి ద్వారానే సాధించగలం"

- సర్దార్ వల్లభ్‌భాయ్ పటేల్

సర్దార్ పటేల్ 128వ జయంతి సందర్భంగా

జాతి ఆయనకు నివాళులు సమర్పిస్తోంది.

సమాచార ప్రసార మంత్రిత్వశాఖ

భారతప్రభుత్వం

davp/2003/332



ప్రముఖ గాయకుడు, స్వరకర్త
లలిత సంగీత విద్వాంసుడు,
వాగ్గేయకారుడు

**ఎం.చిత్తరంజన్**

సమర్పిస్తున్న శీర్షిక ఇది.

ఫోన్ నెం. 040-27402993

# లలిత సంగీతం

## ఏడుకొండల సామీ ఎక్కడున్నావయ్యా



ప॥ ఏడుకొండల సామీ ఎక్కడున్నావయ్యా
ఎన్ని మెట్లెక్కినా కానరావేమయ్యా ॥ఏడుకొండల సామీ॥

1చ: ఆకాశమంటు యీ కొండ శిఖరమ్ముపై
మనుషులకు దూరంగా మసలుతున్నావా ॥ఏడుకొండల సామీ॥

2చ: ఏ చోట గాంచిన నీ వుందువందురే
ఏమిటో నీ మాయ తెలియకున్నామయ్యా
ఈ అడవి దారిలో చేయూత నియ్యవా.... ఆ.....
ఈ అడవి దారిలో చేయూత నియ్యవా
నీ పాద సన్నిధికి మము చేర నియ్యవా ॥ఏడుకొండల సామీ॥

**రచన**
కీ॥శే॥ రావులపర్తి భద్రిరాజు
**గానం, సంగీతం**
కీ॥శే॥ ఘంటసాల వెంకటేశ్వరరావు
**రాగం**
శుద్ధ ధన్యాసి
**తాళం**
మిశ్రచాపు (కర్ణాటక సం॥)
రూపక్‌తాల్ (హిందుస్తాని సం॥)
**ఆరోహణ**
స గ మ ప ని స
**అవరోహణ**
స ని ప మ గ స

- షడ్జము, సాధారణ గాంధారం, శుద్ధమధ్యమం, పంచమం, కైశికి నిషాదం యీ రాగంలోని స్వరాలు.

ఈ పాటకు కూర్చిన బాణీలో అన్యస్వరమైన చతుశ్శృతి రిషభం కూడా చరణంలో ఒక్క చోట వాడబడింది. రాగాన్ని (అనగా 'సనిపమగరిస'అని) హిందుస్తాని సంగీతంలో "ధాని" అనే పేరుతో వ్యవహరిస్తారు. శుద్ధ ధన్యాసి కర్ణాటక సంగీతంలో వాడుకలో వున్న రాగమే. "ఎంత నేర్చినా" అనే త్యాగరాజ కీర్తన చాలా ప్రసిద్ధమైనది. ఇంకా కొంతమంది వాగ్గేయకారులు యీ రాగంలో రచనలు చేశారు. బాలమురళీకృష్ణగారు "నిన్నే నమ్మినానురా" అనే శ్రీ సత్యసాయి స్తుతి కీర్తనను రచించి ఆ స్వామి సమీక్షంలో గానం చేశారు. లలిత సంగీతంలో కూడా యీ రాగాన్ని పలువురు స్వరకర్తలు ఉపయోగించి మంచి బాణీలు కూర్చారు. దాశరథి గారి "లేరా కనువిచ్చి రారా" అనే ప్రబోధ గీతానికి యీ రాగంలో పాలగుమ్మి విశ్వనాథం గారు కూర్చిన చక్కని బాణీని నేను, మరికొందరు కళాకారులు కలసి ఆకాశవాణిలో పాడాము. అన్నమయ్య కీర్తనలు కూడా కొన్ని యీ రాగంలో కూర్చబడి మంచి ప్రాచుర్యాన్ని పొందాయి - "వినరో భాగ్యము విష్ణు కథ", "భావములోన బాహ్యమునందును గోవింద గోవింద అని కొలువవో మనసా" మొదలగునవి ఎంతో మంది కళాకారుల చేత తరచూ పాడబడుతున్న కీర్తనలు.

తిరుమల తిరుపతి దేవస్థానం వారిచే ఆస్థాన విద్వాంసుడుగా గౌరవింపబడిన మొట్టమొదటి లలిత సంగీత విద్వాంసుడు అమర గాయకుడైన ఘంటసాల గారు. తిరుమలేశునికి అత్యంత ప్రీతి పాత్రుడైన ఆయన ఆ స్వామిపై పాడిన అనేక స్తుతి గీతాలు, స్తోత్రాలు యీనాటికీ ప్రతిరోజూ తిరుమలలోని స్వామి సన్నిధిలో వినబడుతూనే వుంటాయి.

స్వామి సన్నిధికి చేరడానికి మానవునికి చేయూత నొసగి నడిపించమంటూ ఏడుకొండల మీద ఆకాశాన్నంటే శిఖరంపై వెలసివున్న వేంకటేశ్వరుని వేడుకునే యీ భక్తి గీతాన్ని రావులపర్తి భద్రిరాజుగారు ఎంతో హృద్యంగా రచించారు. దానికి అద్భుతమైన బాణీని కూర్చి సుమధురంగా గానం చేశారు ఘంటసాల.

## రావులపర్తి భద్రిరాజు

1929లో రామచంద్రపురంలో జన్మించిన భద్రిరాజుగారు తెలుగు సాహితీ లోకంలో సుస్థిర స్థానాన్ని సంపాదించుకున్న మంచి గేయకవి. వీరు



సుప్రసిద్ధకవి అడవి బాపిరాజుగారి బావమరిది. 1947లో ఎస్.ఎస్.ఎల్.సిలో ఉత్తీర్ణులైన తరువాత యీయన కళాపిపాసను గుర్తించిన బాపిరాజు యీయనకు గేయ, చిత్ర కళారచనల్లో శిక్షణనిచ్చారు. హైస్కూలులో వుండగా భద్రిరాజుగారికి మరొక సుప్రసిద్ధకవి ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రిగారు ఉపాధ్యాయులుగా వుండేవారు. 1952 తరువాత "శశి కళానియం" చేరుకుని భద్రిరాజుగారు ప్రఖ్యాత సంగీత దర్శకుల, గాయకులు సాలూరు రాజేశ్వరరావు గారితో పరిచయం పొంది, సుమారు పది సంవత్సరాలు ఆయనతో సన్నిహితంగా వుండి గేయ రచనలో పలువిషయాలు తెలుసుకుని వివిధ రీతుల్లో పాటలు వ్రాయడంలో శిక్షణ పొందారు భద్రిరాజుగారు. వీరు రచించిన ఎన్నో పాటలు ఎచ్.ఎం.వి. రికార్డులుగా విడుదలైనాయి. సాలూరి రాజేశ్వరరావు పాడిన "రావోయి చందమామా", "ఒకసారి మోము చూపవే", 'ఎదలో నిను కోరితినోయి'', ''షికారు'', ఘంటసాల గానం చేసిన "ఏడుకొండల సామి", "నమో వేంకటేశా నమో తిరుమలేశా", "పాడనా ప్రభూ", "జీవితమంతా కలయేనా" (ఈ పాట డా॥ సర్వేపల్లి రాధాకృష్ణన్ గారి మెప్పు పొందినది), ''సింతసిగురు సిన్నదానా'', కొన్ని నెహ్రూ పాటలు, డా॥ బాలమురళీకృష్ణ పాడిన "శరణం శరణం", ''హరే వేంకటరమణ బ్రోవరా'', ఆర్. బాలసరస్వతీదేవి పాడిన ''సరగునరారా''




(జావళి), జె.బి.రాఘవులు, ఎ.పి.కోమల, సుబ్బలక్ష్మి పాడిన "రావా చంద్రుడా", ప్రియా ప్రియా - యుగళ గీతాలు, పి.సుశీల పాడిన "సత్యదేవా స్వామి రారా", "రండయ్య పోదాము. సింహాద్రి" మొదలైనవి. వీటిలో చాలాపాటలు ఆకాశవాణిలో యీనాటికీ మనకు వినబడుతున్నవే. సుమారు 37 సం॥లుగా ప్రముఖ గాయనీగాయకులందరూ భద్రిరాజు గారి పాటలు పాడుతున్నారు. ఆకాశవాణిలో ప్రముఖ స్వరకర్త మంచాళ జగన్నాథరావుగారు కూడా యీ కవిగారి చాలా పాటలకు బాణీలు కూర్చారు. "శ్రీ వరలక్ష్మీవైభవం", "అమృత భక్తిసుధ"గా వీరి భక్తి గీతాలతో రెండు క్యాసెట్లు పి.సుశీల గానం చేయగా యిటీవల విడుదలైనవి.

ఈయన రచించిన రేడియో నాటకాలు "చాళుక్య విష్ణువర్ధనుడు", మగపెళ్లివారు, ధృవతార, సంక్రాంతి శోభ మొదలగునవి శ్రోతల మన్ననలు పొందాయి. ఆయన రచించిన కొన్ని సినిమా పాటల చిత్రాలు నిర్మాణ దశలో వున్నాయి. వీరి ముద్రిత గ్రంథాలు - మంచుతెరలు (నాటికలు), కమలాంజలి (గీతాలు), కులపతి (బాపిరాజు సంచిక). అముద్రిత గ్రంథాలు చాలా వున్నాయి.

మద్రాసులో 1987లో ఉగాది కవిసమ్మేళనంలో కావ్యగానం చేసిన భద్రిరాజుగారిని ఘనంగా సన్మానించారు. రామచంద్రపురంలోని శ్రీ త్యాగరాజ సభవారు వీరిని సత్కరించారు. కవిగా ఘనకీర్తిని బడసి కళామతల్లికి సేవలందించిన భద్రిరాజుగారు యిటీవలే పరమపదించారు. అయితే వారి సాంస్కృతిక వారసత్వాన్ని వారి వంశంలోనివారు అందుకుని రాణిస్తున్నారు. భద్రిరాజుగారి మనమడు శ్రీ వీరేశ్ టి.వి. సీరియల్స్‌లో కథలు, దర్శకత్వం, నటన మొదటగు వాటిలో ప్రావీణ్యం సంపాదించుకున్నారు. రావులపర్తి వారి మేనల్లుళ్లు శ్రీయుతులు ఉదయకుమార్, రత్నకుమార్‌లు కర్ణాటక శాస్త్రీయ, లలిత సంగీతాల్లో మంచి గాయకులుగాను, స్వరకర్తలుగాను ఆకాశవాణి విజయవాడ కేంద్రంలో గుర్తింపును పొంది ఎన్నో మంచి కార్యక్రమాలలో తమ నైపుణ్యాన్ని ప్రదర్శించి మన్ననలు పొందారు. ప్రస్తుతం హైదరాబాదులో వీరిద్దరూ కళాసేవను కొనసాగిస్తున్నారు.

## శుద్ధ ధన్యాసి రాగం ఆధారంగా కొన్ని తెలుగు చిత్రగీతాలు

| పాట | చిత్రం | గానం | స్వరకర్త |
|---|---|---|---|
| 1. విరించినై విరచించితిని | సిరివెన్నెల | సుశీల, బాలసుబ్రహ్మణ్యం | కె.వి.మహదేవన్ |
| 2. సడిసేయకోగాలి | రాజమకుటం | పి.లీల | మాస్టర్‌వేణు |
| 3. ఎన్ని జన్మలైనా ఏది లోకమైనా | ఏడుకొండలస్వామి | ఎస్.జానకి, ఇళయరాజా | ఇళయరాజా |

# అర్థం చేసుకుందాం ఆస్వాదిద్దాం



ఘంటసాల జీవితంలో 1953 సంవత్సరానికి ఒక ప్రత్యేక స్థానం ఉందనిపిస్తుంది. ఘంటసాల నిర్మించిన 'పరోపకారం' చిత్రం ఆ ఏడాదే విడుదలై ఆయనకు ఎంతో అసంతృప్తిని కలిగించింది. ఆ ఏడాదిలోనే ఆయనకు నేపథ్య గాయకుడిగా విశేషఖ్యాతిని సంపాదించి పెట్టిన 'దేవదాసు' చిత్రం విడుదలైంది. తమిళంలోనూ 'దేవదాస్' పేరిట విడుదలైన ఆ చిత్రం తెలుగు చిత్రం లాగానే ఘన విజయం సాధించింది. ఘంటసాలను తమిళులకు మరింత సన్నిహితులను చేసింది.

**ఘంటసాల కీర్తి అజరామరం చేసిన 'జగమేమాయ' పాట పాఠం:**

జగమేమాయ బ్రతుకే మాయ
వేదాలలో సారమింతేనయా ఈ వింతేనయా ॥జగమే॥
కలిమి లేములు కష్టసుఖాలు
కావడిలో కుండలని భయమేలోయీ
కావడి కొండేనోయ్ కుండలు మన్నే నోయ్
కనుగొంటే సత్యమింతేనోయీ ఈ వింతేనోయీ ॥జగమే॥
ఆశ మోహముల దరి రానీకోయీ
అన్యులకే నీ సుఖము అంకితమోయీ
బాధే సౌఖ్యమనే భావన రానీవోయ్
ఆ ఎరుకే నిశ్చలానందమోయ్ - బ్రహ్మానందమోయ్...॥జగమే॥

**రామయ్యాదాస్ రాసిన తమిళ గీతం ఇది:**

ఉలగే మాయమ్ వాళ్వే మాయమ్
నిలైయేదు నామ్ కాణుమ్ సుగమే మాయమ్
కాణుమ్ సుగమే మాయమ్ ॥ఉలగే॥
అలైయుమ్ నీర్ మేవుమ్ కుమిళాదల్ పోలే
ఆవదుపోయ్ ఆవదెల్లామ్ ఆశైయినాలే
అరస బోగముమ్ వైబోగముమ్ తన్నాలే
అళియుమ్ నామ్ కాణుమ్ సుగమే మాయమ్ ॥ఉలగే॥
ఉఱవుం ఊరారుమ్ ఉటాార్ పెట్ఱారుమ్
ఓడిడువార్ కూడ వరార్ నామ్ శెల్లుమ్ నేరమ్
మఱైనూల్ ఓదువదుమ్ ఆగుమిదే సారమ్
మనదిల్ నామ్ కాణుమ్ సుగమే మాయమ్ ॥ఉలగే॥

'దేవదాసు' చిత్రానికి సంగీతదర్శకుడు సి.ఆర్.సుబ్బురామన్. దర్శకులు- వేదాంతం రాఘవయ్య. నిర్మాత - డి.ఎల్. నారాయణ. తెలుగు చిత్రానికి 'సముద్రాల' రచయిత. అక్కినేని నాగేశ్వరరావు ధరించిన అజరామర పాత్రలలో దేవదాసు స్థానం ప్రత్యేకమైనది. ఆ చిత్రంలో పాటలను తమ జీవితంలోని వివిధానుభవాలను మేళవించి పాడామని చెప్పారు ఘంటసాల. తమకు విశేషఖ్యాతి తెచ్చిపెట్టిన 'జగమేమాయ' పాట గురించి 1972లో ఆకాశవాణి శ్రోతలకు చెబుతూ "ఆ పాట నన్ను పాడమని పిలిచినప్పుడు నాకేదో తెలియనటువంటి బాధ కలిగింది. ఆ బాధతోనే రిహార్సల్సు చేసి ఇంటికి వచ్చి చాలా బాధపడుతూ ఉండేవాడిని- ఎలా పాడడమా అని. నా జీవితానికి సంబంధించిన పాట కాబట్టి ఆ జీవితాన్నంతా మలచుకొని, జీవితంలో ఉండే అనుభవాన్నంతా మననకు తెచ్చుకుంటూ భావం చెడకుండా పాడాలనే బాధతోటి వారం పదిరోజులు ఏదో తెలియని బాధతో క్రుంగి కృశించిపోయి పాడిన పాట కాబట్టి జరిగిన ఇరవై సంవత్సరాలుగా మీ హృదయాలలో నాటుకు పోయింది" అన్నారు ఘంటసాల.

ఘంటసాల సంగీత జీవిత రజతోత్సవం సందర్భంగా 1970లో ప్రత్యేక సంచిక ఒకటి వెలువడింది. ఆ సంచిక కోసం అక్కినేని నాగేశ్వరరావుగారు ఘంటసాల గురించి తమ అమూల్యమైన అభిప్రాయాలు తెలియజేస్తూ వ్యాసం ఒకటి రాశారు. అందులో ఘంటసాల గానానికి 'దేవదాసు'లో ఆయన పాడిన పాటలకూ ఉన్న ప్రత్యేకతలను ప్రస్తావించారు నాగేశ్వరరావుగారు.

"శబ్దార్థాటమే ప్రధానంగా నాటకరంగ స్థలం మారుమోగిన శకానికి స్వస్తి చెప్పి శ్రావ్యంగా అర్థవంతంగా రాగభావాలను మేళవించి పాడే నవశకానికి 'కరుణశ్రీ' పద్యాలను పాడడం ద్వారా ఘంటసాల గారు నాంది పలికారు... సినిమా సంగీతంలో ఆయన ఈ శిల్పానికి జయపతాకం ఎగరవేసిన చిత్రం 'దేవదాసు'. నటుడుగా నాకు గొప్ప పేరు తెచ్చి నన్ను నిలబెట్టిన చిత్రం కూడా అదే. అయితే అందులో నా నటన గురించి ఈనాటి నాగేశ్వరరావుగా నాకు పూర్తి తృప్తిలేదు. కాని అందులో ఘంటసాలగారి పాటలను ఇప్పటికీ గౌరవిస్తాను. దేవదాసు ఆనందాన్ని దేవదాసు చిలిపితనాన్ని పొగరును, ఆ తర్వాత ఘట్టాలలో అతని హృదయావేగాన్ని క్షోభను త్రాగిన మైకాన్ని మొత్తం అతని జీవితంలోని విషాదాన్ని చిరస్మరణీయంగా గానం చేశారాయన. నటుడిగా నేనెంత ఉత్తేజంతో ఆ పాత్రను చేపట్టి కృషి చేశానో అంతుకు మించిన శ్రద్ధతో భావుకతతో ఆయన పాడారు. కొన్ని చోట్ల ఆయన మెలకువలు వింటూంటే నా మనసులో భావాలను, నా కళ్లలో నటనను ఈయన ఊహించి పాడుతున్నారా అన్నట్లనిపించేది. అంతేకాదు నేను ఊహించని కొన్ని హావభావాలకు ఆయన స్వరూపం కల్పించారు" అన్నారు అక్కినేని నాగేశ్వరరావుగారు.

'దేవదాసు' చిత్రం నిర్మాణంలో ఉండగా ఘంటసాలకు చిత్ర సంగీత దర్శకుడు సి.ఆర్.సుబ్బురామన్‌తో 'ప్రణయకలహం' వచ్చి తాను పాటలు పాడబోనని చెబితే సుబ్బురామన్ "నీవు పాడకపోతే పాటల సొగసు చెడిపోతుంది రాజా! నువ్వే పాడాలి ఈ పాటలన్నీ" అని చెప్పారట (ఘంటసాలను సుబ్బురామన్ ఎంతో ప్రేమతో 'రాజా' అని పిలిచేవారు.)

'దేవదాసు'లో తాగుబోతు పాటలు ముద్దగా రావాలని నాగేశ్వరరావు గారు ఆ పాటల రికార్డింగ్ ముందు ఘంటసాలకు ఐస్ తినిపించీ ఐస్ ముక్కలు నోట పెట్టుకుని పాడమనీ ప్రోత్సహించినా - ఐస్ తిని పాడడానికి ప్రయత్నించినప్పుడు శ్రుతి కుదరకపోవడంతో ఘంటసాల ఆ ప్రయత్నం విరమించారట!

'దేవదాసు' చిత్ర నిర్మాణంలో ఉండగానే సుబ్బురామన్ మరణించారు. అప్పటికి కొన్ని పాటల సంగీత రచన మిగిలి ఉండగా ఆయనకు సహాయకులుగా ఉన్న ఎం.ఎస్.విశ్వనాథన్ సుబ్బురామన్ పేరుమీదే - మిగిలిన పాటలకు సంగీతం కూర్చి 'దేవదాసు' చిత్రానికి నేపథ్య సంగీతమూ సమకూర్చారు. 'జగమే మాయ' పాటకు ఎం.ఎస్.విశ్వనాథన్ సంగీత రచన చేశారు. అయితే ఘంటసాల తన కచేరీలలో 'దేవదాసు' పాటల సంగీత కర్తగా సుబ్బురామన్ పేరునే ప్రస్తావించేవారు. 1956లో తమిళనాడులోని సేలంలో విశ్వనాథన్ రామమూర్తి సారథ్యంలో జరిగిన ఒక సంగీత కార్యక్రమంలో 'జగమేమాయ' పాట పాడుతూ ఆ పాటకు తమ ప్రియసోదరులు విశ్వనాథన్ సంగీతం సమకూర్చారని చెప్పారు ఘంటసాల.

'దేవదాసు' చిత్రంలోని పాటల రచయితగా సముద్రాల రాఘవాచార్య గారి పేరే కనిపించినా ఆ పాటలు చాలామటుకు మల్లాది రామకృష్ణశాస్త్రి గారే రాశారని పెద్దలు కొందరు చెబుతుంటారు. 'జగమేమాయ' అని అద్వైతులయిన శాస్త్రిగారే అనగలరు గానీ వైష్ణవులైన ఆచార్యులువారు అని ఉందరనీ కొందరి అభిప్రాయం.

'జగమేమాయ' పాటలో వినిపించే దగ్గుకూడా ఘంటసాలదే. అందువల్ల ఆయన కచేరీలలో ఆ పాట పాడినప్పుడు ఎప్పుడయినా ఆ దగ్గు ప్రస్తావన కూడా చేస్తూ ఉండేవారు... అలా 'గీతాలకు ముందు ఉపోద్ఘాతాలు' చెప్పే సంప్రదాయానికీ ఘంటసాల నాంది పలికారు.

'జగమే మాయ' పాట సన్నివేశంలో దేవదాస్ తమిళ చిత్రం కోసం ఘంటసాల పాడిన 'ఉలగే మాయం' పాట ఎంతో ప్రసిద్ధి గడించింది. ఘంటసాల భౌతిక కాయానికి మద్రాసులో అంత్యక్రియలు జరుగుతూ ఉండగా శ్మశానంలో ఒక తమిళ అభిమాని 'ఉలగే మాయం' పాట బిగ్గరగా పాడి కన్నీళ్లు పెట్టుకున్నాడు. ఆ పాట ప్రశస్తికి గుర్తుగా కొన్నేళ్ల క్రితం హెచ్.ఎం.వి. సంస్థ 'ఉలగే మాయం' పేరిట ఘంటసాల పాడిన కొన్ని తమిళ చిత్ర గీతాల కేసెట్ విడుదల చేసింది.

తెలుగు పాటల కోసం చేసిన బాణీలలోనే 'దేవదాస్' తమిళ చిత్రంలోని పాటలూ వినిపిస్తాయి. తెలుగు పాటల భావాలనే తమిళ గీతాలు ప్రతిబింబించాయి.

'జగమే మాయ' పాట చోట తమిళ చిత్రంలోని 'ఉలగే మాయం' పాట రాసినవారు తంజై ఎన్.రామయ్యాదాస్ (తంజై అంటే తంజావూరు).

తమిళ గీతం పల్లవి తెలుగు పాట పల్లవిని ప్రతి ధ్వనించినా తెలుగు పాటలోని భావాలకు భిన్నమైన భావాలు తమిళ గీతంలో కనిపిస్తాయి.

**'ఉలగే మాయం' తమిళగీతం భావానువాదం చూద్దామా!**

జగమే మాయ జీవితమే మాయ
నిలకడ ఏది (నిలకడైనది ఏదీ?)
మనము పొందే సుఖమే మాయ ॥జగమే॥

అలలమీది నీరు బుడగలయ్యేట్టుగా
జరిగేదంతా అబద్ధమే జరిగేవన్నీ ఆశవల్లే
రాజభోగమూ వైభవమూ వాటంతట అవే
నశిస్తాయి - మనం పొందే సుఖమే మాయ ॥జగమే॥

మిత్రులూ ఊరివారూ బంధువులూ తల్లిదండ్రులూ
పారిపోతారు - వెంటరారు - మనం వెళ్లిపోయేవేళ
వేదం చెప్పే సారం ఇదే
మనం పొందే సుఖమే మాయ ॥జగమే॥

'జగమే మాయ' అంటూ సాగే ఈ పాటల మాయలో పడి మైమరవని తెలుగువాళ్లూ తమిళులూ అరుదనే చెప్పాలి.

**- పి.ఎస్.గోపాలకృష్ణ**

**'దేవదాసు' చిత్రం సాధించిన ఘనతకు మరొక గుర్తు - తెలుగు చిత్రంలోని పాటలను కన్నడ లిపిలో పుస్తక రూపంలో ప్రచురించడం!**



ಜಗಮೇ ಮಾಯಾ - ಬ್ರತುಕೇ ಮಾಯಾ
ವೇದಾಲಲೋ ಸಾರಮಿಂತೇನಯ್ಯಾ ಈ ವಿಂತೇನಯ್ಯಾ
ಜಗಮೇ ಮಾಯಾ - ಬ್ರತುಕೇ ಮಾಯಾ
ವೇದಾಲಲೋ ಸಾರಮಿಂತೇನಯ್ಯಾ - ಈ ವಿಂತೇನಯ್ಯಾ
ಕಲಿಮಿ ಲೇಮುಲಾ ಕಷ್ಟಸುಖಾಲೂ
ಕಾವಡಿಲೋ ಕುಂಡಲನೀ - ಭಯಮೇಲೋಯೀ
ಕಾವಡಿ ಕೊಯ್ಯೇನೋಯ್ - ಕುಂಡಲು ಮನ್ನೇನೋಯ್
ಕನುಗೊಂಟೇ ಸತ್ಯಮಿಂತೇನೋಯಿ - ಈ ವಿಂತೇನೋಯಿ
ಆಶಾ ಮೋಹಮುಲಾ - ದರಿರಾನೀ ಕೋಯೀ
ಅನ್ಯುಲಕೇ ನೀ ಸುಖಮೂ - ಅಂಕಿತ ಮೋಯೀ
ಬಾಂಧೇ ಸೌಖ್ಯಮನೇ - ಭಾವನ ರಾನೀ ವೋಯ್
ಆಯೆರುಕೇ ನಿಶ್ಚಲಾನಂದವೋಯ್ ಬ್ರಹ್ಮಾನಂದ ಮೋಯ್



# ఘంటసాల స్వరపరచి గానం చేసిన చిత్రేతర గీతాలలో కొన్ని...

**స్వాతంత్ర్యము** — **తోలేటి**

స్వాతంత్ర్యమే మా జన్మ హక్కని చాటండి
నిరంకుశంబగు శక్తులెగిరినా
నిర్భయముగ నిదురించండి
పరుల దాస్యమున బాధలు పొంది
బ్రతికిన చచ్చిన భేదమె లేదు ॥స్వా॥
కవోష్ణ రుధిర జ్వాలల తోటి
స్వతంత్ర్య సమరం నెరపండి
ఎంత కాలమిటు సహించియున్న
దోపిడి మూకకు దయరాదన్న ॥స్వా॥
సంఘము లోను ఐక్యత వేగమె
సంఘట పరుపుము శాంతి పధాన
స్వర్గతుల్యమౌ స్వతంత్ర్యజ్యోతికి
మాంగల్యపు హారతులిమ్మా ॥స్వా॥

**అత్తలేని కోడలు** — **జానపదగీతం**

అత్తలేని కోడలుత్తమురాలు ఓలమ్మా
కోడలు లేని అత్త గుణవంతురాలు - అహఁ ఊహుఁ
కోడలా - కోడలా - కొడుకు పెళ్ళామా ఓలమ్మా
పచ్చిపాల మీద మీగడేదమ్మా - ఆ -
వేడి పాలలోన వెన్న యేదమ్మా - అహఁ ఊహుఁ
అత్తమ్మ నీ చేత ఆరళ్లైకాని - ఓలమ్మా
పచ్చి పాల మీద మీగడుంటుంద - ఆ -
వేడి పాలలోన వెన్న వుంటుందా? - అహఁ ఊహుఁ
వంట యింటిలోన ఉట్టి మీదుంచిన
సున్నుండలేమాయె కోడలా - మినప
సున్నుండలేమాయె కోడలా - అహఁ ఊహుఁ
ఇంటికి పెద్దయిన గండుపిల్లుండంగ
ఇంకెవరు వస్తారె అత్తమ్మా - వేరె
ఇంకెవరు తింటారె అత్తమ్మా
ఛీ... పో... నీ జిమ్మడ.. ఉండు నీ పని చెప్తా
కొరవితో అత్తమ్మ గుమ్మానికంటా వచ్చిందీ
పొమ్మని కాలంట కుట్టిందీ తేలు
అయ్యో... అబ్బా... అమ్మా... అయ్యో...
ఆ ఎందుకీ పోరని ఏడుస్తూ మా అత్త
మంచి దాని మల్లె మళ్లిపోయిందె.. అహఁ ఊహుఁ

**భారతీయుల** — **తోలేటి**

భారతీయుల కళా ప్రాభవమ్మొలికించి
తీయగా పాడిన కోయిలమ్మ
కమనీయ వంగ వంగడమెల్ల మూర్తిలో
ప్రసరించినట్టి మేల్ పసిడి బొమ్మ
స్వారాజ్య వీర విహార రంగములోన
కోరి దూకిన తెన్గు కోడలమ్మ
మానవ కల్యాణ మంగళారతి జ్యోతి
చేయెత్తి చూపిన చెల్లెలమ్మ
ప్రాక్పశ్చిమాలు విస్తారించి ప్రేమింప
పాఠాలు నేర్పిన పంతులమ్మ
భరత నారీ ప్రతాప ప్రభావ గరిమ
ఖండ ఖండాలు జల్లి విఖ్యాతిగన్న
దివ్యమూర్తి సరోజిని దేవి వోలె
దీర్ఘ సూత్రాన ఆ దేవి దివ్య సుగుణ
పుష్పములనేరి విరిదండ పూర్తిచేసి
పుణ్య భారత మాతను పూజ చేసి
ఘనత కెక్కుడి భారత వనితలారా!

**స్వతంత్రసిద్ధి** — **ప్రయాగ**

ఆ మొగల్ రణ ధీరులు
తంతియాటోపీ ఝాన్సీల స్వాతంత్ర్య సమరదీప్తి
త్యాగమూర్తులు తిలక్, దాదా, సి.ఆర్. దాసు, మాలవ్య
మన గాంధి మహిత శక్తి
జాతీయ సంస్థయై శాంత్యహింసలతోడ
కాంగ్రెస్సు నడిపిన కదన ఫణితి
తమిళ, ఆంధ్ర, కేరళ ధారుణీ ప్రజలెల్ల
ధారవోసిన మహా త్యాగఫలము
మాతృదేశముగావ క్షాత్రన్నుడై బోసు
పడరాని యిడుముల పడిన శ్రమయు
పండిత నెహ్రూజీ, పటేల్. పట్టాభియు
రాజాజీ నెరపిన రాజ్య పటిమ
భారతీయుల పుణ్యంబు పండెననగ వచ్చెనిదిగో
సుస్వాతంత్ర్య వత్సరంబు భారతీయుల పుణ్యంబు పండెననగ
వచ్చెనిదిగో సుస్వాతంత్ర్య వత్సరంబు
పొత్తుగూడుచు శుభముల పొందుడయ్యా తొల్లి
భారత విభవంబు వెల్లివిరియ!

**పోలీసెంకటసామి** — **సముద్రాల సీనియర్**

మరువలేనురా నిను నేను మరువలేనురా ఓఓఓ
పంచదార వంటి పోలీ సెంకటసామి
నిన్ను నేను మరువలేనురా
ఓయ్.... వాలు కన్నులా మువ్వలెంకటసామి
నిన్ను నేను మరువలేనురా
నీకు వచ్చిందీ కోర మీసం
నాకు వచ్చిందీ దోర వయసు
ఇద్దరి మనసు ఒక్కటైతే
ఎనక సింతలేని బతుకె - యెంకటసామి ॥నిన్ను॥
కన్నూ కన్నూ కలిసిందోయ్ - నిన్నూ నన్నూ కలిపిందోయ్ -
ఈడనున్న నేనేడనున్న నీ నీడ నేనోయ్ -
పోలీసెంకటసామీ -నిన్ను నేను మరువలేనురా
నా వాడవేనోయ్ పోలీసెంకటసామి
సందులేదు మనకు - సందమామ తోడు ॥నిన్ను॥

## నీ కొండకు నీవే రప్పించుకో — రచన : సి.సుబ్బారావు

నీ కొండకు నీవే రప్పించుకో ఆపద మొక్కులు మాచే యిప్పించుకో ॥2॥
ఓ తిరుపతి వెంకటేశా ॥2॥ ఓ శ్రీనివాసా
నీ విచ్చిన యీ జన్మకు విలువ కట్టుకో ॥నీ కొండకు॥
కొండంత సంసారం మోయలేని మానవులం
ఏడు కొండలనెక్కి రమ్మంటే రాలేము
సాటి మనిషి సౌఖ్యానికి సాయపడని దుర్బలులం
స్వర్గానికి నిచ్చెనలు వేయలేము ॥నీ కొండకు॥
మా మనస్సు మా హృదయం పరస్పరం శత్రువులై
మా లోపలి దివ్యజ్యోతి మసకేసి పోతున్నది
అహంకార మణగించి మమకారం తొలగించి
చేయూతనిచ్చి మమ్ము చేరదీసుకో ॥నీ కొండకు॥

## జయ జయ జయశ్రీ వేంకటేశా — రచన : ఎ.వేణుగోపాల్

జయ జయ జయ శ్రీ వేంకటేశా
జయ జయ జయ ఓం శ్రిత జన పోషా ॥జయ॥
సనకాది ఋషులు సన్నుతి సేయ
లక్ష్మీదేవి నీ పాదము లొత్త
భృగు కోపమున వైకుంఠమిడి
భూలోకమునే జేరితివయ్యా ॥జయ॥
వల్మీకమున దాగియుండగ
రుద్రుడె గోవై పాలివ్వ
గొల్ల డొకడు నీ శిరమున బాదగ
ఘోరశాపమునే యిచ్చితివయ్యా ॥జయ॥
కానలలోన ఒంటివాడవై
తిరుగుచు వకుళను జేరితివయ్యా
వకుళమాతకు ముద్దుబిడ్డవై
మురిపెము తోనే పెరిగితివయ్యా ॥జయ॥
అంత ఒక దినంబున పూదోటలోన అకాశరాజు తనయ
శ్రీ పద్మావతీదేవిని గాంచి వలచి వలపించితివో మహానుభావా!
లోకనాథునీ కల్యాణమునకు
కుబేరపతిని యాచించి
ఆ కుబేర ధనముతో నీ కల్యాణము
మహోత్సవంబుగ జరిగిందయ్యా
ఆనందమానందమాయనే పరమానందమానంద మాయెనే
ధర్మపత్నితో దారిలో ఉన్న అగస్త్యముని ఆశ్రమంబున
ఆరుమాసములు అతిథిగా నున్నావో దేవా
కొండలపైని తొండమానుడు
ఆలయమొకటి కట్టించెనయా
స్వర్ణ శిఖరపు శేష శైలమున
స్థిర నివాసివై వెలసితివయ్యా ॥జయ॥
రమాదేవి నిను వెదకుచు చేరగ
శిలా రూపమున వెలసితివయ్యా
భక్త కోటికిదె నిత్య దర్శనము
పాప విమోచన పుణ్య ఫలమయా ॥జయ॥
నీ మహాత్మ్య పఠనమే మహాస్తోత్రమయా
నీ దివ్య నామమే కైవల్యమయా
దీనుల మము కరుణించవయా ఓ వెంకటేశా
నమో వేంకటేశా నమః శ్రీనివాసా .....ఓం....
నమో చిద్విలాసా నమః పరమపురుషా .....ఓం....
నమో తిరుమలేశ, నమో కలియుగేశా .....ఓం....
నమో వేదవేద్యా నమో విశ్వరూపా .....ఓం....
నమో లక్ష్మీనాథా నమో జగన్నాథా
నమస్తే నమస్తే నమః
ఏడుకొండలవాడా వెంకటరమణా గోవిందా గోవిందా

## నమో వేంకటేశా — రచన : రావులపర్తి భద్రిరాజు

నమో వేంకటేశా నమో తిరుమలేశా
నమస్తే నమస్తే నమః
నమో వేంకటేశా నమో తిరుమలేశా
మహానందమాయె ఓ మహాదేవదేవ ॥నమో॥
ముడుపులు నీ కొసగి మా మొక్కులు దీర్తుమయా
ముక్తి కోరి వచ్చే నీ భక్తుల బ్రోవుమయా
భక్తుల బ్రోవుమయా ॥నమో॥
నరక తుల్యమౌ యీ భువి స్వర్గము సేయవయా
మనుజులు నిను జేరే పరమార్థము తెలుపవయా
పరమార్థము తెలుపవయా ॥నమో॥
నమో వేంకటేశా నమో తిరుమలేశా
నమో వేంకటేశా నమో తిరుమలేశా
నమో తిరుమలేశా నమో నమో తిరుమలేశా

## శ్రీ వేంకటేశ్వర ప్రభాత ప్రార్థన — రచన : ఎ.వేణుగోపాల్

కౌసల్య తనయ శ్రీరామ కౌస్తుభాంగా
తూర్పున భానుడుదయించె తోయజాక్షా
దేవ సంబంధ కార్యాలను తీర్చుకోగ
వేడుకొందుము మేలుకో శ్రీ వేంకటేశా
లేవయ్య శ్రీహరి గోవింద లెమ్ము నిదుర
కల్యాణమొనరించ వేగ కమలనయన
ప్రాద్దెక్క నున్నదటు జూడ భుజగశయన
వేగలేవయ్య మము బ్రోవ వేంకటేశా
మధు కైటభారి శ్రీహరి ప్రక్కనుండి
ఎల్లలోకముల గన్న మా తల్లి లక్ష్మి
ఆశ్రితమానవుల సదా ఆదరించ
అలివేలు మంగమ్మ యిక మేలుకొమ్మా
బ్రహ్మాది దేవతలందరు భక్తిమీర
సురగురూత్తముని వెంట తరలి నేడు
నీ దివ్య రూపంబు గానక నిలచినారు
శ్రీఘ్రముగ లేవయ్య శ్రీ శ్రీనివాసా
కమలాలు వికసించు కాలమాయె
నానా సుగంధ కుసుమాలు నవ్వెనవిగో
పక్షుల గుంపుల తీయని పాట వినగా
వేగ లేవయ్య నిదుర శ్రీ వేంకటేశా
గ్రహములన్నియు నీ అనుగ్రహము పొంద
అష్టదిక్పాలురందరును నిష్ఠతోడ
నీదు పుష్కర స్నానమాడి నిలచినారు
చూడలేలెమ్ము అయ్యెనిక సుప్రభాతం
పద్మనాభ! పురుషోత్తమ! పాపనాశ!
వేంకటా చలపతి! విభో! వేంకటేశా!
శ్రీఘ్రముగ లేవయ్య ప్రభు శ్రీనివాస
చూడ మా తండ్రి అయ్యెనిక సుప్రభాతం... సుప్రభాతం
ఆకాశ గంగోదకంబును లోకనాథ
తెచ్చి పూజారులకై ముందె వచ్చిరయ్యా
వేదోపనిషన్మూర్తులౌ వైదికులును
వేచియున్నారు లేవయ్యా శ్రీ వేంకటేశా
లేచి నినుజూడ యీ వేళ నోచినాము... ప్రభూ...
లేచి నినుజూడ యీ వేళ నోచినాము
ఏ పూర్వ పుణ్యఫలమొగా ఎరుగలేము
చేసిన పాపాలు నేటితో మాసిపోగ
వేడుకొందుము కరుణించ వేంకటేశా
మంగళం కోసలేంద్రాయ మహనీయ గుణాత్మనే
చక్రవర్తి తనూజాయ సార్వభౌమాయ మంగళం




కలియుగ దైవం శ్రీ వేంకటేశ్వరునిపై ఎన్ని సిన్మాలు వచ్చినా పద్మశ్రీ బ్యానర్‌పై 1960లో వచ్చిన 'శ్రీవేంకటేశ్వర మహాత్మ్యం' చిత్రం మాత్రం శాశ్వత కీర్తిని సంపాదించుకుంది. 1939లో సి.ఎస్.ఆర్.ఆంజనేయులు, శాంతకుమారితో 'వేంకటేశ్వర మహాత్మ్యం' సినిమా తీసిన పి.పుల్లయ్యే ఈ

## శ్రీ వేంకటేశ్వర మహాత్మ్యం
(బాలాజి)

చిత్రానికి కూడా దర్శకత్వం వహించారు. పుష్కరిణిలో మునిగితే కలిగే దివ్యానుభూతి ఆ క్షేత్రంలో ఆలయం ముందున్న కుళాయి దగ్గర స్నానమాడినా కలిగినట్టు - పెండ్యాల సంగీత దర్శకత్వంలో వచ్చిన ఈ 'శ్రీ వేంకటేశ్వర మహాత్మ్యం'లోని పాటలు ఇప్పుడు క్యాసెట్ల రూపంలో విన్నా అదే ఆత్మానందాన్ని అనిర్వచనీయమైన అదే అనుభూతిని కల్గిస్తాయి. అటువంటి తాదాత్మ్యాన్ని కలిగించే ఆ చిత్రంలోని పాటలలో ఓ నాలుగు ఈ సంచికలో...

శ్రీదేవిని నీదు దేవేరిని ॥శ్రీదేవిని॥
సరిసాటి లేని సాభాగ్యవతిని ॥శ్రీదేవిని॥
అనుపమ కౌస్తుభమణియందు నెలకొని ॥అనుపమ॥
నీ హృదయ పీఠాన నివసించుదాన ॥నీ హృదయ॥ ॥శ్రీదేవిని॥
పాలకడలిలో ప్రభవించి
మురిపాల కడలిలో తేలితిని ॥పాల॥
పదునాల్గు భువనాలు పరిపాలించు
నీ మది నేలి లాలించు భాగ్యము నాదే ॥శ్రీదేవిని॥
కలిమికి నేనే దేవతనైనా
నీ చెలిమియే నా కలిమి కదా ॥కలిమికి॥
ఎనలేని అనురాగ సంతోషములతో...
ఏనాటికీ మనకు ఎడబాటు లేదు ॥ఏనాటికీ॥ ॥శ్రీదేవిని॥



ఈ పాటను ఎస్.వరలక్ష్మి గానం చేయగా, ఎన్టీఆర్, ఎస్.వరలక్ష్మి అభినయించారు. కథానుగుణంగా పాట మధ్యలో గుమ్మడి కూడా కన్పిస్తారు. బేహాగ్ రాగంలో వచ్చిన మరో మంచి పాట ఇది. 'ఎనలేని అనురాగ సంతోషములతో....' దగ్గర వచ్చే రాగాలాపనలో అమీర్ కళ్యాణి రాగచ్ఛాయలు కూడా ప్రయోగించబడ్డాయి. ఈ ఆలాపనను ఎస్.వరలక్ష్మి ఆవిష్కరించిన తీరు చూస్తే ఆమెను 'సుస్వరలక్ష్మి' అని పిలవాలనిపిస్తుంది. పైగా అభినయించింది కూడా లక్ష్మీదేవి పాత్రనే కనుక కథకు అవసరమైన రీతిలో ఆ పాత్ర స్వభావాన్ని పూర్తిగా ఆకళింపు చేసుకుని, ఆవహింపజేసుకుని.... సంపూర్ణ న్యాయంతో, పరిపూర్ణ జ్ఞానంతో పాడిన పాట ఇది. గాయనీమణులుగా పేరు తెచ్చుకోవాలనుకునే వారికి ఈ పాట ఓ పరీక్ష లాంటిది. ఇక రచయితగా ఈ పాటకు ఆరుద్ర అద్దిన సొగసులు ఈనాటికీ వసివాడనివి. 'పాలకడలిలో ప్రభవించి, మురిపాల కడలిలో తేలితిని' అంటూ

ఉపయోగించిన అభంగ శ్లేష, 'పదునాలుగు భువనాలు పాలించు నీ మదినేలి లాలించు భాగ్యము నాదే', 'కలిమికి నేనే దేవతననా నీ చెలిమియే నా కలిమి కదా' వంటి శబ్దగత చమత్కారాల ద్వారా అభివ్యక్తీకరించిన కవితా సౌందర్యం - ఇవన్నీ ఆరుద్రకు భాష మీదకు గల అధికారాన్ని, పట్టును చాటిచెబుతాయి.

లక్ష్మి : వరాల బేరమయా వనరౌ బేరమయా
పరాకు సేయకు పదేపదే దొరుకదయా ॥వరాల॥
దేవతలు దీవించి పంపిన పసరమయా ॥దేవ॥
కొన్నవారికన్ని సిరులు కూర్చు గంగిగోవయా ॥వరాల॥
మనిషికున్న తెలివున్నది మనిషిలోని చెడులేనిది
కొందామని అందరూ కొమ్ముపడితె కుమ్ముతుంది
కోరుకున్నవారి వెంట గోవులాగె వస్తుంది ॥వరాల॥
పచ్చనీ లచ్చిమికి పసుపు కుంకుమపెట్టి దినము
ప్రొద్దున్నే మొక్కుకుంటే పోతుంది పాపము
పచ్చనీ లచ్చిమికి పసుపు కుంకుమపెట్టి దినము
ప్రొద్దున్నే మొక్కుకుంటే పోతుంది పాపము
పాత్రచూచి పాలను మనసుతూచి మంచిని
ఇచ్చేది యీ ఆవు ఇదే కామధేనువు ॥వరాల॥



ఈ పాటకు గానం, అభినయం రెండూ ఎస్.వరలక్ష్మే! మధ్యమావతి రాగం ఈ పాటకు ఆధారం. ఈ పాటలో కూడా యస్.వరలక్ష్మి గానం చేసిన విధానం కమనీయం, గమనీయం. ఇప్పుడు వాడుకలో లేని కొన్ని కొన్ని పదాల గురించి తెలుసుకోవాలంటే ఇలాంటి పాటలు వినటం చాలా అవసరం. లేకపోతే వనరు, పసరము వంటి పదాలకు అర్థం చెప్పాలంటే నిఘంటువులు వెతుక్కోవలసిన పరిస్థితి వస్తుంది. 'కోరుకున్న వారి వెంట గోవులాగె వస్తుంది' అనే పద ప్రయోగం ఒక రకంగా చమత్కారం... ఎందుకంటే అక్కడ గోవురూపంలో వున్నది శివుడు కనుక. అలాగే చిత్రీకరణ పరంగా ఇంకో మాట చెప్పుకోవాలిక్కడ. ఈ పాటలో యస్. వరలక్ష్మి ఆవును గురించి పాడుతూ వున్నా దూడను లాలించే దృశ్యాలు ఎక్కువగా వుంటాయి. దర్శకత్వ ప్రతిభకు సంబంధించిన కోణంలో ఆలోచిస్తే - దూడ రూపం ధరించినది బ్రహ్మ.... మారు వేషంలో 'అమ్మ'గా వచ్చినామె లక్ష్మీదేవి. మరి లక్ష్మీదేవికి బ్రహ్మ...పుత్రుడేగా...!?

గోపాల... నంద గోపాలా
ఎన్నాళ్ళని నా కన్నులు కాయగ
ఎదురు చూతురా గోపాలా
ఎంత పిలిచినా ఎంత వేడినా
ఈ నాటికి దయ రాదేలా ॥ఎంత॥
గోపాలా నంద గోపాలా
వీనుల విందుగ వేణుగానము
విని తరింపగా వేచితిరా ॥వీనుల॥
వేచి వేచి ఈ వెన్నముద్దవలె
కరగిపోయెరా నా బ్రతుకు
కరగి పోయెరా నా బ్రతుకు ॥ఎన్నాళ్ళని॥
వెన్న మీగడలు జున్ను పాలకు
ఏమి కొరతరా మన ఇంటా ॥వెన్న॥
పాలను ముచ్చిలి పరుల చేతిలో
దెబ్బలు తినకురా కన్నయ్యా ॥పాలను॥
ఈ తల్లి హృదయము ఓర్వలేదయా ॥ఎన్నాళ్ళని॥



ఈ పాటను శాంతకుమారి గానం చేసి, ఆమెయే ముఖ్య పాత్రధారిణిగా అభినయించగా చిత్రీకరించారు. పీలూ రాగానికి అతి చక్కని ఉదాహరణ ఈ పాట. ఈ రాగంలో ఇదే అనుభూతితో పెండ్యాల 'శ్రీకృష్ణార్జున యుద్ధం' చిత్రంలో స్వరపరచిన 'నీకై వేచితినయ్యా ఓ ఏకాంత రామయ్యా...' పాటను కూడా ఈ సందర్భంగా గుర్తు చేసుకోగలిగితే పీలూ రాగంపై కొంత అవగాహన కలుగుతుంది. ఈ పాట సాహిత్యాన్ని పరికిస్తే - ద్వాపర యుగంలోని యశోదయే కలియుగంలో వకుళగా జన్మించిందన్న పురాణ గాథల వైచిత్ర్యాన్ని ఒంట పట్టించుకుని - వకుళ గొంతుకు యశోద మనసును జత చేస్తూ ఆత్రేయ రాశారా అనిపిస్తుంది. ముఖ్యంగా - 'వేచివేచి ఈ వెన్నముద్దవలె కరిగిపోయెరా నా బతుకు, పాలను ముచ్చిలి పరుల చేతిలో దెబ్బలు తినకురా కన్నయ్యా ఈ తల్లి హృదయము ఓర్వలేదయా.... లాంటి వాక్యాలను గమనిస్తే మాతృ హృదయం అనే ఆలయంలో అక్షర దీపాలను పెట్టి - కవిగా తన రుణం ఆయన తీర్చుకున్నాడేమోనన్నంత ఉన్నతంగా ఉందీ భావప్రకటన. శాంతకుమారి గళం కూడా అదే తదాత్మ్యాన్ని పంచుతుంది. ఇక ఈ పాటలో ఉపయోగించిన ముచ్చిలి (దొంగిలించుట) అనే పదం తెలుగు సినిమా పాటల్లో ఆ తర్వాత వచ్చినట్టుగా లేదు.

ఈ చిత్రంలో ఎస్.వరలక్ష్మి, శాంతకుమారి పాడిన పాటలను విన్న తర్వాత ఆ స్వర్ణ యుగాన్ని తిరిగి పొందే అదృష్టం మన తెలుగు సినిమా సంగీతానికి ఉందా అని ఎవరికైనా అనిపిస్తే - కాల ప్రవాహానికి ఎదురీది నిలబడగలిగే మానవత్వపు విలువలు వారిలో ఇంకా ఉన్నట్టు లెక్క.

ఆమె : ఎవరో అతడెవరో ఆ నవ మోహనుడెవరో
నా మానస చోరుడెవరో ॥ఎవరో॥
తొలి చూపులలో వలపులు చిలికి
దోచిన మగసిరి దొర ఎవరో ॥తొలి॥
అరయక హృదయమునర్పించితినె
ఆదరించునో ఆదమరచునో ॥ఎవరో॥
వలరాజా...? కలువల రాజా...?
కాడే... కన్నుల కగుపడినాడే!?
అకలంకుడె... హరిణాకుండు కాడే ॥అక॥
మరి ఎవరో ఏమరినానో ॥ఎవరో॥
చలువలు కురిసి జాబిలి చెలి
కలతను తెలిసీ కలుగదజాలి
కరుణ చూపి కబురు తెలిపి
రమ్మనవా నను చే కొమ్మనవా
అతడు : ఎవరో తానెవరో ఆ నవ మోహిని ఎవరో
నా మానసహారిణి ఎవరో ॥ఎవరో॥
నందన వనమానందములో
తొలిసారిగ పూచిన పూవో ॥నందన॥
తొలకరి యవ్వన మొలికిన నవ్వో ॥తొల॥
మనసిచ్చినదో నను మెచ్చినదో
ఆ జవ్వని ఎవరో తానెవరో ఆ నవ మోహిని ఎవరో
నా మానస హారిణి ఎవరో
ఎవరో తానెవరో...



ఈ పాట నిజంగా ఓ రసాత్మక గీతం. పెండ్యాల గుండెల్లో ఊపిరిపోసుకున్న స్వరానికి సుశీల, ఘంటసాల జీవ చైతన్యాల్ని కలబెట్టిన గీతమిది. లీనమై ఆలపించుకుంటూ పోతే కంటిపారలలో ఓ చెమరింపును, తదనుగుణమైన ఆత్మానందాన్ని కలిగించగలిగే స్వరరచన ఇది. బృందావన సారంగ రాగంలో స్వరపరచబడిన ఈ గీతం గ్రహభేదం వల్ల తిల్లంగ్ రాగం అని అనిపించే అవకాశం కూడా ఉంది. ఎన్టీఆర్, సావిత్రి అభినయించిన ఈ పాటను రచించిన ఆత్రేయ గురించి చాలా చెప్పాలీ సందర్భంగా....

తను ప్రేమించినవాడు మన్మథుడా (వలరాజా)... మరి కళ్లకు కనబడుతున్నాడే...!? పోనీ చంద్రుడా (కలువల రాజా)... జింక చిహ్నం మచ్చగా గల చంద్రుని (హరిణాంకుడు) లాంటివాడు కాదే.... మచ్చలేనివాడు (అకలంకుడు) కదా నా ప్రియుడు - అనే అర్థం వచ్చేట్లు ఉన్న రెండో చరణం - ఆత్రేయ ఎంత గొప్ప భావుకుడో తెలుపుతుంది. అయితే, నాణేనికి రెండో వైపు అన్నట్టు - పాత్రల ఔచిత్యం ప్రకారం ఆలోచిస్తే - శ్రీనివాసుడిగా అవతరించిన శ్రీ మహావిష్ణువుని అతనికన్నా స్థాయిలో చిన్నవారైన చంద్రునితోనూ, మన్మథునితోనూ పోల్చడం, ఆయన గుండెలపై ఉన్న శ్రీవత్స చిహ్నం గురించి మరిచిపోయి అకలంకుడు అని వర్ణించడం - ఇవన్నీ విమర్శలకు తావిచ్చే అంశాలు. అయితే, ఇందులో కూడా ఆత్రేయ పక్షాన వాదించాలంటే ఆ శ్రీనివాసుడు శ్రీమహావిష్ణువని తెలీకే కదా 'ఎవరో అతనెవరో' అని ఈ పద్మావతి పాడుకున్నది... అయినా, అరయక హృదయం అర్పించిన వారికి తమ ప్రియులు అకలంకులుగానే కన్పిస్తారు కదా! అని సమర్థించుకోవచ్చు. ఏదిఏమైనా, అంతటి ఆలోచన, అంతటి అంతర్మథనం, అంతటి అంతర్ముఖత్వం - రాసిన వారికి, విన్నవారికి కూడా కల్గిస్తున్నాయి కనుకనే ఆనాటి పాటలు ఈనాటికీ సాహితీ మర్యాదలను అందుకుంటున్నాయి.

'కరుణచూపి కబురు తెలిపి' అనే వాక్యంలో 'కబురు' నే ఉర్దూ పదాన్ని వాడినందుకు ఈ పాట రికార్డింగ్ అయిపోయాక గుర్తొచ్చి, విపరీతంగా కలవరపడ్డారట ఆత్రేయ. గురుతుల్యుడు మల్లాది రామకృష్ణశాస్త్రి దగ్గర తన బాధను వెళ్లబోసుకుంటే 'ఏం ఫర్వాలేదులే... ఆ కాలంలో బీబీ నాంచారి కూడా ఉందిగా' అంటూ ఆయన ఊరడించాకగాని నిద్ర పట్టలేదట ఆత్రేయకి. అనుకున్న పని పూర్తయిపోయి, అవసరం తీరిపోయిన తర్వాత నాదేం పోయిందిలే అంటూ చేతులు దులిపేసుకోకుండా - బాధ్యతను నెత్తిన వేసుకుని ఆత్మ క్షోభను స్వీకరించగలిగే అటువంటి నిజాయితీయే చేసే ప్రతి పనికీ సార్థకతను ప్రసాదించేది.

ఎన్నెన్నో రసానుభూతులను అందించే ఈ చిత్రంలోని మరికొన్ని పాటల గురించి వచ్చే సంచికలో.....

# సరిగపదమని 8

కూర్పు : టి.నవీన్

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| 1 | | 2 | ● | 3 | | 4 | | 5 |
| | ● | | ● | | ● | | ● | |
| | ● | ● | 6 | ● | 7 | ● | ● | ● |
| ● | 8 | 9 | | 10 | ● | 11 | 12 | |
| 13 | ● | | ● | | ● | 14 | | ● |
| 15 | | ● | 16 | | | ● | 17 | |
| | ● | 18 | | ● | ● | 19 | | ● |
| | ● | ● | | ● | 20 | ● | 21 | |
| 22 | | | ● | 23 | | ● | | ● |

పంపినవారి పేరు :..........................................................

వయసు :.......... వృత్తి:..................................................

చిరునామా :..........................................................

.....................................................................

..............................................ఫోన్:.............................

## నిబంధనలు:

ఎ) పోటీలో పాల్గొనగోరేవారు పైన ప్రచురించిన కూపన్‌తో పజిల్‌ను నింపి కవరులో పంపాలి. మరే విధంగా పంపినా ఆ ఎంట్రీ స్వీకరించబడదు.

బి) కవరుపై 'సరిగపదమని' అంటూ నంబర్‌తోసహా పేర్కొనటం మరచిపోకూడదు.

సి) ఏ బహుమతి కైనా ఒకరు కన్నా ఎక్కువగా విజేతలుంటే డ్రా తీయటం జరుగుతుంది.

విజేతల ఎంపిక
ప్రతిసారి
ఓ సినీ ప్రముఖునిచే...



## ఆధారాలు:

### అడ్డం:

1. ............... రాక్షసివే..గుండెల్లో గుచ్చావె (3)
3. ............... నచ్చినది నాకసలె ఇక నచ్చదురో అంటాడో టక్కరిదొంగ (5)
7. ........ దివిలో వెలసిన పారిజాతమో (1)
8. ............... వున్నది చెప్పాలనున్నది మాటలు రావేం ఎలా ...(4)
11. ..............ఒక పడుచుంది దయ్యమంటే భయమన్నది' (3)
14. ఎంత ....... గాని వేదాంతులైనకాని వాలు చూపు సోకగానే ....రఫీ పాడిన పాట(2)
15. ............. కుయ్యవే గువ్వా మోగిన అందెల మువ్వా (2)
16 ............నైన కలగనలేదే నువ్వువస్తావని నాగార్జున అభినయించిన గీతం (3)
17. .........ధీరా ధీరా ధీరా ధీరా ధీరా ' ఒకే ఒక్కడులో పాట (2)
18. 'మూగమనసులు' సినిమాలో జమున అభినయించిన పాటకు ఆత్రేయ రాసిన పల్లవిలోని మొదటి, చివరి అక్షరాలు (2)
19. 'చిత్రం హాయ్ భళారే విచిత్రం' అనేపాటగల చిత్రం పేరు లోని మెదటి రెండు అక్షరాలు (2)
21. తేనెమనసులు' సినిమాలో రామ్మోహన్, సంధ్యారాణి అభినయించిన పాటకు దాశరధి రాసిన పల్లవిలోని తొలిపదం (2)
22. ....... కాలమా కాస్సేపు ఆగవమ్మా.... జేసుదాసు గీతం (3)
23. కంటేనే ...... అని అంటే ఎలా అని సినారె రాసిన పాట (2)

### నిలువు:

1. '............... బంధువయా భద్రాచల రామయ్యా' రాజేంద్రప్రసాద్ అభినయించిన పాట(3)
2. భలే ఛాన్సులే ॥2॥ లలలాం॥2॥ ...........ఛాన్సులే (2)
3. ........ వాడే అమ్మమ్మో అల్లరి పిల్లవాడే.. (2)
4. ...........మామిడీ కొమ్మ మీదా గూళ్ళు రెండున్నాయి , ఎస్. జానకి పాడినపాట (2)
5. ........ .......... తలుపులు తెరిచిన కనులకు సూర్యోదయం (2)
6. వారెవ్వా ఏమి.......... అచ్చం హీరోలావుంది బాసు (2)
9. ......... దోచుకుందువటే వన్నెల దొరసాని అన్నాడు గులే బకావళి కథలో హీరో (2)
10. నీ ...........తెల్లదనాన్ని నాగమల్లి అప్పడిగింది ఇవ్వద్దూ (3)
11. మాయదారి సిన్నోడు మనసే లాగేసిండు లగ్గమెప్పుడురా............ అంటే (2)
12. '........................... ఈ వాడమనదిరా ' .. ఆర్.నారాయణమూర్తి, వందేమాతరం శ్రీనివాస్ కాంబినేషన్‌లో వచ్చినపాట (6)
13. రా రామ్మని రారా రమ్మని.............. పిలిచెను ఈ వేళ (5)
16. .........కనులతో కలబడితే ఆ తగువుకు ఫలమేమి (3)
20. ........ ........ కో సన్నాయి కోటి రాగాలు ఉన్నాయి (2)

పజిల్, కూపన్
15-12-2003
లోగా చేరాలి

**పంపవలసిన అడ్రసు**

'హాసం- హాస్య సంగీత పత్రిక'
502, శ్రీ బాలాజీ నిలయం, 13-1-212,
మోతీనగర్, హైదరాబాద్-500 018.

మొదటి బహుమతి (ఆల్ కరెక్ట్)



34 పాటలు గల
డబుల్ ప్యాక్ ఆడియో సి.డి.

రెండవ బహుమతి (ఒక తప్పుతో)




18 పాటలు గల
సింగిల్ ప్యాక్ ఆడియో సి.డి.

మూడవ బహుమతి (రెండు తప్పులతో)



29 పాటలు గల
డబుల్‌ప్యాక్ ఆడియోక్యాసెట్

కన్సొలేషన్ బహుమతి (మూడు తప్పులతో)




20 పాటలు గల
సింగిల్‌ప్యాక్ ఆడియో క్యాసెట్

# 'సరిగపదమని-6'

## జవాబులు

**అడ్డం:** 3. మల్లీశ్వరి 5. మిస 7. యమహా 8.కుల 9.మంచి 10.గంగోత్రి 11.కమ్ 12. ఆనాటి 13.మది 14. బొమ్మను 15.చూచీ 17.జాజీ 18. లేతమనసులు 21.భలే

**నిలువు:** 1.ప్రేమికుడు 2. బోయ 3. మహామంత్రి తిమ్మరుసు 4.రిమ్‌జిమ్ రిమ్‌జిమ్ 6.సల 10.గంటి 12.ఆది 13. మగ 15.చూత 16.చీమ 18.లేలే 19. నడి 20. లుక్

### కరెక్టు సమాధానాలు వ్రాసిన వారు:-

ఆర్.ఎమ్.కె.గాంధి- రాజమండ్రి, బి.సీతామహాలక్ష్మి- కొవ్వూరు(ప॥గో॥జిల్లా), వావిలాల కృష్ణకుమారి- హైదరాబాద్, ఉణుదుర్తి నాగబాబు- రాజమండ్రి, పజీమాతాజ్- శ్రీశైలం డ్యామ్ తూర్పు(కర్నూలు), జి.వి.లక్ష్మి- హైదరాబాద్, పప్పుసోమసుందర్- హైదరాబాద్, గొట్టుముక్కల రామకృష్ణంరాజు- పణిదం(గుంటూరు) బొడిగె వెంకటేశంగౌడ్- హైదరాబాద్, ఎన్.ఇందిరా కుమారి- హైదరాబాద్, ఎ.సీతాదేవి- విజయవాడ, ఎ.ఎస్.ఎన్.మూర్తి- మహబూబాబాద్, పులిజాల శాంతిశ్రీ- పెదవేగి (ప॥గో॥జిల్లా), జవంగుల శ్రీనివాస్- సత్తెనపల్లి (గుంటూరు), డి.శ్రీనివాస్- మండపేట (తూ॥గో॥జిల్లా), రాజకొండ శిరీష- సామర్లకోట (తూ॥గో॥జిల్లా), జి.రాములు- గొల్లపూడి(కృష్ణా), తాడిమళ్ళ వెంకటశేషగిరిరావు- రుద్రపాక, డి.లక్ష్మీసుజాత- తణుకు, ఇ.వసుంధర- చెన్నై, పి.శేషారావు- హైదరాబాద్, శిష్టా చంద్ర శేఖర్- విజయవాడ, న్యాయపతి అయిలత- విజయనగరం, జి.వి.ఎస్.తాయరు- భీమవరం, నండూరి కృష్ణమోహన్‌రావు- కర్నూల్, యు.వెంకటలక్ష్మి- కడప, కె.వి.రమణమూర్తి- బిరహాంపూర్ (ఒరిస్సా), మోజెర్ల హనుమంతరావు- రాజమండ్రి, కడలి అప్పారావు- చీరాల(ప్రకాశం), టి.వి.ఎస్.శాస్త్రి- గుంటూరు, ఎ.ఆదినారాయణ- చిలకలూరిపేట (గుంటూరు), ఎమ్.నాగేశ్వరశర్మ- గుంటూరు, పి.కృష్ణప్రియ- సికింద్రాబాద్, అకుండి సూర్యారావు- రాయగడ(ఒరిస్సా), జి.వాణీరమణరావు- భీమవరం(ప॥గో॥జిల్లా), కె.విజయచందర్- హైదరాబాద్, జె.వంశీకృష్ణ- విశాఖపట్నం, సి.వి.ఎన్.సునీల్‌కుమార్- హైదరాబాద్, ఎమ్.సువర్చల శ్రీనివాస్- హైదరాబాద్, ఎ.రామలక్ష్మీదేవి- సెల్‌క్యాంపస్, మహమ్మద్ లతీఫ్- నాచారం (రంగారెడ్డి), పి.పాపారావు- విశాఖపట్నం, ఎమ్.ఎస్.సి.శేఖర్- హైదరాబాద్, క్షీరసాగర లక్ష్మిశ్రీనివాస్- దావణగెరె(కర్ణాటక), ఆర్.మణిప్రసాద్-బదేపల్లి (మహబూబ్‌నగర్), యు.యు.ఉరుకుందు- ఎమ్మిగనూరు, పి.స్వాతిలక్ష్మి- చీపురుపల్లి (విజయనగరం), పి.శేఖర్‌బాబు- ధర్మసాగర్(వరంగల్), వడ్లమన్నాటి నాగసాయి భరద్వాజ్- విజయవాడ, జాగిర్దార్ మాధురి- సామర్లకోట(ప॥గో॥జిల్లా), పి.నాగేశ్వరరావు- సికింద్రాబాద్, గొట్టుముక్కుల బ్రహ్మానందము- శేరిలింగంపల్లి, జి.నాళినికుమారి- సికింద్రాబాద్, ఆర్.ఉషావినోద్- హైదరాబాద్, పి.ఉష- హైదరాబాద్, ఇ.టి.రామారావు- శ్రీహరికోట (నెల్లూరు), మేదా మస్తాన్‌రెడ్డి- విశాఖపట్నం, మద్దాలి మురళీకృష్ణ- నిజామాబాద్, పి.వి.యస్. మల్లేశ్వరరావు- కొత్తగూడెం(ఖమ్మం), బి.రమేష్- బుగ్గలపల్లె(కడప), కుంటా శివనాగేశ్వరరావు- మాచర్ల, ఆమాంచి వెంకటలక్ష్మికామేశ్వరి- రాజోలు(తూ॥గో॥జిల్లా), కె.సత్యప్రకాష్- రాజమండ్రి, ఎమ్.మాధురి రంగారావు- నల్గొండ, పి.రాజిరెడ్డి- హైదరాబాద్, యల్లాపంతుల నారాయణరావు- శ్రీకాకుళం, పి.ప్రశాంత్- సికింద్రాబాద్, గంటిబుల్లబ్బాయి- కొమానపల్లి (తూ॥గో॥జిల్లా), ఎ.కృష్ణకుమారి- సికింద్రాబాద్, ఆర్.శైలజ- కొవ్వూరు (ప॥గో॥జిల్లా), పి.గిరిజాశంకరరావు- హైదరాబాద్, ఎస్.సత్యానంద్- సికింద్రాబాద్, నండూరి రామానుజాచార్యులు- విజయవాడ, ఎ.అరుణ- గుడివాడ (కృష్ణా), వై.బి.వి.ఆర్. మూర్తి- రాజాం, బిహారా శేషసాయి- సత్తెనపల్లి(గుంటూరు), కె.ప్రమద- హైదరాబాద్, తాతా శ్రీరామమూర్తి- విశాఖపట్నం, మద్దుల అప్పారావు- అనకాపల్లి (విశాఖజిల్లా), ఎన్.స్వరాజ్యలక్ష్మి- జి.ఎల్.పురము (విజయనగరం), కె.రాజేశ్వరి- విశాఖపట్నం, సహారె శరణ్య- ఆదోని (కర్నూలు), ఎన్.చంద్రాకళా శంకర్- హైదరాబాద్, ఇ.అన్నపూర్ణ- సికింద్రాబాద్, చేబోలు శ్రీవాణిశైలజ- విశాఖపట్నం, కె.బి.కైలాస్‌నాథ్- అనంతపురం, పోగుల నాగరాజేశ్వరశర్మ- కొత్తపల్లి (కరీంనగర్), ఉప్పల వెంకట రమణయ్య- కడప, పర్వావాసుదేవరావు- దేవరకొండ (నల్గొండ), జి.శంకర్‌రావు- నిర్మల్, ఎన్.టి.కృష్ణ- న్యూఢిల్లీ, ఎమ్.సత్యవాణి- తణుకు(ప॥గో॥జిల్లా), జ్యోతికృష్ణ- హైదరాబాద్, ఎస్.మంజునాథ్ - విశాఖపట్నం, పింగళిశ్యాంసుందర్- బెంగుళూరు, గాడి నరేష్- హైదరాబాద్, సూరి ఉమాపార్వతి- హైదరాబాద్, మధురాపంతుల లక్ష్మి- హైదరాబాద్, ఎన్.దివ్యధాన్యలక్ష్మి- విశాఖపట్నం, ఎలిశెట్టిరామ్మోహనరావు- గరివిడి, ఎమ్.ఎ.ఎమ్.తాయారు- విశాఖపట్నం, తాడి రంగారావు- రాజమండ్రి, డి.సంధ్యారాణి- రాజమండ్రి, ఎ.దుర్గ- గుంటూరు, ఎమ్.విజయకుమార్- కోదాడ (నల్గొండ), ఎ.రవికిరణ్- గుంటూరు, ఎర్రా వాణి-కాకినాడ, పి.శాంతిలక్ష్మి- బిరహాంపూర్ (ఒరిస్సా), పి.వి.సుందర్‌కుమార్- బిరహాంపూర్ (ఒరిస్సా), వల్లినాథ్.కె- నెల్లూరు, కొత్తపల్లిశిరీష- విశాఖపట్నం, చింతల బుక్క ప్రకాశ్- వేములవాడ (కరీంనగర్), పడాలరాము- పాతపట్నం (శ్రీకాకుళం), భోగరాజు సుబ్బారావు- విశాఖపట్నం, జి.డిల్లేశ్వరరావు- ధనుపురం(శ్రీకాకుళం), కె.శ్రీలతానాయుడు- న్యూపాల్వంచ(ఖమ్మం), నెల్లుట్ల రమాదేవి- హన్మకొండ (వరంగల్), దువ్వూరిశ్రీలక్ష్మి- అత్తిలి (ప॥గో॥జిల్లా), యు.ఫణీధర్‌కుమార్- కరీంనగర్, తెలికిచెర్ల రాజేశ్వరరావు- నరసన్నపేట (శ్రీకాకుళం), దాసరి నరసింహ- అనంతపూర్, మహబూబ్ సుభాని- పాలేరు (ఖమ్మం), గంటి భాస్కర రావు- అమలాపురం, నూకల ప్రభాకరశర్మ- మంగళగిరి (గుంటూరు), పి.కృష్ణ- అత్తిలి, హెచ్.వి.రవీంద్రనాథ్- కాజీపేట్ (వరంగల్), టి.ఎస్.ఆర్.శివప్రసాద్- హైదరాబాద్, అనుపోజు శివకుమార్- కొమరవానిపేట (శ్రీకాకుళం), ఎస్.పద్మావతి- ఒంగోలు, ఎం.ఎ.ఎస్.కాశ్యప- కాకినాడ, అడుగుమల్లి సాయిలీల- రేపల్లె (గుంటూరు), సి.కనకదుర్గ- విశాఖపట్నం, అబ్బూరి విజయకుమార్- హన్మకొండ (వరంగల్), కె.సత్యసాయికుమారి- హైదరాబాద్, బి.వి.ఎస్.ప్రసాద్- పుల్లలపాడు (ప॥గో॥జిల్లా), యు.యు.శ్రీరాములు- చెన్నై, ప్రతాపురం రామానుజాచారి- హన్మకొండ, శివనాద్రి ప్రదీప్‌కుమార్- హైదరాబాద్, తమిరశ జానకి- హైదరాబాద్, వి.గిరిజారమణి- అనకాపల్లి, చల్లారాజేశ్వరి- హైదరాబాద్, శివప్రసాద్- హైదరాబాద్, కె.వి.ఎస్.పల్లవి- కావలి (నెల్లూరు), కాదంబరి సాయికిరణ్- ఏలూరు, అవధానం లక్ష్మీమోహన్- తిరుపతి, రఘువంకుదొత్- పాల్వంచ (ఖమ్మం), దారెల్లి తిరుపతయ్య- పాల్వంచ(ఖమ్మం), సి.ప్రదీప్- హైదరాబాద్, ఎ.వి.సూర్యనారాయణమూర్తి- కాకినాడ(తూ॥గో॥జిల్లా), వై.భానుప్రసాద్- కర్నూల్, పొన్నం ఉమాదేవి- చిలకలూరిపేట, ఎ.తరళజ్యోత్స్న- అనంతపురం, ఎ.ఆర్.ఎన్.శర్మ- విజయవాడ, రాజాన రమేష్- బరంపురం(ఒరిస్సా), బలిజేపల్లి లీల- చాడంగి (విజయనగరం), కిశోర్‌కుమార్.ఆర్- గోదావరిఖని (కరీంనగర్), బి.క్రిష్ణమూర్తి- ములకలచెరువు (చిత్తూరు), ఎస్.శర్వాణి- నెల్లూరు, కొండపర్తి శ్రీనివాసరావు- నర్సంపేట (వరంగల్), వేటూరి ఫణికుమార్- అనకాపల్లి, ఆర్.కె.యు.ఎస్.భాస్కరరావు- ములగపూడి(తూ॥గో॥జిల్లా), ఎస్.పద్మావతి- కాకినాడ, సి.ఎస్.లక్ష్మి- కర్నూల్, ఎమ్.రామమోహనాచార్యులు- చమబండ (కృష్ణా), ఆర్.స్పందనరెడ్డి- హైదరాబాద్, గరిమెళ్ళ భాగ్యశ్రీ- ఖమ్మం, నందిరాజు సీతారావమ్మ- హైదరాబాద్, కస్తూరి అనూష- హైదరాబాద్, సి.హెచ్.అరుణకుమారి- యలమంచిలి(విశాఖజిల్లా), కె.వి.ఎస్.పల్లవిసౌమ్య- నెల్లూరు, చుండూరు పద్మప్రియ- నవులూరు(గుంటూరు), పి.మాధుసూధన రావు- ఒంగోలు, జొన్నలగడ్డ జానకిరామశర్మ- ఒంగోలు, కదార్ల నారాయణ- జగిత్యాల (కరీంనగర్), ఎ.వి.పద్మావతి- కావలి, ఎస్.జ్యోతిర్మయి- హైదరాబాద్, పి.వి.రామశర్మ- విశాఖపట్నం, వై.వి.ఎస్.సత్యనారాయణ- కాకినాడ, సి.వి.నారాయణబాబు- గుంతకల్లు (అనంతపురం), దేవరపల్లి నీలకంఠప్రసాద్- కడప, జి.రమాదేవి- శ్రీకాకుళం, పామిడి శైలజ- విశాఖపట్నం, జి.కల్యాణశర్మ- నంద్యాల(కర్నూలు), తాతిరాజు రమణి- బిరహాంపూర్(ఒరిస్సా), ఎమ్.అంజిరెడ్డి- ఒంగోలు, ఎన్.వి.కె. శాస్త్రి- శ్రీకాకుళం, ఎన్.కె.నాగేశ్వరరావు- పెనుగొండ (ప॥గో॥జిల్లా), కే.కమల- హైదరాబాద్, సన్నిధి బాలాత్రిపురసుందరి- ఆకివీడు (ప॥గో॥జిల్లా), తురుమెళ్ళ నాగలక్ష్మీలత- నెల్లూరు, కొత్తపల్లి లక్ష్మి- ఖమ్మం, దూసి జయశ్రీ- హైదరాబాద్, మద్ది నారాయణరావు- నరసన్నపేట, మద్ది త్యాగరాజు- నరసన్నపేట, సి.హెచ్.స్వాతి- విశాఖపట్నం, ఆర్.లీలావతి- హిందుపూర్, దీవి సీతాదేవి- నరసయ్యపాలెం (గుంటూరు), డి.మురళీకృష్ణ- నడుపల్లి(ప॥గో॥జిల్లా), అడపా విఘ్నేశ్వరరావు- పర్లాకిమిడి (ఒరిస్సా), ఎన్.జగన్మోహనరావు- కరీంనగర్, కె.శిరీష- హైదరాబాద్, సాదినేని వెంకటేశ్వర్లు- హైదరాబాద్, కె.సత్యవతి- విశాఖపట్నం, జి.పద్మ- పెందుర్తి (విశాఖజిల్లా), ముగ్గళ్ళరాజ్‌కుమార్- హైదరాబాద్, టి.రేణుకాదేవి- హైదరాబాద్, వజ్రాల శ్వేతదీప్తి- హైదరాబాద్, వాస్తు వరలక్ష్మి- నెల్లూరు, సి.హెచ్.సూర్యనగర్- చీపురుపల్లి (విజయనగరం), వై.సత్యశ్రీనివాస్- నంద్యాల (కర్నూలు), ఎన్.వి.పి.ఎస్.ఎస్.లక్ష్మి- రాజమండ్రి, కె.కె.చారి- నల్గొండ, శ్రీపాద రాజేశ్వర్- హైదరాబాద్, కె.సతీష్‌చంద్ర- విశాఖపట్నం, పి.శేషశాయి- నంద్యాల (కర్నూలు), పి.క్రాంతిశ్రీలత- చీరాల (ప్రకాశం), జి.బాలత్రిపురసుందరి- ఆమదాలవలస(శ్రీకాకుళం), సి.రాజ్యలక్ష్మి- హైదరాబాద్, శ్రీనివాస్ లంకా- హైదరాబాద్, వై.ఆర్.బి.సత్యమూర్తి- హైదరాబాద్, ఘంటసాల సూర్యనారాయణ- గుంటూరు, డి.వి.సీతారామారావు- హైదరాబాద్, భువనగిరి ప్రభాకర్- హైదరాబాద్, బొమ్మకంటి రవికిషోర్- హైదరాబాద్, గంటి పద్మజ- అశ్వాపురం (ఖమ్మం), వై.బోరెడ్డి- సత్తెనపల్లి, కోడలి సీతారామారావు- విజయవాడ, జొన్నల భానుమూర్తి- భీమవరం (ప॥గో॥జిల్లా), పి.హెచ్.శాంతిజ్యోతి- రాజమండ్రి, ఇబ్బాడి శంకరరావు- విజయనగరం, పసుపులేటి ఝాన్సీ- ముగకిలకుదురు (తూ॥గో॥జిల్లా), దెందేటి భూపతిరావు- విశాఖపట్నం, ఆర్.వి.వి.కృష్ణారావు- హైదరాబాద్, బి.వెంకటసుధాకర్‌బాబు- నవులూరు (గుంటూరు), పి.శ్రీనివాసరెడ్డి- నెల్లూరు, మచ్చ లక్ష్మీనరసయ్య- జగిత్యాల, పొన్నం గోపాలకృష్ణమూర్తి- కర్నూలు, పి.వేణుగోపాలరావు- అచ్చంపేట (మహబూబ్‌నగర్), జిడిగుంట రాజ్యలక్ష్మి- హైదరాబాద్, టి.వి.యస్.నారాయణ- సికింద్రాబాద్, ఎ.ఆర్.కె.శాస్త్రి- హైదరాబాద్, ఎ.రామారావు- సికింద్రాబాద్, ఎస్.వి.చంద్రశేఖర్- నగరి (చిత్తూరు), పి.తిరుమలప్రసాద్- హైదరాబాద్, కె.మురళీమోహన్- మార్కాపురం (ప్రకాశం), అవసరాల ప్రసన్నకుమార్- విశాఖపట్నం, కర్రి ఝాన్సీ- హైదరాబాద్, ఘట్టమనేని వెంకట శ్రీనివాసరావు- హైదరాబాద్, రుద్రభట్ల సత్యనారాయణ- విశాఖపట్నం, వేదుల పార్వతి- హైదరాబాద్, ఎ.జె.డెన్నెట్- నిడుబ్రోలు (గుంటూరు), డి.ఎస్.రెడ్డి- నర్సీపట్నం (విశాఖజిల్లా), జి.వాసంతి- హైదరాబాద్, ఆర్.సాయిప్రసాద్‌రావు- హైదరాబాద్, అత్తిసేపల్లి పద్మ- నల్గొండ, రేజేటి వెంకటేశ్వర్లు- గుంటూరు, బి.సూర్యనీలప్ప- కోరుకొండ (తూ॥గో॥జిల్లా), బషీర్ అహ్మద్- అచ్చంపేట(మహబూబ్‌నగర్), సి.విజయసారథి- కర్నూలు, పాలేటి దివ్వాబాబు- కొడూరు (కృష్ణా), బి.ఉదయిని- నెల్లూరు, తలిశెట్టి రామకృష్ణ- విజయనగరం, బి.కవిత- తిరుపతి, సి.సత్యవాణి- సికింద్రాబాద్, కోట సునీత- ఎలమంచిలి (విశాఖజిల్లా), దేవిని కిరణ్‌బాల- హైదరాబాద్, కె.శంకరనారాయణ- హైదరాబాద్, యు.వెంకటేశ్వరరావు- రామగుండం (కరీంనగర్), పి.బి.మురళి- ప్రొద్దుటూరు (కడప), ధందారం లలిత- గుంటూరు, యశ్వంతరావు శేషగిరిరావు- జైపూర్ (ఒరిస్సా), కోట లలిత- సికింద్రాబాద్, కాటేపల్లి కృష్ణమోహన్- మిర్యాలగూడ (నల్గొండ), కె.కామేశ్వరి- హైదరాబాద్, కె.దుర్గాప్రసాద్- హైదరాబాద్, పి.యం.ఆవేరి- హైదరాబాద్, ఎమ్.విజయలక్ష్మి- మహబూబ్‌నగర్, ఈదుమూడి సత్యసోత్రిక- ఒంగోలు, కె.చంద్రశేఖర్- మద్దిలపాలెం (విశాఖజిల్లా), ఇ.మల్లికార్జునప్రసాద్- చిత్తూరు, ఎ.రమణ- ముంబాయి, వి.రామారావు- ముంబాయి, వేక్కె చక్రవర్తి- గరివిడి (విజయనగరం), పి.శ్రీనివాసరావు- కాకినాడ, గలిబి శశికళ- నంద్యాల, జి.ఆర్.శ్రీకాంత్- అనంతపూర్, పి.హెచ్.పరాత్పరరావు- ఏలూరు (ప॥గో॥జిల్లా), డి.వి.వి.ఎస్. ఎస్.రామకృష్ణ- కాకినాడ, టి.శశికళ- గుంతకల్లు, గరిమెళ్ల అన్నాజీరావు- సుబ్బరాయపురం (తూ॥గో॥జిల్లా).

### ఒక తప్పుతో వ్రాసిన వారు:-

డి.రవీందర్- మదిర(ఖమ్మం), ఎమ్.కృష్ణమనోజ్- హైదరాబాద్, నేమాన సుభాష్ చంద్రబోస్- శ్రీకాకుళం, ఎస్.ప్రేమలత- కాకినాడ, పి.ఎన్.ఎస్.లలితలాస్య- సికింద్రాబాద్, ఉదాలిభాసరయ్య- చెన్నై, బొండాడ సునీత- అనకాపల్లి, కె.వి. సరస్వతి- హైదరాబాద్, టి.విజయలక్ష్మి- విజయవాడ, యం.రఘువీర్- సికింద్రాబాద్, జల్లు జయ ప్రకాష్- ముత్యాలపేట (శ్రీకాకుళం), డి.లక్ష్మి- గుంటూరు, ఆర్.కె.గొట్టుముక్కుల- యానాం (తూ॥గో॥), కె.వి.సరోజిని- రామన్నపేట (ప॥గో॥జిల్లా), ఎస్.పుష్పమాలాదేవి- సికింద్రాబాద్, సి.హెచ్. సుమతి పావన్- హైదరాబాద్, ఎ.బాల్‌నాథ్- నిజామాబాద్, యు.జయలక్ష్మి- నిజమాబాద్, యు.గున్నేశ్వరరావు- పొగిరి(శ్రీకాకుళం), పి.వసంత- ఇబ్రహీంపట్నం, సరస్వతుల చైతన్య- సికింద్రాబాద్, దేవరం సతీష్‌కుమార్- జగిత్యాల (కరీంనగర్), కె.వి.దుర్గామోహనరావు- నల్గొండ, బలుపరి విజయ్-సూగూరు (మహబూబ్‌నగర్), బి.బర్నబాస్- రాయతీర్థాల (విజయనగరం) కె.వసంత కుమార్- దేవరకొండ, ఎం.నాగేశ్వరరావు- విశాఖపట్నం, అన్నేశ్వరశర్మ మండపాక- హైదరాబాద్, ఎమ్.సుహాసిని- హైదరాబాద్, కందర్ప అనుపమ- హైదరాబాద్, కె.దుర్గాప్రసాద్- తాడిపత్రి (అనంతపురం), పసుమర్తిజగన్నాథం- విజయనగరం, చెలుకూరి శ్రీనివాసశర్మ- విజయవాడ, సి.హెచ్.చక్రవర్తి- తామరం (విశాఖపట్నం), పద్మముగరాజు- హైదరాబాద్, ఎమ్.వి.చలపతిరావు- పొన్నలూరు (ప్రకాశం), ఎమ్.రాజ్యలక్ష్మి - హైదరాబాద్, జి.పాండురంగశర్మ- హైదరాబాద్, సుంకిశాల సంధ్య- నల్గొండ, ఎ.టి.శ్రీనివాసన్- అనంతపురం, పి.అభినయ్‌రెడ్డి- చిత్తూరు, పన్యాల విజయకుమార్- బరంపురం (ఒరిస్సా), టి.వింధ్యారాణి- నల్గొండ, డి.వేణుగోపాల్- సాలూరు (విజయనగరం), సోమయాజుల రాహుల్- ఒనకడిల్లీ (ఒరిస్సా), కూచి జానకి- హైదరాబాద్, చిట్టా విశ్వేశ్వరశాస్త్రి- హైదరాబాద్, పి.సూర్యనారాయణ- విశాఖపట్నం, కె.విజయ రాఘవన్- వరంగల్, వై.భాస్కర్- హైదరాబాద్, చింతపాటి జయలక్ష్మి- విజయవాడ, కె.చూడమణి- విశాఖపట్నం, సౌమిత్రి రమణాచార్య- హైదరాబాద్, వరదా సాయికుమార్- పర్లాకిమిడి(ఒరిస్సా), సీమనాగ్- జంషెడ్‌పూర్, ముప్పిరాల శశాంక- హైదరాబాద్, ఎమ్.పి.రాజు- విశాఖపట్నం, ఎమ్.కళ్యాణ్- విశాఖపట్నం, ఆర్.రామ్‌మోహన్‌రావ్- శ్రీకాకుళం, భారతుల రామచంద్రమూర్తి- హైదరాబాద్, సలాది గంగాధరకుమార్- ద్రాక్షారామం(తూ॥గో॥జిల్లా), ఆర్.రాఘవేంద్ర రావు- హైదరాబాద్, యు.విజయశేఖరరెడ్డి- హైదరాబాద్, మల్లెల విశ్వేశ్వరరావు- హైదరాబాద్, లంకా శశికాంత్‌చౌదరి- గుంటూరు, ఎస్.ఎస్.కె.సుధాకర్- విశాఖపట్నం, ఎస్.కేశవ అయ్యంగారు- నరసాపురం(ప॥గో॥జిల్లా), గేదెల రామారావు- ఏలూరు, ఎమ్.నర్సయ్య- పాల్వంచ, కొప్పుల ప్రభా తనూజ- కాకినాడ, కొనిదేన అలేఖ్య- గుంటూరు, పద్మావతి కృష్ణమాచార్యులు- హైదరాబాద్, పి.భ్రమరాంబ- హైదరాబాద్, కె.ఎల్.కె.దుర్గా- తణుకు, పి.రమేష్- హైదరాబాద్, ఎం.పురుషోత్తమాచార్య- నల్గొండ, కె.వి.రమణరెడ్డి- హైదరాబాద్, భాగవతుల రత్నావళి- హైదరాబాద్, వై.కమల- హైదరాబాద్, జి.వి.రమణ- సంగారెడ్డి (మెదక్), డి.వి.ఎస్.ఆర్.ప్రసాద్- సికింద్రాబాద్, తోటపూర్ణప్రకాశమ్మ- హైదరాబాద్, పి.బాలాత్రిపురసుందరి- రాజమండ్రి, ఎన్.పద్మజనిర్మల- హైదరాబాద్, బి.ప్రశాంతి- పర్లాకిమిడి (ఒరిస్సా), సయ్యద్ రహమతుల్లా- పర్లాకిమిడి (ఒరిస్సా), ఎస్.సూర్యనారాయణ- హైదరాబాద్, పి.శ్రీనివాస్- తిరుపతి.

### రెండు తప్పులతో వ్రాసిన వారు:-

ధర్మాల సుబ్రహ్మణ్యం- హైదరాబాద్, మద్దిపాటి సూర్య- హైదరాబాద్, ఆర్.శైలజ- కొవ్వూరు(నెల్లూరు), డి.వేణుగోపాల్- అనంతపూర్, కె.మేఘన- రాజమండ్రి, జయపాల్- మదనపల్లి(చిత్తూరు), పానుగంటి జేమ్స్‌దేవరాజు- అచ్చంపేట (మహబూబ్‌నగర్), పి.జయశ్రీ- గుంటూరు, జి.ఎస్.ఆర్.మూర్తి- హైదరాబాద్, పి.వి.ఆర్.యస్.కిరణ్‌కుమార్- నరసాపురం(ప॥గో॥జిల్లా), బుద్ధకృష్ణ- అనకాపల్లి, ఎమ్.ఉష- నడుకదురు(తూ॥గో॥జిల్లా), లోక అరుణ కుమారి- గాంధిపాలెం (నెల్లూరు), పి.కిరణ్‌కుమారి- విశాఖపట్నం, మద్దూరి మధులత- కాకినాడ, జి.శైలేంద్ర- హైదరాబాద్, టి.పిచ్చయ్య- కలుజువ్వలపాడు(ప్రకాశం), కె.పూర్ణాదేవి- పొన్నూరు, పి.వసుంధరాదేవి- ఇడుపులపాడు(ప్రకాశం), వై.మానస- సికింద్రాబాద్, ఎమ్.వి.వి.ఎస్. గోపాలకృష్ణ- విశాఖపట్నం, ఎమ్.జె.అనిల్‌కుమార్ రెడ్డి-పయసంపల్లి (కడప), బి.ఎన్.రమ్యశ్రీ- హైదరాబాద్, ఎ.రాధిక- అమలాపురం, సి.శారదదేవి- హైదరాబాద్, మంత్రిప్రగడ సందీప్- నల్గొండ, సోపెంటి శరత్‌బాబు- హైదరాబాద్, బి.ఆనందకృష్ణ- పుంగనూరు(చిత్తూరు), పి.పద్మావతి- ఖమ్మం, ఇందిర సహారే- కళ్యాణ్(వె), పి.హెచ్.వి.సత్యనారాయణ- విశాఖపట్నం, ఎస్.ఎల్.ప్రసాద్- గుంటూరు, డి.రామకృష్ణ- రాజమండ్రి (తూ॥గో॥జిల్లా), యస్.సత్యనారాయణ- విజయవాడ, పి.రవిబ్రహ్మ-విజయనగరం, పి.వి.రేఖ- కర్నూలు, ఇ.రాధిక- హైదారాబాద్, నిశ్శంకరరావు గంగాధరరావు- గుంటూరు, ఎ.రమణ- దేవరకొండ(నల్గొండ), చవిటిపల్లి త్రిమూర్తులు- నరేంద్రపురం (తూ॥గో॥జిల్లా), పాలెపు శ్రీనివాస్- రాజమండ్రి, బి.వి.ఆర్.మూర్తి- విశాఖపట్నం, ఆర్.ఫణిబాల- ధవళేశ్వరం, జి.ఆర్.వి.వి.కిరీట్- ఒంగోలు, ఎమ్.జగదీశ్వరరావు- విశాఖపట్నం, ఎమ్.నాగేందర్- ఖమ్మం, పింగళికనకవల్లి- గుంటూరు, డి.వెంకటగిరిప్రసాద్- అనంతపురం, ఎల్.వేదవల్లి- విశాఖపట్నం, ఎస్.వాణి స్వయంప్రభాదేవి- విశాఖపట్నం, శిష్టా సీతామహాలక్ష్మి- హైదరాబాద్, జి.శ్యాంసుందర్- కాజీపేట్, తాతిరాజు మోహన్ రావు- విశాఖపట్నం, డి.మల్లిఖార్జున్- ఆదిలాబాద్, యస్.శ్రీనివాసులు- బ్రాహ్మణకొట్కూరు (కర్నూలు), కె.జ్యోతి- ఖమ్మం, కె.మనోరమ- బెంగుళూరు, డి.మార్కండేయులు- నరసరావుపేట, కె.కవిత- ఖమ్మం, ఎ.వరలక్ష్మి దేవి- ఖమ్మం, ఎ.వి.ఎన్.ఎస్.మూర్తి- హైదరాబాద్, జి.శ్రీనివాసరావు- కొత్తపేట (రంగారెడ్డి), ఎ.వి.ఆర్.ఎన్.శ్రీనివాస్- హైదరాబాద్, బి.పద్మావతి- సాలూరు (విజయనగరం), శ్రీపాద జితమోహన్ మిత్ర- రాజమండ్రి, ఎ.పద్మనాభం- హైదరాబాద్, జి.సుదాకర్- నెల్లూరు, గురజాల శ్రీదేవి- విశాఖపట్నం, ఎమ్.ఏడుకొండలు- చిలుకలూరిపేట (గుంటూరు), నీలం రామమూర్తి- కొరాపుట్ (ఒరిస్సా), అత్మూరి వెంకటశరత్‌కృష్ణ- హైదరాబాద్, భాగవతుల సత్యశ్రీనివాస్- విజయవాడ, పాటలపద్మ- అచ్చంపేట, మరువాడ కామేశ్వరరావు- మంచిర్యాల (ఆదిలాబాద్), పి.ఎస్.ఎన్.రాజు- అచ్చంపేట (మహబూబ్‌నగర్), పి.బి.లక్ష్మి- విశాఖపట్నం, ఎమ్.హరిప్రసాదరావు- విశాఖపట్నం, జ్యోతిర్మయి- హైదరాబాద్, పి.వి.ఎన్.ఎస్.పద్మాకుమారి- హైదరాబాద్, జి.నరసింహామూర్తి- అనంతపురం, బెందాళం క్రిష్ణారావు- కవిటి (శ్రీకాకుళం), టి.ఎల్.ఎన్.అచార్యులు- జగ్గయ్యపేట (కృష్ణాపేట), జి వి.ఆర్.మూర్తి- హైదరాబాద్, ఎన్.బలరామదాసు- కొవ్వూరు (ప॥గో॥జిల్లా), టి.జి.ప్రసాద్- కాకినాడ, బిల్లంకొండ రాంబాబు- పమిడిపాడు (గుంటూరు), టి.ప్రమోదకుమార్- కరీంనగర్, వై.అనురాధ- బొబ్బిలి(విజయనగరం), రాయప్రోలు లక్ష్మీదేవి- ఒంగోలు, దేవులపల్లి ఇందిర- సికింద్రాబాద్, ఎస్.ఉమామహేశ్వరి- శృంగవరపుకోట (విజయనగరం), కె.లలిత- హైదరాబాద్, భమిడిపాటి గౌరీశంకర్- నరసన్నపేట (శ్రీకాకుళం), వై.నిర్మల్- గుడివాడ, సి.డేవిడ్‌రాజు- ప్రొద్దుటూరు (కడప), ఎ.మిత్రరంజిత- పాణ్యం (కర్నూలు), అగస్త్యరాజు సాయికౌశిక్- ఒంగోలు, మద్దాలిరామలక్ష్మి- విజయవాడ..

### మూడు తప్పులతో వ్రాసిన వారు:-

ఎ.కృష్ణవేణి- తెనాలి(గుంటూరు), ఎస్.శాంతారామ్- అదోని(కర్నూలు), కె.సూర్యప్రభ- ఖమ్మం, టి.వి.రాఘవశర్మ- చెన్నై, పి.రామజోగారావు- విశాఖపట్నం, సి.హెచ్.నాగమణి- బి.హెచ్.ఇ.ఎల్, టి.వి. సుబ్రహ్మణ్యం- విజయనగరం, మండలీక సుబ్బారావు- కాకినాడ, ఆర్.ఎమ్. ప్రియంక- హైదరాబాద్, పి.మధు- విజయనగరం, ఏలేశ్వరపు హారిత- మంగళగిరి, సి.హెచ్.ఎన్.కె.ప్రసాద్- హైదరాబాద్, వనం జానకీదేవి- పాత పాల్వంచ(ఖమ్మం), మోక్షిత్ ఎరివింటి- వనపర్తి (మహబూబ్‌నగర్) , సాలా రవికుమార్- పాతినమల్లయ్యపాలెం, ఎస్.కళ్యాణ్ చక్రవర్తి- హైదరాబాద్, యం.వి.యస్.లక్ష్మి- కాకినాడ, ఎ.కాశీనాథ్- పీలేరు(చిత్తూరు), వి.ఎస్.ఆర్.శాస్త్రి -వాడపల్లి (నల్గొండ), ఎం.వి.ప్రియదర్శిని- కర్నూలు, సి.ఉమవతి- మార్కాపూర్ (ప్రకాశం), బి.వి.సూర్యనారాయణ- కళింగపట్నం (శ్రీకాకుళం), ఆర్.వి. ప్రసాద్- హైదరాబాద్, సి.హెచ్.శిరిష- హైదరాబాద్, కె.రమణమ్మ- విశాఖపట్నం, పి.నరసింహమూర్తి- హైదరాబాద్, హావులూరి శైలజ- అద్దంకి, బచ్చు విజయ్‌కుమార్- విశాఖపట్నం, పి.వి.శివ ప్రసాద్- నెల్లూరు, బొజ్జ హరికృష్ణ- మద్రాసు, నందగోపాల్- విశాఖపట్నం, జె.వంశీకృష్ణ- హైదరాబాద్, బి.శ్రీధర్- తంగల్లపల్లి (కరీంనగర్), ప్రవీణ్ కుమార్.ఎస్-సంగం (నెల్లూరు), ఎమ్.శ్రీనివాసమూర్తి- మదనపల్లె, కాశీనాధుని విజయలక్ష్మి- విజయవాడ.

'సరిగపదమని - 5,6' డ్రా ఫలితాలను విజేతల అభిప్రాయాలతో సహా ఈ సంచికలో కూడా ప్రచురించలేకపోయాం. వచ్చే సంచికలో ప్రచురించటం జరుగుతుంది. - ఎడిటర్

రచన : ఆచార్య ఆత్రేయ　　గానం : పి.సుశీల

చందమామా.... అందాల మామా
నీ ఎదుట నేను - వారెదుట నీవు
మా ఎదుట ఓ మామా ఎప్పుడుంటావు -
సీత : పెళ్ళిచూపులకు వారొచ్చారు - చూడాలని నే ఓరగ జూశా
వల్లమాలిన సిగ్గొచ్చింది - కన్నులదాకా కన్నులు పోక
మగసిరి ఎడదనె చూశాను - తలదాచుకొనుట కది చాలన్నాను
భాను : పెళ్ళి చూపులలో బిగుసుకొని - పేరేమి, నీ చదువేమి?
నను ప్రేమిస్తావా? వయసెంత? -అని అడిగారా? అసలొచ్చారా?
నాలో వారు ఏం చూశారో - నా వారయ్యారు... అందులకే
మా యిద్దరి జంట... అపురూపం అంట
సీత : చల్లని వెన్నెల దొరవంటారు - తియ్యని నవ్వుల సిరివంటారు
భాను : వెన్నెలలోని వేడిగాల్పులు - నవ్వులలోని నిప్పు రవ్వలు
అనుభవించి అనమంటాను - వయసుకు వైరివి నీవంటాను
సీత : చందమామా... అందాల మామా

రచన : దాశరథి　　గానం : ఘంటసాల, పి.సుశీల

చిట్టిబాబు : దివినుండి భువికి దిగివచ్చె దిగివచ్చె
పారిజాతమే నీవై నీవై
సీత : గుడిలోని ప్రతిమ వచ్చింది వచ్చింది
కోటి ప్రభలతో నీవై నీవై ॥దివి॥
చిట్టిబాబు : అందని జాబిలి అందాలు పొందాలి
అనుకున్నా నొకనాడు ఆనాడు
అందిన జాబిలి పొందులో అందాలు
పొందాను ఈ నాడు ఈ నాడు
సీత : కనరాని దేవుని కనుల చూడాలని
కలగంటి నొకనాడు ఆ నాడు
కల నిజము చేసి, కౌగిలిలో చేర్చి
కరగించేవీనాడు ఈ నాడు ॥దివి॥
సీత : కడలిలో పుట్టావు - అలలపై తేలావు
నురగవై వచ్చావు ఎందుకో?
చిట్టిబాబు : కడలి అంచువు - నిన్ను
కలసి నీ ఒడిలో-
ఒరిగి కరగాలనే ఆశతో ॥దివి॥

రచన : ఆచార్య ఆత్రేయ　　గానం : ఘంటసాల, పి.సుశీల

రాజు : ఏమమ్మా! నిన్నేనమ్మా ఏలాగున్నావు?
భాను : ఏదోలెండి! మీ దయవల్ల ఈలాగున్నాను
రాజు : ఆలాగంటే ఏలాగండి అయిన వాళ్ళని అడిగాము
భాను : అంతేలెండి అంతకుమించిఏదో - ఏదో వుందని అన్నానా?
రాజు : నడవకు - నడవకు అమ్మయ్యో నడిచావంటే అమ్మయ్యో
నడుమే నలిగిపోతుంది - నీ నడుమే నలిగిపోతుంది
భాను : పొగడకు పొగడకు అయ్యయ్యో పొగిడారంటే అయ్యయ్యో
మనిషే వెగటై పోతారూ మనిషే వెగటై పోతారు
రాజు : చూడకు! అలా చూడకు
చూశావంటే ఏదో ఏదో అవుతోంది
ఎదలో ప్రేమే పుడుతోంది
భాను : పుట్టనీ! పాపం పుట్టనీ
పుడితే పెంచేదాన్ని నేనున్నా లాలించే దాన్ని నేనున్నా

రచన : దాశరథి　　గానం : పి.సుశీల

సీత : తెల్లని వన్నెదాన, విరితేనియలూరు మనస్సుదాన, నీ
వెళ్ళిన దారిలోన వినువీధిని, భూమిని, సాగరాన, నా
వల్లభుడెచ్చటైన కానవచ్చెనె? వేదనతీర నాకు యే
చల్లనిమాట చెప్పమనే? చప్పున చెప్పవె రాజహంసమా!
అది పురాణ యుగము దమయంతి నాడు
భాషలన్నియు తెలిసిన వారు వారు
నేను నీ భాష తెలియనిదాన గాన
మనిషి భాషలో మావారి మాట చెపుము -
హంస: ఎవరో ఎవరో నీ వాడు - ఎరుగను ఎరుగను నీతోడు
చుక్కల వీధిన వస్తుంటే - తారల ఊసులు విన్నానే
కలువల కన్నులు గలవాడు - చలువల మనసే గలవాడు
వెన్నెల నవ్వుల వెలిగేవాడు - వస్తున్నాడని అన్నారే?
వాడే నీ వాడా? వాడే నీ వాడా - వాడే నీ వాడా? వాడే నీ వాడా ॥ఎవరో ఎవరో॥
నీటి బాటలో వస్తుంటే - నదీ కన్యల నాట్యం చూశా
పొంగే బంగరు ప్రాయం వాడూ - అలలే హారంగా కలవాడు
అంతు దొరకనీ హృదయం వాడు - వస్తున్నాడని అన్నారే
వాడే నీవాడా? వాడే నీ వాడా - వాడే నీవాడా? వాడే నీ వాడా॥ఎవరో ఎవరో॥
పూలవాడలో వస్తుంటే - మల్లె, జాజి మందారం
నే ముందంటే నే ముందంటూ - తగవులాడగా విన్నానే
తేనెలు దోచె తీయనివాడు - వస్తున్నాడని అన్నారే
వాడే నీ వాడా? వాడే నీ వాడా? - వాడే నీవాడా? వాడే నీ వాడా ॥ఎవరో ఎవరో॥

రచన : ఆచార్య ఆత్రేయ　　గానం : పి.సుశీల, పద్మనాభం (హాస్యనటుడు)

భాను : ఒన్ - టు - త్రీ - ఫోర్ - ఫైవ్ - సిక్స్ - సెవెన్ - ఎయిట్
మాస్టారూ డ్రిల్ మాస్టారూ
ఎయిట్ - సెవెన్ - సిక్స్ - ఫైవ్ - ఫోర్ - త్రీ - టు - ఒన్
మానేస్తారా... ఇక మానేస్తారా?
ఉద్యోగం యిస్తాము చేస్తారా?ఒక ఉద్యోగం యిస్తాము చేస్తారా?
ఒళ్ళు వంచి పని చేయాలి - మెదడుకు పదును పెట్టాలి
రాజు : అమ్మయ్య - మెదడే?
భాను : అది లేకున్నా ఫరవాలేదు - మీకు తోడుగా వుంటాను
రాజు : అమ్మయ్య - ఉంటారా?
భాను : మెలకువగా పని చేశారంటే - మీరే దొరలా వస్తారు
రాజు : మరి జీతం?
భాను : నెలకు ముప్పై రోజులు జీతం - రోజుకు రెండే పూటలు బత్తెం
రాజు : చిత్తం
భాను : పూట పూటకు పని వుంటుంది - నాలుగు రోజులు సెలవుంది
రాజు : సెలవుల్లో ఏం చేయాలి?
భాను : మా కొలువునన్నే మీరుండాలి - మా కనుసన్నలలో మెలగాలి
రాజు : దానికి జీతం?
భాను : నా జీవితం!

రచన : ఆచార్య ఆత్రేయ　　గానం : పి.సుశీల

సీత : అనాదిగా జరుగుతున్న అన్యాయం ఇదిలే
అదేమిటో - ఆడదంటే మగవాడికి అలుసులే
అనాదిగా జరుగుతున్న అన్యాయం ఇదిలే
ఎవడో ఒకడన్నాడని - అదియే ప్రజా వాక్యమని
అగ్నివంటి అర్ధాంగిని అడవికంపె రాముడు - శ్రీ రాముడు ॥అనా॥
జూదమాడి ఒకరాజు ఆలి నోడినాడు
సత్యం సత్యమని ఒక మగడు తన సతిని అమ్మినాడు
అదేమిటో ఆడదంటే మగవాడికి అలుసులే ॥అనా॥
కాలం మారిందన్నారు - సంఘం మారిందన్నారు
మారలేదు మారలేదు - మగవారి మనసులు
ఈ మనసు లేని చేతలు ॥అనా॥

రచన : ఆచార్య ఆత్రేయ    గానం : పి.బి.శ్రీనివాస్, పి.సుశీల

చిట్టిబాబు : ఏం? ఎందుకని? ఈ సిగ్గెందుకని?
ఆలుమగల మధ్యనున్నది ఎవరికి తెలియదని? ॥ఏం॥
దీపముంటే సిగ్గంటివి చీకటైనా సిగ్గెందుకు?
మొగ్గ విరిసే తీరాలి సిగ్గు విడిచే పోవాలి ॥ఏం॥
ఈ గదిలో నీ హృదిలో కౌగిలిలో ఈ బిగిలో
ఎలావుందో - ఏమౌతుందో
ఏం చేయాలని నీకుందో... చెప్పు ॥ఏం॥

భాను : ప్రక్కన చేరాడా? చెల్లీ చెక్కిలి నొక్కాడా?
ప్రక్కన చేరాడా? చేరి చెక్కిలి నొక్కాడా?
ఇక్కడనా? చెక్కిలినా? ఏమిటిదీ? గిల్లినదా?
పంటికి గోటికి తేడా లేదా
ఎందుకులే - ఈ బుకాయింపులు? ॥ఏం॥
పగటి వేషం నాదమ్మా - రాత్రి నాటకం నీదమ్మా
అందుకనీ...

సీత : అందుకని?

భాను : నువు చేసినదంతా చెప్పాలి
నే చెప్పినట్లు నువు చేయాలి ॥ఏం॥

రచన : ఆచార్య ఆత్రేయ    గానం : పి.బి.శ్రీనివాస్, పి.సుశీల, ఘంటసాల

చిట్టిబాబు : పురుషుడు నేనై పుట్టాలి
ప్రకృతే నీవై రావాలి
ఇరువురి మనసులు కలవాలి - ఆ
కలయిక కళకళ లాడాలి ॥పురు॥

భాను : పుడమే నేనై పుట్టాలి - ఒడిదుడుకులను ఓర్వాలి
కడలిని నదినీ కలపాలి - ఆ
కలయిక కళకళ లాడాలి ॥పుడమి॥

చిట్టిబాబు : మెరమెరలాడే వయసు నేనై మిసమిసలాడే సొగసు నీవై
వెల్లువలాగా వెన్నెలలాగా ముల్లోకాలను ముంచాలి ॥పురు॥

భాను : పై మెరుగులకే పరవశమయ్యే - పరువానికి పగ్గం వేసి
పగ్గం పట్టిన కన్నె మనసులో
లోతులు తెలిసీ మసలాలి ॥పుడమి॥

బసవరాజు : దేవుడు నేనై పుట్టాలి - దేన్నో తాను ప్రేమించి
ఆడదాని మనసంటేనే - విషమని తెలిసీ ఏడ్వాలి॥దేవుడు॥
గాజువంటి హృదయం తనది - రాతివంటి నాతికి తగిలి
ముక్కలు చెక్కలుగా పగిలి - నెత్తురు కన్నీరవ్వాలి ॥దేవుడు॥

## అంతా కొత్త తారలే నటించిన తొలి తెలుగు సంచలన చిత్రం

"తేనెమనసులు"కు కొత్త నటులు కావాలని బాబూ మూవీస్ వారు ఒకే ఒక్కసారి ప్రకటన చేయగానే నాలుగైదు వారాలలో ఐదువేల మంది ఫోటోలతో దరఖాస్తులు పంపారు. వారిలో ఔత్సాహిక నటులు, విద్యార్థులు, అధ్యాపకులు, ఏడెనిమిది వందల జీతం తెచ్చుకునే పెద్ద ఉద్యోగస్తులు ఎందరో వున్నారు.

వీరిలో నుండి నూటయాభై మందిని ఎన్నిక చేసి, వారికి మద్రాసు, హైదరాబాదులలో స్క్రీన్‌టెస్టులు తీశారు. అంటే ఒక్కొక్కరిచేత ఒక్కొక్క ఘట్టం నటింపచేసి సినిమా తీశారు. ఆ చిత్రాలన్నిటినీ రెండు వారాలపాటు తిరిగి ప్రదర్శించి చూసి వారిలో పన్నెండుమందిని ఎన్నుకున్నారు. వీరుకాక అర్హులు, సమర్థులు ఇంకా ఎందరో ఉన్నారు.

'తేనెమనసులు' కథ దృష్ట్యా అందులో పాత్రలకు తగిన వారిని ఎన్నుకోవాలి కాబట్టి, అది ఒక ప్రధాన సూత్రంగా ఈ పన్నెండుగురి యెన్నిక జరిగింది. వీరిలో కొందరికి రంగస్థల అనుభవం వుంది. కొందరికి లేదు.

అందరికీ దర్శకుడు ఆదుర్తి సుబ్బారావు, కో డైరెక్టర్ కె.విశ్వనాథ్, నృత్య దర్శకుడు హీరాలాల్ మూడు నాలుగు మాసాల పాటు శిక్షణ ఇచ్చారు. కూర్చోనడం, లేవడం, నడవడం దగ్గర నుండి నృత్యాల వరకూ నేర్పారు. సంభాషణలు చెప్పడం, నటించడం రెండూ పరస్పర సమన్వయంతో నడపడం వగైరాలు నేర్పారు.

నటులందరూ ఉత్సాహవంతులు, సమర్థులు. ఆసక్తితో అన్నీ నేర్చుకున్నారు. కష్టపడి సాధన చేశారు.

ఈ కృషి అంతా కలిసి అత్యంత మనోహరమైన "తేనెమనసులు" రూపం దాల్చింది.

## కథా సంగ్రహం

తోటి మనిషికి అపకారం చేసిన వాడికి, ఆ అపకారి వల్లనే ఉపకారం పొందడం కన్న కఠినతరమైన దండన మరొకటి వుండదు. అంతకన్న హింస ఉండదు. స్వర్గ నరకాలనేవి వేరే యెక్కడో లేవనీ, మన చేతలలోనే, మన అనుభవాలలోనే, వాటిని అర్థం చేసుకునే మనసులలోనే ఉన్నాయనీ అనిపిస్తుంది.

ఒకానొక నరసరాజుగారు తన కూతురు పెళ్ళి ఆగిపోతుందన్న భయంతో మరొక ఆడపిల్ల తండ్రి శ్రీనివాసరావు దగ్గర డబ్బు దొంగతనం చేశాడు. దానివల్ల ఆ యింట్లో పీటల మీద పెళ్ళి ఆగిపోయింది. ఆఫీసు జీతాల సొమ్ము 20వేలు యెవరో యెత్తుకుపోయారంటే యెవ్వరూ నమ్మరన్న భయంతో, శ్రీనివాసరావు భార్యాబిడ్డలను వదలి పరారీ అయిపోయాడు. అతని కూతురు భానుమతి తల్లిని వెంటబెట్టుకుని పట్నం వెళ్ళి జీవనోపాధి కోసం ఒక కంపెనీలో సెక్రటరీగా చేరింది. ఇటు నరసరాజుగారు దొంగసొమ్ముతో పెళ్ళి జరిపించినా, అది ఫలించలేదు. అల్లుడు చిట్టిబాబు అమెరికా నుంచి రాగానే తన హోదాకి ఈ "ముద్దపప్పు" సీత పనికిరాదని యింటినుండి వెళ్ళగొట్టాడు. ఉద్దేశపూర్వకంగానే విధి ఆ అమ్మాయినీ, ఈ అమ్మాయినీ ఒకచోట చేర్చింది.

పెళ్ళిపీటల మీద లేచి వెళ్ళిపోతూ ముఖమన్నా చూడకుండా భానుమతిని కాలదన్నిపోయిన బసవరాజు, పట్నంలో ఆమె ముఖం చూచి, చాలా అందంగా ఉందనుకుని ప్రేమించాడు. తాళి కట్టకపోయినా అతనే భర్తయని నిశ్చయించుకున్న ఇల్లాలు ప్రియురాలై ప్రేమకథ నడుపసాగింది. ఈ స్థితిలో ఆమె కంపెనీ ముఖ్య అధికారిగా వచ్చిన చిట్టిబాబు ఆమెను చూచి మోజుపడి వెంటబడి లొంగదీసుకోబోయాడు. అతనే తన పక్కింటి స్నేహితురాలు సీత భర్త అనీ, ఆమెకన్యాయం చేసి తన వెంటబడ్డాడనీ తెలియగానే, భానుమతి తోటి ఇల్లాలి కాపురం నిలబెట్ట నిశ్చయించింది. చిట్టిబాబును లొంగదీయడం కోసం ఆమె లొంగినట్టు నటిస్తూ ఒక ప్లాన్ వేసింది. ఆ ప్లాన్ ప్రకారం సీతను భానుమతి తనలా అలంకరించి చిట్టిబాబు దగ్గరకు పంపింది. అప్పటికే కళ్లు మూసుకుపోయి ప్రవర్తిస్తున్న చిట్టిబాబు ఈ తేడాను తెలుసుకోలేకపోయాడు. సీత గర్భవతి అయింది. చిట్టిబాబు దొరికిపోయి తప్పు ఒప్పుకుని సీతను ఆదరించాడు. బసవరాజు అంతవరకూ అపార్థం చేసుకున్నందుకూ, పెళ్లి పీటల మీద వదిలి వచ్చేసినందుకు భానుమతికి క్షమాపణ చెప్పుకుని ఆమెను వివాహం చేసుకున్నాడు. నరసరాజు గారు కూడా సొమ్ము దొంగిలించినది తానేనని ఒప్పుకున్నారు. శ్రీనివాసరావు నిర్దోషిగా బయటపడ్డాడు. అందరూ కలిసిపోయారు. శుభం.

## సుకన్య



ఈ కన్య ఇందులో భానుమతి పాత్రను ధరించింది. గోదావరి నడి బొడ్డున కల రాజమండ్రిలో పుట్టింది. విజయనగరంలో చదువు సంజెలు నెరిపింది. తిరిగి రాజమండ్రి చేరింది. నాటకానుభవం బొత్తిగా లేదు. కాని సినిమాల్లో ఛాన్సు లభిస్తే నటించాలనే మనసు వుండేది. అందుకే ఈ అమ్మాయికి 'తేనెమనసులు' ఛాన్సు ఇచ్చింది. ఆదుర్తి సుబ్బారావు స్క్రీన్ టెస్ట్ చేసి -"అమ్మాయి, నీవు సెలక్ట్ అయ్యావు, నెక్స్ట ట్రైనులో బయలుదేరి రా' అన్నారు. టెలిగ్రామ్ చేరిన తరువాత వచ్చిన ఫస్ట్ ట్రైన్‌లోనే బయలుదేరి మద్రాసు చేరింది. సినిమాల్లో నటించాలనే అభిలాష సక్సెస్ అయ్యింది. భానుమతి పాత్రలో నటించి - సైకిలెక్కి చక్కరకొడ్తూ మనల్ని చక్కలిగింతలు పెడ్తుంది.

## సంధ్యారాణి



ఈ రాణి కృష్ణానదీ తీరాన, ఆంధ్రదేశం నడుమ వున్న విజయవాడ నుండి వచ్చింది. పి.యు.సి. చదువుకుంది. ఆటా వచ్చు, పాటా వచ్చు. తెలుగే కాక ఇంగ్లీషు, హిందీ, బెంగాలీ భాషల్లో క్షుణ్ణంగా మాట్లాడగలదు, పోట్లాడగలదు. అయితే ఈ చిత్రంలో చాలా ఓర్పుగా, నేర్పుగా నటించింది. ఈ అమ్మాయికి నాట్యంగూడా బాగా వచ్చు. హైస్కూలులో ఓ మారు ఓ నాటకంలో వేషం వేసి నృత్యం కూడా చేసింది. ఇంట్లో వాళ్ళందర్నీ ఆడియన్స్‌గా కూర్చోబెట్టి - తానే పెద్ద పెద్ద వేషాలు వేస్తూ, అభినయిస్తూ మెప్పిస్తూండేది. సినిమాలంటే చిన్నప్పటినుండి తెగ పిచ్చి, తరగని పిచ్చి కావటం వల్ల నటించాలనే అభిలాష పెచ్చు పెరిగి పోయింది. రానీ అయితే మొదటి షూటింగునాడు గద్గద స్వరంతో చెప్ప వలసిన డైలాగు చెప్పలేక అధైర్య పడి పోయింది.డైరక్టరూ, కో డైరక్టరూ ఎంతగానో ధైర్యం నూరి పోశారు. ఆమెయే స్వయంగా లెక్కకు మించిన గ్లాసులు మంచినీళ్లు, కాఫీ గట్రా తాగి వంటబట్టించుకుని ఆ సన్ని వేశాన్ని అవలీలగా నటించి వేసింది. ఇహ ఈవిడకు నటన వెన్నతో పెట్టిన విద్యయి కూర్చుంది. సంధ్యారాణి సినిమా రాణి అయి కూర్చుంది. 'తేనెమనసులు'లో సీతగా నటించింది.

## రామ్మోహన్



ఈ చిత్రంలో చిట్టిబాబు పాత్రను నటించినా - ఇద్దరు అమ్మాయిలను (సంధ్యారాణి, సుకన్య) అమాంతం ప్రేమించేసి, ప్రేమింప చేసుకున్న గట్టి వాడు! పాపం చిన్నప్పుడు ఒకటో అరో నాటకాల్లో నటించి వుంటాడు. అంతకు తప్ప మళ్లీ ప్రాయం వచ్చాక స్టేజీ ఎక్కి ఎరుగడు. ఇంటర్మీడియట్ చదువుకుని హైదరాబాద్ విమాన సంస్థలో మెకానిక్‌గా పని చేస్తుండేవాడు. సినిమాల్లో నటించాలనే అభిప్రాయం బలమై కూర్చుంది. అసలే కండలు దీరిన మనిషి. బలవంతుడైనప్పటికీ - ఆ అభిప్రాయం ధాటికి తట్టుకోలేకపోయాడు. వెంటనే 'తేనె మనసులు' కొత్త తారల ప్రకటనకు దరఖాస్తు వేశాడు. ఛాన్సు వచ్చింది. అయితే మొదటి రోజు సెట్టులో తీసిన చిత్రాన్ని (రషెస్) చూసిన తర్వాత బలేగా ఖంగారు పడిపోయాడట. తెరపై జూసుకుని గజగజ వణికి పోయాడట. తనేమో సరిగ్గా చేయలేదేమో అనుకున్నాడట. సరిగ్గా చేయకపోతే డైరక్టరు 'ఓకె' అంటాడా? బడిలో పిల్లాడికి చెప్పినట్లు చెప్పడం-తన్నో నటునిగా తీర్చి దిద్దినదంటాడు. నదురూ బెదురూ లేకుండా నటించాడు.

## కృష్ణ

ఈ అబ్బాయిది తెనాలి. కామ్‌గా బి.కామ్. చదివాడు. కొద్దిగా నాటకానుభవం ఉంది. సినిమాల్లో నటించాలనే అనుభవమూ ఉంది. అందుకే కొన్నాళ్లు మద్రాసులోని టి.నగర్ వాసాలను పట్టుకుని తిరిగే వాడు. సరియైన అవకాశం చిక్కక తానూ చిక్కి తెనాలి చేరుకున్నాడు. ఆ లోగా బాబూ మూవీస్ వారి ప్రకటన వచ్చింది. దరఖాస్తు వేశాడు. రమ్మంటే రమ్మన్నారు. నటించాడు- నర్తించాడు కూడా. నృత్యం చేసేటప్పుడూ, పాటకు లిప్‌మూమెంట్ యిచ్చేటప్పుడూ చాలా కష్టపడ్డానంటాడు. నృత్య దర్శకుడు హీరాలాల్, దర్శకుడు శ్రీ సుబ్బారావు, కో దర్శకుడు విశ్వంగారలు తన్ను గురించి - నటనలోని మెరుగులను గురించీ చాలా కష్టపడ్డారంటాడు. చిత్రం పూర్తయిన తరువాత తన నటనను చూసుకుని చాలా తేలిక పడ్డానంటాడు కృష్ణ ఇందులో బసవరాజుగా నటించాడు. ( ఈ ఘట్టమనేని శివరామకృష్ణ సూపర్‌స్టార్ అవడం, అలా సూపర్‌స్టార్ అవడానికి ముందు జరిగిన ఆ ఘట్టాలన్నీ అందరికీ తెలిసినవే. ఈ సినిమాలోని 'వన్ టూ త్రీ ఫోర్' పాటలో తనకు - ప్రముఖ హాస్యనటుడు, ఆ తర్వాత దర్శకుడూ అయిన పద్మనాభం ప్లేబ్యాక్ పాడరని కృష్ణగారికి అప్పట్లో తెలియదట. ఈ విషయం 'హాసం' ద్వారానే తెలుసుకున్నానని ఆయన అన్నారు. ఆ వివరాలు హాసం 25వ సంచికలో చదివిన పాఠకులకు గుర్తుండే ఉంటుంది.)



## పి.వెంకటేశ్వరరావు



ఈయనది మచిలీపట్నం. హిందూ కళాశాలలో బి.ఏ. ప్యాస్ అయ్యాడు. పూనాలో ఎం.ఏ. చదివారు గానీ పూర్తి చేయలేదు. ఒకటిన్నర దశాబ్దాల నుంచీ నాటకాల్లో నటిస్తున్నారు. ఆంధ్ర నాటక కళాపరిషత్తులోనూ, ఇతర పరిషత్తుల్లోనూ మూడు నాలుగు సార్లు ఉత్తమ హాస్య నటునిగా బహుమతులను పొందారు. 'ఇదేమిటి' నాటకంలోని ప్రసాద్ పాత్రకు వీరినే ఘనంగా చెప్పుకోవాలి. ఆ నాటకాన్ని శ్రీ ఆదుర్తి సుబ్బారావు చూసి వీరికీ అవకాశాన్నిచ్చారు. పైగా ఆ నాటకం నాడే వాగ్దానం కూడా చేసేశారు వేషమిస్తానని. ఉద్యోగం విజయవాడలో - పోస్టు అండ్ టెలిగ్రాఫ్స్‌లో! 'తేనెమనసులు'లో చిట్టిబాబు అన్న రంగారావుగా 'నస' ఊత పదంతో గిలిగింతలూ పెట్టారు.

## జి.ఎస్.ఆర్ మూర్తి



ఈయనది విజయవాడ. ర.స.న. సమాఖ్యలో రాటుదారిన మనిషి. ముదిగొండ లింగమూర్తి వ్రాసిన 'వెంకన్న కాపురం' నాటకంలో వెంకన్నగా మద్రాసులో నటించి, అందర్నీ మెప్పించి ఉత్తమ నటుని బహుమతిని పట్టుకుపోయారు. 'రాగరాగిణి' నాటకంలో కూడా ప్రశంస నీయంగా నటిస్తారు. 1927 సం॥లో జన్మించారు. 'తేనె మనసులు'లో నరసరాజుగా నటించారు. వీరి పేరు గిడుగు సీతారామచంద్రమూర్తి. ఎస్.ఎస్.ఎల్.సి.చదివిన తరువాత విశాఖపట్నంలో కొంతకాలం, మిలటరీలో కొంతకాలం చేశారు. ఉద్యోగం విజయవాడలోని ఆంధ్రా సిమెంటు కంపెనీలో. ఈయన 'దొంగ వీరుడు' నాటకంలో వృద్ధ జమీందారు పాత్రను అమోఘంగా నటిస్తారు. 100కు పైగా సార్లు ఆ నాటకాన్ని ప్రదర్శించి వుంటారు.

## పుష్పకుమారి



కృష్ణా జిల్లా గుడివాడ తాలుకా విన్నకోట గ్రామంలో పుట్టింది. గుడివాడలో పెరిగింది. ప్రస్తుతం మకాం కూడా ఆ గుడివాడే! నాట్యం బాగా వచ్చు. చాలా నాటకాల్లో నటించింది. అనేక పరిషత్సభలలో అనేక సమాజాల వారితో పాల్గొని - లెక్కకు మించిన బహుమతులను సంపాదించింది. తీరిక సమయాలలో సినిమా చూడటం హాబీ అయి -ఆఖరికి సినిమాల్లో నటిస్తే బాగుండుననే నిర్ణయానికి వచ్చింది. 'తేనెమనసులు' చిత్రం ఆ వరాన్ని ప్రసాదించింది. మనకు వరంగా (వరలక్ష్మి) ఈ చిత్రంలో ఈమె సాక్షాత్కరిస్తుంది.

## యం.వి.చలపతిరావు

అస్తమానూ అడ్డగాడిదా, గాడిదా అంటూ భార్యా బిడ్డల్ని గాడిదల్ని చేస్తూ వచ్చే వీరభద్ర స్వామి పాత్రను ధరించాడీయన. విజయవాడ రైల్వేలో ఉద్యోగం. ఈయన చాలా పొట్టి మనిషే అయినా నటనలో మాత్రం గట్టి మనిషి - గడుగ్గాయి. నాటకాల్లో నటించడమంటే మహా పండుగ ఈయనకు. బందరులో ప్రదర్శించిన 'ఇదేమిటి' హాస్య నాటికలో ప్రెసిడెంటు వేషం వేశాడు. ఈ వేషం, అభినయం శ్రీ ఆదుర్తి సుబ్బారావు కి బాగా నచ్చింది. అదే 'తేనెమనసులు' చిత్రంలో అవకాశం లభించడానికి మార్గమయ్యింది. ఈయన అనేక పరిషత్తులలో పాల్గొని ఉత్తమ హాస్య నటునిగా బహుమతు లందుకున్నారు.



## రాధాకుమారి

ఈమెది విజయనగరం. విజయనగరం రాఘవ నాటక పోటీల్లో పాల్గొని చాలాసార్లు ఉత్తమ నటిగా బహుమతులను తెచ్చుకుంది. నవ్వించే వేషాలు, కవ్వించే వేషాలు, ఏడ్చే వేషాలు, ఏడిపించే వేషాలు, హాస్య వేషాలు, లాస్య వేషాలు, గయ్యాళి వేషాలు, నెయ్యాలి వేషాలు లాంటివన్నీ వేసింది.



గతంలో హైదరాబాద్‌లో జరిగిన ఆంధ్ర నాటక కళా పరిషత్తులో ప్రదర్శించిన 'నాలుగిళ్ల చావడి' పాత్రను నటించి - ఉత్తమ నటిగా బహుమతిని సంపాదించింది. ఈ చిత్రంలో నాగరత్నమ్మగా కనిపిస్తుంది. (ఈ కుమారి ప్రముఖ నటుడు, రచయిత అయిన రావి కొండలరావు గారికి శ్రీమతి కూడా. ఇటీవల విడుదలైన 'ఒకరికి ఒకరు' చిత్రంలో బామ్మగా వేసిన సంగతి పాఠకులీపాటికి గుర్తు పట్టివుంటారు.)

## కోనేశ్వరరావు

పసితనంలో కోనేశ్వరరావు పదిమంది మాటా, చేతలను అనుకరించి - అభినయించి మెప్పించడాన్ని నేర్చుకున్నాడు. ఆ ఉత్సుకత, ఉత్సాహము నాటకాల్లో నటునిగా చేసింది. బందరులోని వసంతవనిలో సభ్యునిగా వుంటూ 'అపరాజిత', 'ఫణి' ఆదిగా గల నాటకాల్లో వేషాలు వేసి పరిషత్సభలలో పాల్గొని ప్రైజులు సంపాదించాడు. ఇంటర్‌మీడియట్ చదువుకున్నాడు గాని ఉద్యోగాలేవీ చేయలేదు. సినిమాల్లో నటిద్దామనే పనిగా పెట్టుకుని - కొన్నాళ్లు మద్రాసులో మకాము పెట్టి తిరిగి బందరు చేరుకున్నాడు. అదృష్టం బాగుండి 'తేనెమనసులు'లో అవకాశం లభించి - శ్రీనివాసరావు పాత్రను ధరించాడు. అనేక పర్యాయములు మద్రాసులోని ఏ.ఐ.ఆర్. నాటకాల్లో పాల్గొన్నాడు.



## వాణీబాల

ఈమెది కూడా మచిలీపట్నమే! 'వసంతవని' నాటక సమాజంలో సభ్యురాలే! అనేక నాటకాల్లో అనేక పాత్రలను ధరించి విశేషంగా బహుమతులను పుచ్చుకుంది. విజయవాడ, మద్రాసు,ఢిల్లీ, హైదరాబాద్, బొంబాయిల్లాంటి నగరాలల్లోని రంగ స్థలాలపై అనేక నాటకాల్లో ప్రధాన పాత్రలు ధరించింది. మద్రాసులో ప్రదర్శించిన 'అపరాజిత' నాటకంలో ఉత్తమనటిగా ఎన్నుకోబడింది. 'తేనెమనసులు'లో జానకమ్మగా నటించింది.



## రోజారాణి

స్వంతవూరు తెనాలి అటగాని కొంతకాలం వీళ్ల నాన్నగారు మద్రాసులో పనిచేశారట. అప్పుడే యీ రోజా ఆదివారం రోజున జరిగే పిల్లల రేడియో కార్యక్రమాల్లో పాల్గొంటుండేదట. ఇపుడు హైదరాబాద్‌లో పదో క్లాసు చదువు కొంటోంది. బడి నాటకాల్లో వేషాలు వేసింది. కాబట్టి సినిమాల్లో కాస్తా బాగుండునని తలంచింది. మరి ఎలాగా? 'తేనె మనసులు' చిత్రంలో 'చిన్ని' అనే చిన్న వేషాన్ని యిచ్చారు. చాలా పెద్దగా చేసి పెద్దల్ని, చిన్నల్ని మెప్పించింది. (తర్వాత ఈ అమ్మాయి పెరిగి పెద్దయ్యాక హైద్రాబాద్ దూరదర్శన్‌లో ఉద్యోగం చేస్తూ, ఆ చిన్ని తెరపై కూడా ఎన్నోసార్లు కనిపించి, అక్కడే పనిచేస్తున్న శాంతిస్వరూప్‌ని వివాహం చేసుకుంది.)



# సాంకేతిక నిపుణులు

| | | |
|---|---|---|
| కథ | : | ముళ్ళపూడి వెంకటరమణ, కె.విశ్వనాథ్, కె.ఆర్.కె.మోహన్ |
| మాటలు | : | ఆత్రేయ, కె.విశ్వనాథ్ |
| పాటలు | : | ఆత్రేయ, దాశరథి |
| సంగీతం | : | కె.వి.మహదేవన్ |
| గాత్రం | : | పి.సుశీల, ఘంటసాల, పి.బి.శ్రీనివాస్ |
| కళ | : | జి.వి.సుబ్బారావు |
| నృత్యాలు | : | హీరాలాల్ |
| రాజహంస నృత్యం | : | జయశ్రీ |
| రాజహంస కళ | : | తోట |
| రాజహంస దుస్తులు | : | అచ్యుతం |
| మేకప్ | : | కె.నాగేశ్వరరావు |
| దుస్తులు | : | పి.రామకృష్ణ |
| శిరోజాలంకరణ | : | సుందరం |
| ఛాయాగ్రహణం | : | పి.యస్.సెల్వరాజ్ |
| ఛాయాగ్రహణ సహకారం | : | పాచ్చూ |
| స్పెషల్ ఎఫెక్ట్సు | : | మదనమోహన్ |
| పాటల రికార్డింగు | : | రంగస్వామి, వి.శివరామ్, మాణిక్యం, రామనాధన్ |
| మాటల రికార్డింగు | : | జి.జి.కె.గోఖలే |
| రీ రికార్డింగు | : | స్వామినాధన్ |
| కూర్పు | : | టి.కృష్ణ |

## సహకారుల్లో....

| | | |
|---|---|---|
| దర్శకత్వం | : | పి.నాగాంజనేయులు, టి.మాధవస్వామి, వీణ శ్రీనివాసరావు |
| ఛాయాగ్రహణం | : | రామకృష్ణ, హరనాథ్ |
| శబ్దగ్రహణం | : | దర్శన్‌సింగు, సోమయ్య |
| సంగీతం | : | పుహళేంది |
| కూర్పు | : | ఆదుర్తిహరనాథ్, జి.జి.కృష్ణారావు |
| కళ | : | జె.సూర్యనారాయణ |
| దుస్తులు | : | పి.నాగరాజారావు |
| షూటింగు | : | సారధీ స్టుడియో, హైదరాబాద్ |
| ఔట్‌డోర్ యూనిట్ | : | ప్రసాద్ ప్రొడక్షన్సు |
| కలర్ ఫోటోలు | : | కళాక్షేత్ర కలర్‌లాబ్ |
| స్టిల్సు | : | సత్యం (జైహింద్ స్టుడియోస్) |
| ఈస్టుమన్ కలర్ | : | రాజన్ (జెమినీ కలర్ లేబరేటరీస్, మద్రాసు) |
| సమర్పణ | : | పాల్స్ & కో |
| ఆఫీసు సారధ్యం | : | వెంకటాచలం |
| ప్రొడక్షన్ సారధ్యం | : | వి.సి.గణేశన్ |
| కో డైరెక్షన్ | : | కె.విశ్వనాథ్ |

| | | |
|---|---|---|
| నిర్మాత | : | సి.సుందరం |
| స్క్రీన్‌ప్లే - దర్శకత్వం | : | ఆదుర్తి సుబ్బారావు |

# తారాగణం

| | | |
|---|---|---|
| రామ్మోహన్ | : | చిట్టిబాబు |
| కృష్ణ | : | బసవరాజు |
| వెంకటేశ్వరరావు | : | రంగనాథం |
| కోనేశ్వరరావు | : | శ్రీనివాసరావ్ |
| చలపతిరావు | : | వీరభద్రం |
| జి.యస్.ఆర్.మూర్తి | : | నరసరాజు |
| సంధ్యారాణి | : | సీత |
| సుకన్య | : | భానుమతి |
| పుష్పకుమారి | : | వరలక్ష్మి |
| వాణిబాల | : | జానకమ్మ |
| రాధాకుమారి | : | నాగరత్నం |
| బేబీ రోజారాణి | : | చిన్ని |
| జి.వి.సుబ్బారావు | : | ఆఫీసు మేనేజర్ |
| కె.వి.చలం | : | జి.డి.అండ్ కో ప్రొప్రయిటర్ |
| గరిమెళ్ళ రామమూర్తి | : | లాయర్ |
| చంద్రశేఖరరావు | : | నరసింహాచారి |
| ఎం.రామదాసు | : | చెవిటివాడు |
| ఓ.రామ్మూర్తి | : | రామదాసు |
| సి.హెచ్.కబీర్‌దాస్ | : | వడ్డీవ్యాపారి |
| ఎస్.వాసుదేవరావు | : | మార్వాడి |
| సరిత | : | సరిత |
| ఆనందమోహన్ | : | బ్యాంకు గుమాస్తా |


సి.సుందరం


ఆదుర్తి సుబ్బారావు


ముళ్ళపూడి వెంకటరమణ


కె.విశ్వనాథ్


ఆత్రేయ


దాశరథి


మహదేవన్


ఘంటసాల


పి.సుశీల


పి.బి.శ్రీనివాస్



అంతగా నను చూడకు (మంచి మనిషి)



నమో వేంకటేశా...



సింగారి చెకుముకి రవ్వ (నిర్దోషి)



పాడుతా తీయగా చల్లగా (మూగ మనసులు)

# డిసెంబరు 4
# ఘంటసాల జయంతి
# సందర్భంగా...



రాగమయీ రావే (జయభేరి)



కోలో కోలోయన్న కోలో నా సామి (గుండమ్మ కథ)



జగమే మాయ
(దేవదాసు)



ధారుణి రాజ్య సంపద
(పాండవ వనవాసం)



మనసున మనసై (డాక్టర్ చక్రవర్తి)



నీతికి నిలబడి నిజాయితీగా
పదరా (పూలరంగడు)

